గాంగ్రంథమాలిక ౮.

# వామనపురాణము

(మొదటిసంపుటము)



సంపాదకుడు

నడకుదుటి వీరరాజు పంతులు

# వామనపురాణము.

( మొదటిసంపుటము. )



నడకుదిటి వీరరాజు పంతులు.

సంపాదకుడు.

వె రు ౧-౮-౦ లు.



పి ఠా పు ర ము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.

౧౯౨౭.



శ్రీరామ

# వామనపురాణము

## హరలప్రత

శ్రీనారాయణదేవుని
కానరుచు సర్వోత్తముగను, సంబరు భాషా
జ్ఞానునకు వ్యాసదేవున
కానతిశతము లిడి కృతికి ప్రారంభింతున్.

క. బలిచక్రవర్తివలనన్
త్రిలోకరాజ్యము గ్రహించి, త్రిదశేశునకున్
లలి నొసఁగిన భక్తప్రియ
సులభుని వామనుని హరి, సుందరుఁ గొలుతున్.

మహాత్ముఁడైన నారదముని లోకపూజ్యుఁడు వాగ్విశారదుఁడు, పులస్త్య మహర్షీశ్వరుని యాశ్రమమున కేతెంచి యాశ్రమాసీనుఁడై యున్న రాజర్షిచంద్రుని గాంచి యిట్లని ప్రశ్నించెను.

ఓ బ్రాహ్మణోత్తమా! నీవు త్రికాలజ్ఞుఁడవు. భూతభవిష్యద్వర్తమానములు నీకుఁ బ్రత్యక్షములు; అందుచే భగవంతుఁడైన శ్రీమహావిష్ణువు వామనావతారమును ధరించుటకుఁ గారణ మేమో నీవలన వినఁగోరుచున్నాను. ఆ విషయమును సవిస్తరముగా నాకు

వివరించి చెప్పుము. దైత్యకులతిలకుఁడైనప్రహ్లాదుఁడు పరమవైష్ణవుఁడయ్యు నమరగణముతో సమరము నేల గావించెను? ఆవిషయమునగూడ నావమనస్సునం దనేకసందేహములు బాధించుచున్నవి. ఓద్విజశ్రేష్ఠా! దక్షునికూఁతురును, ఉత్తమోత్తమురాలు నైనసతీదేవి మహదేవుఁ డైనశంకరునకుఁ బ్రియతమభార్య యయ్యు నెందుల కావె నిజశరీరమును బరిత్యజించి గిరిరాజైనహిమవంతునింట జనియించెను? అట్లయ్యు నామె మరల నెందులకు దేవదేవుఁడైన మహాదేవునకుఁ బత్ని యయ్యెను? నీకు సకలవిషయములు నవగతములే. కావున వానిని నా కెఱింగించి నాసంశయముల నివారింపుము. ఓబ్రహ్మజ్ఞమూర్తీ! తీర్థాదులమాహాత్మ్యము, దానాదులఫలము, వ్రతాదులవిధానము నాకుఁ దెలియఁజేయుము. ఈవిధముగా మహర్షియైన నారదుఁడడుగఁగా, ఋషిప్రముఖుఁడును, వాగ్మిశ్రేష్ఠుఁడు నైన పులస్త్యుఁడు తపోధనుఁడైన నారదున కిట్లుత్తర మిచ్చెను. ఓమునిసత్తమా! వామనపురాణవిషయములను నే నాద్యంతముగ నీకడ వర్ణనము గావించెదను. నీ వేకాగ్రచిత్తముతో నాకర్ణింపుము.

ఒకానొకప్పుడు మందరపర్వతమున గ్రీష్మకాల మాసన్నమగుటఁ జూచి హైమవతీదేవి మహేశ్వరునితో నిట్లనియెను-- దేవా! గ్రీష్మ మాసన్నమైనది. మన కొకనివాసగృహము లేదు. ఇప్పు డెక్కడనుండి మన మీప్రచండవాయుప్రవాహమునందును, ఈయాతపతాపమునందును నేవిధముగాఁ గాలయాపనము గావింపఁగలము? ఈపలుకు విని మహాదేవుఁ డిట్లుత్తర మిచ్చెను.

“ఓకళ్యాణీ! నేను నిరాశ్రయుఁడను. నిరంతరము నరణ్యములయందు చరించుచుఁ గాలయాపనముఁ జేయఁగలను—” పార్వతి మాఱుపలుకలేదు. శంకరుఁడు సతీదేవితో స్వేచ్ఛగా వృక్షమూల

లయందు వసించుచు గ్రీష్మమును గడపివేసెను. అట్లే నిదాఘకాల
ల్లఁ గడచిపోయెను. ఆకసమును గాఢాంధకారముచేఁ గప్పివేయుచు
యంకరగర్జనములతో వర్షకాల మరుదెంచెను. ప్రావృట్కాలము
పించుటఁ జూచి, దక్షతనూజ—సతీదేవి, మరల నొకమాఱు
హాదేవుని సమీపించి తిన్కోమలసుస్వరముతో నిట్లు పలికెను. మ
హేశా! వర్షకాల మాసన్నమైనది. హృదయవిదారకముగాఁ బ్రబల
యువు ప్రవహింప మొదలుపెట్టినది. జలధరములగంభీరగర్జనము
రంభమయినవి. నీలమేఘములనడుమ విద్యుల్లతలు తళతళకాం
లతోఁ బ్రాఁకులాడుచున్నవి. మఱియు మయూరబృందములు
రవముల కందుకొనినవి. గగనమండలము వారిధారల నొసఁగి
మండలముతో వియ్యమందుచున్నది. బకహంసాది పక్షిగణము
ఘుని భజించుచున్నది. కదంబవృక్షములు, మద్దిచెట్లు, కేతకి
జములు, మారుతాహతులచేఁ బుష్పరాశిని భూపతితముఁ గావిం
చున్నవి. దుర్జను లేపుమాపుటవలన సజ్జనులు సుఖకరము లగు
యునికిపట్టుల వీడి యొందేనిపోవునట్లు, హంసబృందములు మేఘుని
గర్జనములు వినఁబడుటచే సరోవరములఁ బరిత్యజించి వెడలిపో
న్నవి. శంకరా! జలదజాలములు నభోమండలమున నభివర్ధనము
చు సంతోషచిత్తములతో వనప్రదేశములకుఁ బరుగెత్తుకొనివచ్చు
న్నవి. మఱియుఁ గ్రీడాసక్తములైన మృగసమూహము లతివేగ
నిష్టప్రదేశములకుఁ బ్రయాణములు సేయుచున్నవి. పక్షిసం
ఘంబులు జడిధారల కోరువలేక నిలువఁ దావులు గానక, వర్షోద్రే
కి నుపశమింపఁజేయు మని భగవానునిఁ బ్రార్థించుచున్న వేమో
నట్లు దలలు గుంచి నిశ్చలచిత్తములతో వృక్షశాఖలపైఁ గూరు
న్నవి. మద్దిచెట్లచేఁ జుట్టుకొనఁబడిన యీప్రదేశమునం దుద్వేగ

ముతో నదీప్రవాహము ప్రవహించుచున్నది. ఓశశాంకశేఖరా! అందుచే నొకవిన్నప మొనరించుకొనుచున్నాను—ఓశంకరా! ఉన్నతమైన మందరపర్వతమునం దొకగృహమును నిర్మింపవలయును. అట్లయినచో మనము నిశ్చింతగా నుండఁగలము! సతీదేవియనృతా యమానములైన యీపల్కుల నాలించి త్రినేత్రుఁ డిట్లనియెను. ప్రియా! గృహనిర్మాణమునకు నాయొద్ద నించుకయైన ధనము సంపాదింపఁబడియుండలేదు. నేను బులిచర్మమును ధరించియున్నాను. నరరాజు నాయజ్ఞోపవీతము. పద్ముఁడు, పింగళుఁడు నను విషధరు లిర్వురు నాకుఁ గర్ణకుండలములు. కంబలుఁడు ధనంజయుఁడు నను భుజంగములు నాకుఁ గేయూరములు. వామహస్తమునకు అశ్వతరుఁ డనునాగమును, దక్షిణకరమునకుఁ దక్షకుఁ డను భుజంగమును నాకుఁ గంకణములు. నీలాంజనమువంటి వర్ణవిశేషము గల నీలుఁడను విషధరము నాకు మొలనూలు." శంకరుఁడు చెప్పిన యీప్రియవాక్యములను విని సతీదేవి శంకితురా లయ్యెను. కష్టముచేతను లజ్జవలనను అధోముఖియై, వేఁడినిట్టూర్పులు వెడలించుచు విలపింప మొదలుపెట్టెను మరల నామె «ఓఅవ్యయా! అట్లయిన నా కొక్కమాట చెప్పుము ఈవృక్షమూలముల నివసించుచు మన మిట్లులే యీవర్షకాలమును గడపవలయునా?" అని యడిగెను. అప్పుడు శంకరుఁడు—సతీ! మన మీవర్షకాలమున మేఘమండలమధ్యమునందు నివసింతము రమ్ము అట్లయిన నంబుధారలింక నీదేహాలతిపైఁ బడఁజాలవు" అని పలికెను.

అనంతరము శంకరుఁడు మహోన్నతమైన యొకమేఘఖండము గావించి దక్షతనూజతో నచట వాసముచేసెను. నాఁటనుండియు మహేశ్వరుఁడు జీమూతకేతుఁ డనునామముతో జగమునఁ బ్రఖ్యాతుఁ డయ్యెను.

## —♦ నరోత్పత్తి—ప్రళయకథనము. ♦—

మరలఁ బులస్త్యుఁ డిట్లు చెప్పఁదొడంగెను.—ఓమునిచంద్రా! తరువాత నా మేఘములయం దుండియే యుమాశంకరులు ప్రావృట్కాలమును గడపిరి. లోకముల కానందవర్ధకమును, రమణీయము నైన శరత్కాలము సమీపించెను. అప్పు డాకాశతలమున నీలమేఘమాలికలు జన్మాంతరములఁ బొందియుండెను ; వృక్షములు మొగ్గఁదొడఁగ నారంభించెను. నదీపార్శ్వములు ప్రకాశమానములు గాఁజొచ్చెను. జలాశయములు నిర్మలము లయ్యెను. పద్మసుగంధము ప్రభవించుచుండెను. అగురుచందనముల కగ్రిసంచార మారంభమయ్యెను. పంకజములు ప్రఫుల్లము లగుచుండెను. చంద్రకిరణములకుఁ బ్రభాతిశయము గలుగుచుండెను ; లేవగుంపులు పుప్పొడులచే నలరారుచుండెను. గోబృందము లానందధ్యానము లొనరింపఁజొచ్చెను. సాధుగణములు సంతోషచిత్తములతోఁ దిరుగాడుచుండెను. సరోవరములందు పద్మములు, గగనమునందు నక్షత్రములు, జలాశయములందు శుభ్రకాంతులు, సాధుహృదయములందు దిగంతములందుంబ సరళత్వము, వెన్నెలలకు నిర్మలత్వము విరాజిల్లఁజొచ్చెను. ఇట్టిరమణీయమైన శరత్కాలమునందు మహాదేవుఁడు మేఘములమీఁది నివాసమును విడిచి పార్వతితోఁగూడ మందరపర్వతమునకు బయనమయ్యెను. తరువాత గిరిశ్రేష్ఠమైన యామందరముపై సమతలమగు శిలాభూమియందు నివసించి, సతీదేవితో భగవంతుఁడైన శంకరుఁడు పరమానందమున శరత్కాలమును గడపివేసెను. శరత్కాలాంతమున వైకుంఠనాథుఁడు శ్రీమహావిష్ణువు జాగరితుఁ డయ్యెను. మహాత్ముఁడును బ్రజాపతియు నైన దక్షుఁ డప్పుడు యజ్ఞము ననుష్ఠించుటకుద్యుక్తుఁడయ్యెను. అతఁ డప్పుడు ద్వాదశాదిత్యులను, ఇంద్రాదిదే

వతలను, కశ్యపప్రభృతి ఋషిగణమును ఆహ్వానముగావించి వారలను సదస్యకార్యములయందు దీక్షితులఁ జేసెను. అరుంధతీదేవితో వసిష్ఠమహర్షిని, అనసూయాదేవితో నత్రిఋషీశ్వరుని, ధృతీదేవితోఁ గౌశికఋషిచంద్రుని, అహల్యాదేవితో గౌతమఋషివర్యుని, మాయాదేవితో భరద్వాజఋషితిలకుని, చంద్రాదేవితో నంగిరసఋషిశేఖరుని, మఱియు వేదవేదాంగపారదర్శులు, గుణసంపన్నులు నైన తక్కినఋషిశిరోమణుల నందఱ నామంత్రణము గావించి యజ్ఞపరీక్షాదికార్యములయందు నియుక్తులను జేసెను. భార్యాసహితముగా ధర్మదేవత నాహ్వానముచేసి యజ్ఞవాటికకు ద్వారరక్షకునిగా నియోగించెను. అరిష్టనేమిని యజ్ఞకాష్ఠములు సమిధలు మొదలగు సామగ్రిల నాయత్తముగావించునిమిత్తమై యేర్పఱిచి, పిండివంటలుఁ బానీయములు మున్నగువాని సంసిద్ధముగావించుటకు సుదక్షుఁ డగుటచేఁ జంద్రాదేవితో నంగిరసఋషి నందుల కధికారిం జేసెను. సత్రసంస్కారమునందు సుసమర్థుఁ డని మహాత్ముఁడైన భృగుఋషిని దత్కార్యమునం దుంచెను. మఱియు దక్షప్రజాపతి రోహిణీసహితుఁడైన చంద్రుని, అగ్నిదేవుని ధనాగారమున కధిపతులను జేసెను, అల్లుఁడైన శంకరుని, కూఁతురైన సతీదేవినిమాత్రము విడిచిపుచ్చి దక్షప్రజాపతి తక్కినయల్లుండ్రను కూఁతుండ్రను దౌహిత్రులు మొదలగువా రందఱను యజ్ఞమున కాహ్వానము గావించెను. ఇట్లని చెప్పఁగా నారదమహాముని పులస్త్యునిఁ జూచి యిట్లు ప్రశ్నించెను. ప్రజాపతియైన దక్షుఁడు జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠుఁడును, వరిష్ఠుఁడును, ధనాధ్యక్షుఁడును నగుమహేశ్వరుని మొట్టమొదటనే యేల పిలువలేదు? అందుకుఁ బులస్త్యఋషి యిట్లుత్తరమిచ్చెను—జ్యేష్ఠశ్రేష్ఠవరిష్ఠుఁడు, నాదిదేవభగవానుఁడు నైన మహాదేవునిఁ గపాలి యని దక్షప్రజాపతి యాహ్వానముఁ జేయఁ డయ్యెను.

మరల నారదుఁడు—ఋషివర్యా! దేవశ్రేష్ఠుఁడు, శూలపాణి, త్రిలోచనుఁడు, భగవానుఁడు నైన మహాదేవుఁ డెందునిమిత్తము కపాలి యయ్యెను? ఎఱింగింపు మని యడిగెను. అందులకుఁ బులస్త్యుల వారు—దేవర్షీ! అవ్యక్తయోనియైన బ్రహ్మ ఆదిపురాణమునందుఁ జెప్పిన అతిపురాతనకథను నేను నీకుఁ జెప్పుచున్నాను. సావధానచిత్తముతో నాకర్ణింపుము. అని చెప్పఁదొడంగెను.

పూర్వకాలమునందు జగత్తంతయు నేకార్ణవమున నిమగ్నమై యుండెను. స్థావరములు జంగమములు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, అగ్ని, వాయువు, సమస్తము వినష్టములై పోయెను. అప్పుడు (సంసారభావాభావవివర్జిత, అప్రతర్క్య, అవిజ్ఞేయ) వృక్షతృణాదిసమస్తమును జలమగ్నములై పోయెను; అది ఘోరదుర్దినము, సకలము నంధకారాచ్ఛన్నము. వేయేండ్లువ్యాపించియున్న యానిశీథమున సలిలములపై భగవానుఁడు శయనించియుండెను. రాత్రిగతించిన పిమ్మట సత్వరూపసంపన్నుఁడైన యాజగన్నాథుఁడు నిద్రనుండి లేచి బ్రహ్మను సృష్టి గావించెను. అప్పు డావిశ్వచరాచరసృష్టికర్త, ఆవేదవేదాంగపారదర్శి, ఆయమృతదర్శనుఁడు, పంచముఖబ్రహ్మ ప్రకాశమానుఁ డయ్యెను. అనంతరము, మఱియొకపురుషుఁడు సముద్భవించెను. ఆతఁడు తమోమయుఁడైన త్రిలోచనుఁడు; ఆతఁడు శూలపాణియై, కపర్దియై, అక్షమాలాధరుఁడై యుండుటఁ జూచి మహాత్ముఁడైన విష్ణుభగవానుఁడు, అతిదారుణమైన యహంకారమును వెంటనే సృష్టించెను; ఆబ్రహ్మయు శంకరుఁడును, ఆయహంకారమునకు వశీభూతులైరి. అహంకారాభిభూతుఁడైన శంకరుఁ డప్పుడు బ్రహ్మ నీక్షించి "నీ వెవ్వరు? నన్నిచ్చట కెందుకు తెచ్చియున్నావు? ఎందులకు నన్ను సృష్టించితివి? నాకుఁ జెప్పుము" అని తీవ్రముగాఁ బ్రశ్నచేసెను. లోకపి

తా మహాత్ముఁడైన బ్రహ్మయు సాహంకారముగా నిట్లుత్తర మిచ్చెను— “నీ వెవ్వరవు? నీతల్లిదండ్రు లెవ్వరు? ఎక్కడ నున్నారు? అంతయుఁ జెప్పుము” ప్రియనారదా! ఈవిధముగా బ్రహ్మకును, శంకరునకును, ఉత్పత్తిప్రసంగవిషయమున వివాదము సంభవించెను. ఆసమయము నందే నీవు జన్మించితివి. నీ వప్పుడు పుట్టుకతోడనే నిరుపమానమైన వీణియ గలిగి, ఆవీణతో నవ్యక్తమధురగానము గావించుకొనుచు నాకాశమునకుఁ దిరుగఁ జొచ్చితివి. తదనంతరము భగవంతుఁడైన శంకరునకుఁ బద్మయోనియు, నభిమానియు నైన బ్రహ్మవల్లఁ బరాభవ మయ్యెను. అప్పు డాశంకరుఁడు రాహుగ్రస్తుఁడైనచంద్రునివలె నధోవదనుఁడై నిలువఁబడిపోయెను. లోకపతియుఁ బరమేష్ఠియు నైన బ్రహ్మయెదుటఁ బరాజితుఁడై క్రోధాంధుఁడై యున్న యాపంచాననుఁడైన రుద్రునిఁ జూచి బ్రహ్మ యిట్లనియెను—నేను నిన్నెఱుఁగుదును. నీవు తమోమూర్తివి, త్రిలోచనుఁడవు, దిగంబరుఁడవు, వృషభారోహివి, లోకసంహారకర్తవు. అని యీవిధముగా బ్రహ్మ త్రిలోచనునిగూర్చి పలుకఁగాఁ గ్రోధముచేఁ ద్రిలోచనునిమూఁడుకన్నులు నారక్తములై పోయెను. శంకరుం డప్పుడు జగత్తంతయు దగ్ధముచేయవలయునను నభిప్రాయముతో బ్రహ్మవంక మరల మరల నీక్షింపఁజొచ్చెను. ఆసమయమునందా త్రిలోచనుని నైదుముఖములు సితవర్ణము, రక్తవర్ణము, కనకవర్ణము, అవదాతవర్ణము, నీలపింగళమిశ్రవర్ణము నను నైదువర్ణములచే నద్భుతములుగాఁ బ్రకాశింపఁజొచ్చెను. అందుచే నా దేవనిమూర్తి యప్పు డత్యంతదుర్దర్శమై వెలుంగుచుండెను. శంకరుని యారౌద్రవదనములను దర్శించి బ్రహ్మయిట్లనియెను—“నీవు నీమందబుద్ధిచేఁ బరాభూతుఁడవైతివి, నీకుఁ బరాక్రమ మున్నదా, నాకుఁ జూపుము” మహాత్ముఁడైన శంకరుఁ డామాటల నాలించి క్రోధో

పితుఁడై తననఖాగ్రముచే నాపరమభాషితమైన బ్రహ్మశిరమును
చ్ఛేదము గావించెను. అప్పు డా బ్రహ్మదేవుని ఖండితశిరస్సు శంక
ని వామహస్తమునం దంటుకొనియెను. ఎప్పుడును మరల నాబ్రి
హ్మకపాల మాశంకరునిచేతినుండి యూవలకు వచ్చినది గాదు. అప్పు
కర్మకుఁడైన బ్రహ్మ యాపిమ్మట గోత్రభావిత్రుఁడై, కవచకుండలవి
రాజితుఁడును, శరధారియు, ధనుష్పాణియు, మహాబాహువుఁడును, అవ్య
యుఁడును, బాణశక్తిధరుఁడును, చతుర్భుజుఁడును, మహాతూణీయు,
దివ్యసమతేజశ్శాలియు నగు నొకవీరపురుషుని సృష్టి గావించెను. అప్పు
వీరపురుషుఁడు "సురుద్రుఁడైన శూలపాణీ! నేను నిన్ను వినాశ
మొనరింపను. నీవు పాపివి, పాపాత్ముల నెవ్వరు హత్యగావించెదరు?"
ని తిరస్కరించి పలికెను. ఆమహాపురుషుని యూవాక్యములను విని పర
మేశ్వరుఁడు పార్వతీసహితుఁడై హిమాలయపర్వతమునందుండు బదర్య
శ్రమమైన సరస్వతీపరిద్వారము ప్రవహించుచున్న నరనారాయణస్థాన
మగు బదరికాశ్రమమునకు వెడలిపోయెను. అట్లు వెడలి శంకరుఁడు
బదరికాశ్రమమందు నారాయణుని దర్శించి యిట్లు పలికెను. "భగవ
ంతుఁడా! కృపాపరవశుఁడవై నాకు భిక్షాదానము నొసంగుము"
మాటలు విని నారాయణుఁడు మహేశ్వరున కిట్లనెను. "ఓశంకరా!
వు నీత్రిశూలముతో నా వామహస్తమునం దాఘాతము నొనరింపుము"
మాట వినినవెంటనే శంకరుఁడు నారాయణుని యెడమచేతిపై తీవ్ర
మైన యాఘాతము గావించెను. అప్పు డాత్రిశూలాహతమైన నారా
యణుని వామబాహువునుండి మూఁడురక్తధారలు ప్రవహింపఁజొచ్చెను.
ం దొకధార నక్షత్రవంత్యాశ్రితమైన గగనమండలము నాశ్రయించి
యుండెను, రెండవధార భూమండలమునకు ప్రవహింప మొదలుపె
ను, దానిని ఋషులు గ్రహించిరి; దానినుండి అత్రిమహర్షియు, శం

రాంశచే దుర్వాసోమహర్షియు నుద్భవించిరి. తృతీయధార రౌద్ర మూర్తియైన మహేశ్వరుని కపాలమునఁ బడియెను. దానినుండి, కవ చధారియైన యొకవీరపురుషుఁడు సద్యోయౌవనముతో జన్మించెను ధనుఃశరములను ధరించి శ్యామశ్వేతమిశ్రితమైన వర్ణముతో నుజ్జ్వలు డగుచున్న యావీరపురుషుఁడు వర్షకాలపుమేఘమువలె గంభీరగర్జనము చేయుచు నిట్లు పలికెను. "నే నిప్పు డేపని యొనరింపవలయును న న్నిప్పు డేల సృజియించితిరి?"

శంకరుఁ డప్పు డానరనారాయణబాహుసంభవుఁడైన వీరపురు షుని సమీపించి యిట్లనియెను. "శతసూర్యసమానదేదీప్యమానుఁడై బ్రహ్మాత్మజుఁడైన యానరుని వినాశమొనరింపుము" శంకరుఁ డిట్లు పలుకఁగా వీరపురుషుఁడు తత్క్షణమే యక్షయశరములను దనప్రసిద్ధధ నువునకు సంధానము గావించి యుత్సాహముతో యుద్ధమునకు సంసి ద్ధుఁడయ్యెను. తరువాత బ్రహ్మాత్మజుఁడును సమరోన్ముఖుఁడయ్యెను, ఆమహాబలపరాక్రమాక్రాంతవీరపురుషులిర్వురకుసహస్రదివ్యవర్షములు మహాభయంకరమైన ఘోరసంగ్రామ మయ్యెను. అప్పుడు బ్రహ్మకు శంకరుఁ డిట్లనియెను. "విచిత్రకావ్యకలాపా, మహాబలశాలీ! నీనం దనుఁడు నారాయణబాహుసంభవుఁడైన వీరపురుషునిఁ దనమహాబా ణములచేఁ దాడితునిఁ గావించి యద్భుతముగాఁ బరాజితునిఁ జేసెను.' అప్పుడు బ్రహ్మ మహేశ్వరునిఁ జూచి "శంకరా! చూచితివా నీయజేయవీరపురుషుఁడు నాయాత్మజునిచే నెట్లు పరాభూతుఁడయ్యెనో' అని పలికెను. మహాదేవునితో నిట్లని బ్రహ్మ తనవీరపురుషుని సూర్య మండలములోఁ జేర్చివేసెను. అప్పుడు మహాదేవుఁడును దనవీరపురు షుని నరనారాయణవిగ్రహమునందు నిక్షిప్తముచేసెను.

## —♦ హరిహరసంవాదము ♦—

పులస్త్యుఁ డిట్లనియెను—తరువాత, రుద్రునికరతలమున దారుణకరకపాల మంటుకొనిపోవుటచే నాతఁడు చింతాకులచిత్తుఁడై సంతప్తుఁడగుచుండెను. అప్పుడు శంకరునిసమక్షమున బ్రహ్మహత్య, కాటుకకొండవంటి నల్లనిశరీరముతోడను, రక్తకేశములతోడను, రౌద్రమూర్తితోడను భయంకరముగాఁ బ్రత్యక్షమయ్యెను. ఆకరాళమూర్తిని సామీప్యమునందుఁ జూచి మహేశ్వరుఁడు "ఓభయంకరమూర్తీ! నెవ్వరు? ఏప్రయోజనముచే నీ విక్కడకువచ్చియున్నావు? చెప్పు"మని ప్రశ్నించెను. అప్పుడామూర్తి నేను బ్రహ్మహత్యను, త్రిలోచనా! నీవు నన్నుఁ బొందుట కభిలషింపవలెను." అని చెప్పుచుఁ త్రిశూలపాణియైన రుద్రదేవుని శరీరమునఁ బ్రవేశించెను. బ్రహ్మహత్యాభిభూతుఁడైన మహాదేవుఁడు చింతాశోకసమాకులితసంతప్తచిత్తుఁడై నరనారాయణులను మునివరులసందర్శనార్థము బదరికాశ్రమమునకు వెడలెను. ఆతని కక్కడ నరనారాయణులదర్శనము కాలేదు. అచ్చటనుండి మహాదేవుఁడు యమునానదియందు స్నానము గావించుకొనుట కభిలషించి యమునాభిముఖుఁడై వెడలెను. కాని యమునలో జలము లెండిపోయెను. వృషభవాహనుఁడైన మహాదేవుఁ డప్పుడు యమునాజలము లెండిపోవుటఁ జూచి సరస్వతీనదీస్నానమునకు గమనము చేసెను. అయ్యో! సరస్వతీనదియు నంతర్హిత మైపోయెను. అనంతరము మహేశ్వరుఁడు పుష్కరారణ్యమునకును, మాగధారణ్యమునకును, సైంధవారణ్యమునకును బ్రయాణముచేసి యిచ్ఛానుసారముగా నవగాహనము లొనరించెను. అక్కడనుండి ధర్మారణ్యమునకును, నైమిషారణ్యమునకును వెడలి యాతఁడు స్నానము లొనరించెను. కాని యప్పటికిని భయంకరమైన యాబ్రహ్మహత్య యాతనిని విడిచి

నది గాదు. వృషభధ్వజుఁడైన మహేశ్వరుఁడు సకలనదీతీర్థములకును, ఆశ్రమములకును, పవిత్రదేవాలయములకును వెడలి స్నానప్రతాద్య నుష్ఠానములు గావించియు బ్రహ్మహత్యాపాతకమునుండి విముక్తుఁడు గాఁజాలకపోయెను. తదనంతరము చింతాక్రాంతుఁడై శంకరుఁడు కురుభూములకు వెడలెను. అప్రదేశమునం దిరుగాడుచుండఁగా నాకాశమండలమునందుఁ జక్రధరుఁడై యున్న నరనారాయణు లాతనికిఁ బ్రత్యక్షమైరి. శంఖచక్రగదాపాణియుఁ, బద్మలోచనుఁడు నైన నారయణుని దర్శించి కృతాంజలిపుటుఁడై మహేశ్వరుఁడు స్తోత్రగానమొనరింపఁజొచ్చెను. "ఓదేవతానాథా, ఓగరుడధ్వజ, ఓశంఖచక్రగదధరా, ఓవాసుదేవా! నీకు నమస్కరించుచున్నాను. ఓగుణాతీత ఓయనంత! ఓసర్వాంతర్యామీ! పిథారా! ఓస్థానాస్థానస్వరూపా ఓపరాశ్రయా! ఓసర్వశ్రియా! నీకు నమస్కారము చేయుచున్నాను ఓరజోగుణసంపన్నా! ఓబ్రహ్మమూర్తీ! ఓసనాతనా! సచరాచర సమస్తజగత్తును సృష్టి గావించితివి. నీకు నమస్కారము లొనరించుచున్నాను. ఓసత్త్వగుణాన్వితలోకపతీ! ఓఅతీంద్రియా! ఓవిష్ణుమూర్తీ! ఓప్రజాపాలక! ఓమహాబాహూ! ఓఉపేంద్రా! నీకు నమస్కారము. ఓతమోమూర్తీ! నీక్రోధాంశవలననే అహంకారముత్పన్నమయ్యెను. ఓసర్వవ్యాపిగుణాభియుక్తదేవేశా! నీకిదే నమస్కారము. ఓజగన్నాథా! నీవె పృథ్వివి, నీవే యగ్నివి. నీవే జలము, నీవే ఆకాశము, నీవే వాయుర్బుద్ధిమనంబులు, నీవే రాత్రి. నీకు నమస్కారము. నీవే ధర్మము, నీవే యజ్ఞము, నీవే సత్యము, నీవే శౌచము, నీవే యహింస, నీవె యౌదార్యము, నీవే దయ, నీవే దానము, నీవే క్షమ, నీవే లక్ష్మి, నీవే బ్రహ్మచర్యము, నీవే యీశ్వరుఁడు, నీదేహమే చతుర్వేదము, నీవే వేదప్రతిపాద్యవస్తువు, నీవే వేదపారదర్శివి, నీవే యుప

మవు, నీవే యీశ్వరుఁడవు, నీవే సమస్తమును. నీకు నమస్కారము. యమృతా! ఓ చక్రపాణీ! నీకు నమస్కారము. ఓ వామనా! మీా వతారా! నీకు నమస్కారము. నీవు సకలజీవులయందును కృపాప రుఁడవు, ఓ కేశవా! నన్ను పాపబంధమునుండి విముక్తునిఁ గావిం పుము. నేను బ్రహ్మహత్యాపాపమునకుఁ జిక్కి నిరంతరదగ్ధుఁడ నగు చున్నాను. నా యమంగళమును వినాశ మొనరించి నీవు నన్నుఁ బవి త్రుని గావింపుము! నీకిదే నమస్కారము.”

మరలఁ బులస్త్యుఁ డిట్లు చెప్పుచున్నాఁడు—మహాత్ముఁ డైన శంకరుఁ డిట్లు చక్రపాణియైన నారాయణుని స్తుతులు గావింపఁగా, బ్రహ్మహత్యామహాపాపము పోవుటకు మార్గము భగవంతుఁ డైన నారాయణుఁ డిట్లు పలికెను. “ఓ మహేశ్వరా! బ్రహ్మహత్యామహా పాపమునకు క్షయకారియు, పుణ్యప్రదమును, శుభప్రదము నైన నా వాక్యమును వినుము. ప్రయాగ యను పేరితో నొక పుణ్యక్షే త్రము గలదు. దానియందు మదంశసంభూతుఁ డైన యొకయవ్యయ వటుఁడు సదా యోగశాయియై యుండెను. అతని దక్షిణపాదము నుండి సర్వపాపహారిణియు శుభప్రదము నగు నొకనది బహిర్గత మగు చున్నది. ఈనది ‘వరణ’ యను పేరితో ప్రసిద్ధ మైనది. మఱియు ఆ యోగిపురుషుని వామచరణమునుండి ‘అసి’ యను నామముతో నొకటి ప్రసిద్ధనది ప్రవహించుచున్నది. ఈ రెండు నదులు సర్వశ్రే ష్ఠములు, పూజనీయములు. ఈ రెండు నదులమధ్యమున సర్వపాపవినాశకారి యుఁ, త్రిలోకశ్రేష్ఠమును నైన యొప్పుచున్న ప్రదేశమునందు భగ వానుఁడు యోగశాయియై యుండెను. ఆ క్షేత్రమాహాత్మ్యముననే శుభ ప్రదయుఁ బుణ్యప్రదయు నైన వారణాసీనగరముండెను. ఓ మహేశ్వ రా! ఆ పుణ్యస్థలమునందు వాసము చేయుటచే జనబృందము తమయం

త్యకాలమున నాయంత్రైక్యము కాంగ్గుచున్నదో, ఏస్థానమునందు విశాసిసీజనముల మొదనూలిధ్వనులతో బ్రాహ్మణోత్తముల వేదగానము స్వరమిళితమై శ్రవణానందము నొనరించుచుండునో, ఏస్థానమునందు రాజమార్గములలో రమణీగణచరణశోభితలాక్షాచిహ్నములఁ జూచి శశాంకుఁడు స్థలపద్మము లని విస్మయ మొందుచుండెనో, ఏస్థానమునందలి దేవాలయముల శిఖరములచేఁ జంద్రదేవుని సంధ్యాజ్యోత్స్న నిరుద్ధము చేయఁబడుచున్నదో, మఱియు దివాభాగమున వాయుసంచారితములైన సుదీర్ఘపతాకములచే సూర్యరశ్మి నిరోధింపఁబడుచున్నదో, ఏస్థలమునందు రతీదేవీసమానలగు నబలాగణమునందు పురుషులు తమబలముఁ జూపఁజాలకున్నారో, శంభో! ఏస్థలమునందలి సుందరీమణులు నీవలెనే చంద్రవిభూషణ లగుచున్నారో యాసురపురియగు వారణాసియందు భగవంతుఁడైన కేశవుఁడు నివసించియున్నాఁడు. దశాశ్వమేధ మనుపేరితో నొప్పుచున్న యాపుణ్యస్థలమునందు మదంశస్వరూపుఁడైన భగవానుఁడు కేశవుఁ డున్నాఁడు. ఓసురశ్రేష్ఠ ఆస్థానమున కేఁగి బ్రహ్మహత్యాపాపమునుండి విముక్తుఁడవు గమ్ము'

గరుడధ్వజుఁడైన భగవంతుఁ డిట్లు చెప్పఁగా వృషభధ్వజుఁడైన మహేశ్వరుఁ డాతనికిఁ బ్రణామము లాచరించి పాపవిమోచనాసక్తుఁడై గరుడవేగముతో వారణాసి కేఁగెను. అనంతరము మహేశ్వరుఁ డాతీర్థమునకు, నాపుణ్యనగరమునకు వెడలి దశాశ్వమేధమను సుపుణ్యస్థలమును దర్శించెను. మఱియు నాపుణ్యతీర్థమున స్నాన మొనరించి బ్రహ్మహత్యామహాపాతక విముక్తిలాభమును బొంది కేశవదర్శనలాలసుఁడై వెడలెను. భగవంతుఁడైన కేశవుని దర్శించి ప్రణామపూర్వకముగా మహేశ్వరుఁడు ‹‹ ఓహృషీకేశా! నీయనుగ్రహవిశేషమున నేను బ్రహ్మహత్యాపాపమునుండి విమోచన మొందితిని. కా

దేవాదిదేవా! నాకరతలమునుండి యీనరకపాల మున్ముక్తమగుట దు. నేను దీనికి హేతు వేమియో తెలియఁజాలకున్నాను. ఈ కార ము నాకుఁ దెలియ ననుగ్రహింపుము" అని ప్రార్థించెను. మహే శ్వరుని యీప్రార్థన నాలకించి కేశవుఁ డిట్లనియెను. "ఓరుద్రా! ందులకుఁ గారణ మంతయుఁ జెప్పెదను. అదిగో! నాయెదుట ద్మోత్పలసుశోభితమై దేవగంధర్వపూజితమై, తీర్థశ్రేష్ఠమై, పరమపవి త్రమై యొప్పుచున్న యీదివ్యహ్రదములో నాపుణ్యతీర్థములో స్నా నావగాహన మొనరింపుము. దానిలో స్నానము చేసినచో నీహస్తతల మునుండి నరకపాలము విమోచనము కాఁగలదు. నేఁటినుండియు రుద్రదేవుఁడు ప్రపంచములోఁ గపాలి యనుపేరఁ బ్రఖ్యాతుఁ డగును. మఱియు నీస్థానమందు నరకపాల మున్ముక్తమగుటచే నీస్థానము పుణ్య తీర్థములలో నొకటిగా గణింపఁబడఁగలదు." సురపతియైన కేశవుఁడు మహేశ్వరున కిట్లు చెప్పఁగానే, దేవోక్తవిధిప్రకారము కపాలమోచనా తీర్థ స్నాన మొనరించెను. ఆతనికరతలమునుండి నరకపాలము పడి పోయెను. మఱియు భగవంతునుగ్రహమున నాతీర్థశ్రేష్ఠము "కపాల మోచనతీర్థ" మనుపేరఁ బ్రసిద్ధమయ్యెను.

—♦ మూడవ యధ్యాయము ♦—

పులస్త్యుఁ డు చెప్పుచున్నాఁడు—నారదా! భగవంతుఁడైన శంకరుఁ డిట్లు కపాలి యని పిలువంబడుటచే, బ్రహ్మపతి దక్షుఁ డొకపుడు యజ్ఞమున కామంత్రించుట మొనరింప డయ్యెను. ఈసమయమునందు దక్షయజ్ఞమున కేగదలఁచి శైలజయగు సతీదేవిని దర్శించుటకు సుందరమగు మందరపర్వతమునకు విచ్చేసెను. ఆయమ నాసేవకురాలను గాంచి సతీదేవి యామె నిట్లు ప్రశ్నించెను. "విజయ, జయంతి, అపరాజి తయు నెందులకు రాలేదు?" సతీదేవి ప్రశ్నను విని జయాదేవి యిట్లు

త్తర మిచ్చెను. "వారందఱును దాతగారి యింటికిఁ బిలువఁగా వెడి
యున్నారు. తండ్రియైన గౌతములవారును, తల్లియైన యహల్యాదే
యుఁగూడ నచ్చట కేగియున్నారు. మీరచ్చటికి వెడలుచున్న ప్రశ
న్నములు కనఁబడమిచే నే నిచ్చటికి వచ్చితిని. మీరేల వెడలరైతి
దేవుఁడైన మహేశ్వరు నా యజ్ఞమున కేల తోడ్కొనిపోలేదు? సం
ప్తఋషులును ఋషిపత్నులును, దేవతాబృందములు నచ్చట కేగి యు
న్నారు. పినతల్లులుఁ బెదతల్లులు సందఱును వెడలిరి. కన్యాబస్
తుఁడై చంద్రదేవుఁడును వెడలియున్నాఁడు. సమానాఙ్గిరసములు
నివారిందఱు నక్కడకుఁ దోడ్కొనిపోఁబడిరి, కాని మిమ్ముల నె
దోడుకొనిపోరైరి?" పులస్త్యుఁడు మరలఁ జెప్పుచున్నాఁడు;—ఓ
వర్ణీ! జయాదేవి పల్కిన వజ్రసన్నిభము లగు నీ పల్కులను విని స
దేవి మహాతురాలై యసహ్యతనొంది వెంటనే యీయిహలో
మును బరిత్యజించెను ఈవిధముగా సతీదేవి జీవమును విడుట
జూచి జయ క్రోధశోకాభిభూతురాలై యశ్రుధారల విడుచుచు
గకంఠముతోఁ బెద్దపెట్టున విలపింపఁజొచ్చెను. ఆయాక్రందన మా
లించి శూలపాణి యైన త్రిలోచనుఁడు "అయ్యో ఏమగు?" య
వెదకుచు జయాదేవిసమీపమున కరుదెంచెను. ఘనతరుపరిము
చుట్టుకొనియున్న లేఁదీగ కుఠారధారచేఁ గూలినట్లు నేలఁ గూలియుం
సతీదేవి నప్పు డాతఁడు వీక్షించి యడలుచు నేమిది యని జయాదే
నడిగెను. జయ యిట్లు పలికెను. "తండ్రీ! దక్ష యజ్ఞమునకు మిము
నిరాకరించి యింద్రాదిదేవతలతో నాదిత్యబృందమును మఱియు
త్రిభువనములవారి నందఱను దక్షుఁ డాహ్వానము చేసియున్నాఁడు, అతఁ
తక్కిన కూఁతుండ్రు నల్లుండ్రు నందఱును వారివారి సంతానములతోఁ ద
యింటికిఁ దోడ్కొనిపోయినాఁడు. ఈసమాచారము మఱియు నావలఁ

# విషయసూచిక.

పుట.

# వామనపురాణము

## —♦ పుణ్యతీర్థమహిమ ♦—

లోమహర్షణుఁడు చెప్పుచున్నాఁడు—ఓద్విజేంద్రులారా! మనుష్యతీర్థమునకుఁ బూర్వదిశయం దొకక్రోశదూరమునందు బ్రహ్మణగణసేవితమైన యొకనది గలదు. ఈనది 'ఆపగ' యనుపేర విఖ్యాతమైనది. ఈనదీతీరమునందు నిలిచి, పాలతోను నేతితోను శ్యామాకమును (చామ లనుధాన్యము) బ్రాహ్మణుల కెవ్వరు దాన మొసఁగుచున్నారో వారికిఁ బాపతాపము లుండవు; ఇదిగాక యీనదియొద్ద శ్రాద్ధమును గావించినను నిస్సందేహముగా సకలాభీష్టములు సిద్ధింపఁగలవు. తమతమవంశధరులైన పుత్త్రులుగాని, పౌత్త్రులుగాని యీయాపగానది కేఁగి తిలలతోఁ దమకుఁ దర్పణము లొసఁగినచో నాఱుతరములవఱకుఁ బరితృప్తులము గాఁగల మని పితృపితామహగణములు సతతముఁ గోరుచుందురఁట. శ్రావణమాసమునందు—విశేషించి తత్కృష్ణపక్షచతుర్దశీదివసము మధ్యాహ్నమునందు నక్కడఁ బిండదానము గావించినచో ముక్తి లభించును. అనంతరము శ్రేష్ఠమైన బ్రహ్మస్థానమున కేఁగవలయును. ఇచ్చోటు బ్రహ్మోదుంబర మనుపేర సర్వత్ర విఖ్యాతమైనది. అచ్చట సప్తర్షులప్రసాదముచే సప్తసోమయజ్ఞములు గావించినఫలము లభించును. భరద్వాజులు, గౌతములు, జమదగ్ని, కశ్యపులు, విశ్వామిత్రులు, వసిష్ఠులు, అత్రి వీరందఱును మహానుభావులైన మహర్షులతోఁగూడి, యీభూలోకదుర్లభములైన కుండములను నిర్మించిరి. బ్రహ్మ స్వయముగా నీకుండము

చేయుచు నొకసరోవరములోఁ బడిపోయిరి. ఆసరోవరతీరమునందలి యొకయశ్వత్థవృక్షము నాశ్రయించుకొని దేవర్షియైన నారదుఁడు ధ్యాననిరతుఁడై యుండెను. అప్పు డాతని కాహరకేశవు లిరువురును దృష్టిగోచరులైరి. చూచునంతలో హ్రదమునందుఁ బడిన విష్ణువు చతుర్భుజుఁడుగను, శివుఁడు లింగాకృతిగను మూర్తీభవించిరి. నారదుఁ డప్పు డాపురుషుల నిర్వుర నీక్షించి భక్తిపరవశుఁడై యీవిధముగా స్తవముఁ జేయఁజొచ్చెను. "దేవదేవుఁడైన శివునకును బ్రభవిష్ణుఁడైన విష్ణునకును నమస్కరించుచున్నాను. స్థితిసంహారకర్తలైన హరిహరులకు నానమస్కారము; బహురూపధరుఁడైన శివునకును, విశ్వరూపియైన విష్ణునకును నమస్కరించుచున్నాను. పరమసిద్ధిసంపన్నుఁడైన త్రినయనునకును జ్ఞానహేతువైన కృష్ణునకును నానమస్కారము. నేఁడు నేను ధన్యుఁడను, సుకృతిశాలిని. కావుననే యీమహాపురుషు లిర్వురు నాకు నేత్రగోచరులైరి. ఏమైన నేమి, నాయీపుణ్యాశ్రమము నను వారు మఱియుఁ బవిత్రము గావించిరి. నేఁడుమొదలు జగత్తునందు ధన్యవాదార్హమైన యీస్థానము "జన్మ" యను నామముతో విఖ్యాతము గాఁగలదు. ఏమానవులైన నీస్థానమునం దాచమనమును స్నానమును గావించి పితృదేవతలకుఁ దర్పణము లిచ్చినచో, నాశ్రిధాన్వితులు దేవేంద్రునితోఁ దుల్యు లగు జ్ఞాను లగుచున్నారు. ఇదిగాక యీయశ్వత్థమూలమునం దిక్కడ నేను నిత్యము వాసముచేయుచుందును. తీర్థసేవకులైన మానవు లిక్కడకు వచ్చి ముందుగా నీయశ్వత్థవృక్షమునకు వందన మొనరించి తరువాత హరిహరులకు నమస్కారములు చేయవలెను." ఓద్విజులారా! యనంతరము నాగహ్రదముం కేఁగి స్నానము గావించినచోఁ బుండరీకయజ్ఞముచేసిన పుణ్యము లభించును. విశేషించి శుక్లపక్షదశమీదినమునం దీతీర్థమున స్నానము

చేసి, జపమును శ్రాద్ధమును గావించినచో ముక్తిపదము లభించును. ఆతరువాత సురసేవితమైన త్రివిష్టపతీర్థమున కేఁగవలెను. అక్కడఁ బాపహారిణియైన పుణ్యవైతరిణీనది ప్రవహించుచుండును. దానిలో స్నానముచేసి శూలపాణియైన వృషధ్వజు నర్చించిన నిఖిలపాపములుఁ బ్రక్షాళితములై విశుద్ధదేహములతోఁ బరమగతి నొందుచున్నారు. ఓవిప్రోత్తములారా! తరువాత "రసావర్త" మను నుత్కృష్టతీర్థమున కేఁగి భక్తితో స్నానాదికము లొనరించినఁ బరమసిద్ధి లభించియుండును. చైత్రశుద్ధచతుర్దశినాఁడు, "అలోపక" తీర్థమున స్నానము చేసి శివపూజ గావించినచోఁ బాపలేశమైన నంటకుండును. ఓవిప్రులారా! దీనితరువాత ఫలకీవన మనుతీర్థము గలదు. అక్కడ దేవతలు, గంధర్వులు, సాధ్యులు, ఋషులు దివ్యసహస్రవర్షపర్యంతము ఘోరతపస్సు గావించిరి. అక్కడ దృషద్వతీనదియందు స్నానమును దేవతర్పణమును గావించినమానవులకు, అగ్నిష్టోమయజ్ఞమును, అతిరాత్రయజ్ఞమును గావించినఫలము లభించుచున్నది. చంద్రకళలు క్షయమగుట కారంభింపఁగానే సోమవారమునం దెవ్వరీస్థానమునందు శ్రాద్ధము గావింపుదురో, వారికి లభించుచున్న ఫలమునుగూర్చి యాకర్ణింపుఁడు. గయాక్షేత్రమునం దేవిధముగా నిత్యము శ్రాద్ధానుష్ఠానములచేఁ బితృదేవతలు తృప్తు లగుచున్నారో, అవిధముగానే యీఫలకీవనము నాశ్రయించియు, శ్రాద్ధములచేఁ బితృదేవతలు తృప్తు లగుచున్నారు. ఎవ్వరు హృదయాంతరములందైనను ఫలకీవనమును స్మరించుచుందురో వారిపితృదేవతలు పరితృప్తు లగుచున్నారు. సందేహములేదు. ఈస్థలమునందు మఱియొకమహాతీర్థము గలదు. దేవతలక్కడ నిత్యసన్నిహితులై యుందురు. ఆతీర్థమునందు స్నానముచేసిన మానవులకు సహస్రగోదానఫలము లభించుచున్నది. అనంతరము

పారిశిఖాలతీర్థమునందు స్నానమును బితృతర్పణమును గావించినమానవులకు రాజసూయయజ్ఞఫలము లభించుచున్నది. మఱియు వారికి సాంఖ్యయోగము ప్రాప్తించుచున్నది. దీనితరువాత "మిశ్రక" మను మహాతీర్థమునకుఁ బోవలయును. అక్కడ మునిప్రవరుఁడైన దధీచి కొఱకు మహాత్ముఁడైన వ్యాసముని యనేకతీర్థసమ్మేళనము గావించెను. ఎవ్వ రీమిశ్రకతీర్థమునందు స్నానముచేయుచున్నారో, వారికి సకలతీర్థస్నానఫలము లభించుచున్నది. తరువాత జితేంద్రియులును నియతాహారులునై వ్యాసవనమున కేఁగవలయును. అక్కడ మనోజవతీర్థమునందు స్నానముగావించి, మహేషిదేవుని గర్చించినచో మనోభీష్టసిద్ధి యగును, సంశయము లేదు. తరువాతఁ బవిత్రచిత్తులై మధువనమున కేఁగి, యచ్చట దేవీతీర్థమున స్నానమును దేవపితృదేవగణార్చనమును గావించినచో, దేవీయాజ్ఞచే సమ్యక్సిద్ధి నొందఁగలుగుచున్నారు. పుణ్యాత్ములైన మానవులు దృషద్వతీనదియందలి కౌశికీసంగమమున నియతాహారులై స్నానముచేయవలయును; ఈస్నానఫలమువలన వారు సర్వపాపవిదూరితు లగుచున్నారు.

ధీమంతుఁడైన వ్యాసుఁ డిక్కడనుండి వ్యాసవనమున కేఁగి, పుత్రశోకాభిభూతుఁడై యక్కడ దేహత్యాగమును గావించుటకుఁ గృతసంకల్పుఁ డయ్యెను. అక్కడ దేవత లాతని శాంతిఁబొందించి యకార్యమునుండి మరలించిరి. అప్పటినుండియు వ్యాసస్థలి పుణ్యతీర్థముగాఁ బరిణతమయ్యెను. అక్కడ కేఁగినవారికిఁ బుత్రశోకము సంభవింపదు. తరువాత "కిందత్తరూప" తీర్థమున కేఁగి యచ్చట తిలపస్థదానము గావించినచోఁ బరమసిద్ధి గలుగుటయే కాక ముక్తి లభించుచున్నది. అన్నతీర్థము, సుదినతీర్థము నను రెండుతీర్థము లాతరువాతఁ గలవు. ఈతీర్థద్వయము భూలోకదుర్లభ మైనది. విశుద్ధదేహు

నై యీతీర్థద్వయమునందు స్నానముచేసినవారికి సూర్యలోకములు సిద్ధించుచున్నవి. ఆతరువాతఁ ద్రిభువనవిదితమైన కృతపుణ్యతీర్థమున కేఁగవలయును. ఇక్కడ నియతచిత్తులై యుండి గంగాస్నానము గావించుకొని మహాదేవు నర్చించినచో నశ్వమేధయాగము గావించిన ఫలము నొందుచున్నారు. అక్కడఁ గోటితీర్థ మనుతీర్థము విరాజిల్లుచుండును. అచ్చటఁ గోటీశ్వరప్రభువును దర్శించి శ్రద్ధతో స్నానము గావించినచోఁ గోటియజ్ఞము లాచరించిన ఫలము లభించుచున్నది. ఈస్థలమునుండి వామనకతీర్థమున కేఁగవలయును. ఈతీర్థము త్రిలోకవిశ్రుతము. ఇచ్చటఁ బ్రభవిష్ణుండైన విష్ణుఁడు వామనరూపమున బలిచక్రవర్తి రాజ్యము నపహరించి యింద్రున కొసంగెను. అక్కడ విష్ణుపదమునందు స్నానము గావించి వామనదేవు నర్చించినచో సర్వపాపములనుండి విముక్తులై విశ్వాత్ములై విష్ణులోకమును బొందఁగలరు. అక్కడ సర్వపాపహారమైన జ్యేష్ఠాశ్రమమనుతీర్థము విరాజిల్లుచుండును. ఈ యాశ్రమమును దర్శించినమానవులు ముక్తి నొందుచున్నారు. సందేహము లేదు. ఇక్కడ జ్యేష్ఠమాసము శుక్లపక్షైకాదశియం దుపవాసముండి ద్వాదశినాఁడు స్నానముగావించినమానవులు మనుష్యులలో సకలశ్రేష్ఠు లగుచున్నారు. ఈస్థలమునందుఁ బ్రభవిష్ణుడైనవిష్ణుఁడు స్వయముగా బహుబ్రాహ్మణులను స్థాపించెను. ఈబ్రాహ్మణులందఱును దీక్షగలవారును, ప్రతిష్ఠాసంపన్నులును, విష్ణుప్రీతివిధానతత్పరులు నై యున్నారు. వారికి శ్రద్ధతో వివిధవస్తువులను దానమొసఁగినచో మన్వంతరకాలపర్యంతము నాసమస్తదానములు నక్షయములు గాఁగలవు. అక్కడఁ ద్రిలోకవిశ్రుతమైన కోటితీర్థము విరాజితమగుచున్నది. దానిలో స్నానము గావించినచోఁ గోటియజ్ఞఫలము లభించుచున్నది. అచ్చటఁ గోటీశ్వరమహేశ్వరుని దర్శించినచో నాతని

ప్రసాదమున గాణపత్యప్రాప్తి కలుగుచున్నది. అచ్చట మహాత్ముఁడైన సూర్యుని సుమహాతీర్థము గలదు. ఆతీర్థమున భక్తియుక్తులై స్నానముఁ జేసి సూర్యలోకమందుఁ బూజితు లగుచున్నారు. ఓద్విజోత్తములారా! ఆతరువాత, కులోత్తారణకతీర్థమున కేఁగవలయును. పురాకాలమునందు విష్ణువు సమస్తవర్ణాశ్రమములను బరితారణము నొనరించుటకు, ఈపవిత్రతీర్థమును నిర్మాణము గావించెను. వర్ణాశ్రమధర్మ లీతీర్థమున కేఁగి పరమపదమును దర్శింపఁగల్గుచున్నారు. బ్రహ్మచారులుగాని, గృహస్థులుగాని, వానప్రస్థులుగాని, యతులుగాని, యెవ్వరుగాని యక్కడ స్నానముగావించుకొనినచో సప్తకులముల నుద్ధరింపఁగల్గుచున్నారు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, ఎవ్వరైనను సరే భక్తియుక్తులై యేకాగ్రచిత్తములతో నక్కడ స్నానము గావించినచోఁ బరమపదప్రాప్తు లగుచున్నారు. దూరమునందుండియైన నెవ్వరుగాని వామనాధిష్ఠితమైన కురుక్షేత్రమును స్మరించినచో వారికిఁ దత్క్షణమే ముక్తి లభించుచున్న దనుటకు సందేహము లేదు.

లోమహర్షణుఁడు చెప్పుచున్నాఁడు—పవన హ్రదము లో స్నానముచేసి దేవదేవుఁడైన మహేశ్వరుని సందర్శించినచో నిష్పాపులై శైవపదప్రాప్తిని బొందుచున్నారు. పుత్రశోకముచేఁ బవనదేవుఁడీహ్రదములో లీనమైపోయెను. అక్కడ బ్రహ్మయు నితరదేవతలతోఁ గూడి భక్తిభావమునఁ బవనదేవుని స్తవము గావించెను. తరువాత హనుమత్స్థానమున కేఁగవలయును. దేవదేవుఁడైన శూలపాణి యిచ్చట తెలసియున్నాఁడు. దేవతలు గంధర్వులు నిక్కడ హనుమంతునిఁ బ్రతిష్ఠఁ గావించిరి. ఈస్థానమునందు స్నానముగావించినచో నరులకమృతత్వముప్రాప్తించుచున్నది. తరువాతఁదీర్ఘసేవకులైనయుత్తమమానవులు

కులోత్తారణతీర్థమున కేఁగి స్నానము గావించినచో మాతామహపితామహకులములు రెంటను సమగ్రముగా నుద్ధరింపఁబడుచున్నవి. తరువాత లోకవిశ్రుతుండును రాజర్షియునైన శాలిహోత్రునితీర్థమున కేఁగి స్నానము గావించినచోఁ గాంచనకలుషరాశినుండి నిష్కృతి నొందుచున్నారు. సరస్వతీనదియందు శ్రీకుంజనామకతీర్థ మొకటి గలదు. ఈతీర్థము త్రిభువనప్రసిద్ధము. అక్కడ భక్తియుక్తులై స్నానముచేసినచో నగ్నిష్టోమయజ్ఞము గావించిన ఫలము గలుగుచున్నది. అనంతరము పవిత్రాత్ములైన నరులు, అక్కడి నైమిశకుంజమున కేఁగి స్నానము గావించినచో వారికి నైమిశారణ్యమునందలి తీర్థములలో స్నానముచేసిన పుణ్యము లభించుచున్నది. అటుపైని యక్కడ వేదవతీసేవితమైన యొకానొక మహాతీర్థము గలదు. పూర్వకాలమునందు రావణాసురుఁడు వేదవతీకేశపాశమును బట్టికొనఁగా నామె యక్కడనే రావణవధార్థము తనప్రాణములు విసర్జించెను. తరువాత నామె మహాత్ముఁడైన జనకునియింట జననమొంది సీత యనుపేరితోఁ బతివ్రతయు శ్రీరామపత్నియు నై ఖ్యాతినొందెనది. రావణుఁడు తనవినాశము కొఱకు సీత నపహరించెను. అందుచేతనే రాముఁడు రావణుని సంహరించి విభీషణుని లంకారాజ్యమునందుఁ బట్టాభిషిక్తునిఁ గావించెను. అప్పుడు రామునికీర్తి మూర్తీభవించినదో యనునట్లు సీత రాముని గృహమునకు వచ్చెను. మానవు లీవేదవతీతీర్థమున స్నానము గావించిరేని, కన్యాయజ్ఞము గావించినఫలము లభించి, సర్వపాపవిముక్తులై, పరమపదప్రాప్తిఁ గాంచుచున్నారు. తరువాత సర్వోత్తమమహాతీర్థమైన బ్రహ్మస్థానమున కేఁగవలయును. ఈస్థానమున స్నానము గావించిన బ్రాహ్మణేతరులును బ్రాహ్మణులగుటకు సమర్థు లగుచున్నారు. బ్రాహ్మణుఁడే స్నానముగావించినచో విశుద్ధాత్ముఁడై పర

మపదపాప్రుఁ డగుచున్నాఁడు. తరువాతఁ ద్రైలోక్యదుర్లభమైన సోమతీర్థమున కేఁగవలయును. అక్కడ సోమదేవుఁడు తపస్సుచేసి ద్విజరాజత్వమును బొందఁగలిగెను. కార్తికమాసమున సోమదేవు నర్చించిన మానవులు స్వర్గలాభమును బొందుచున్నారు. మఱియు నక్కడ స్నానమును బితృగణార్చనమును గావించినవారు నిష్పాపదేహులై స్వర్గధామమును బొందుచున్నారు. త్రైలోక్యదుర్లభమైన సప్తసారస్వతతీర్థమునందు సప్తసరస్వతులు సమ్మేళనమొంది ప్రవహించుచుండును. ఆసప్తసరస్వతుల నామము లెట్లన—సుప్రభ, కాంచనాక్షి, విమల, మానసహ్రదము, సారస్వతోఘ, సువర్ణ, విమలోదక.

పితామహుఁడైన బ్రహ్మ పుష్కరతీర్థమునం దుండి యజ్ఞానుష్ఠానము గావించుచుండఁగా ఋషు లాతని కిట్లనిరి,—“సురజ్యేష్ఠా! ఈ నీయజ్ఞమునకుఁ బ్రకృష్టఫలము గలుగదు. ఏమన, సరిద్వరమైన సరస్వతి యిచ్చటఁ బ్రవహించుట లేదు,”—భగవానుఁడైన బ్రహ్మ యది విని ప్రీతచిత్తుఁడై చిత్తమునందు సరస్వతిని స్మరించెను. అప్పుడు యాగానుష్ఠాన మైన బ్రహ్మయాహ్వానముచే దేవి సరస్వతి పుష్కరమునకు వచ్చి సుప్రభ యను పేర విఖ్యాత యయ్యెను. మునులు వేదవతియైన సరస్వతిని జూచి యానందితులైరి. పితామహుని సమ్మాననము పాలించి యానది యచ్చటి కరుదెంచె నని మునులును నానదిని విశేషముగా సమ్మానించిరి. సరిచ్ఛ్రేష్ఠయైన సరస్వతి యీవిధముగాఁ బుష్కరమునందుఁ బ్రవాహిత యయ్యెను. తరువాత మహాత్ముఁడైన మార్కండేయుఁడు దానిని కురుక్షేత్రమునకుఁ దీసికొనివచ్చెను.

నైమిశారణ్యవాసు లైన శౌనకాదిమునులు మహాత్ముఁడైన లోమహర్షణుని మరల నిట్లని ప్రశ్నించిరి,—“ఓమునీంద్రా! మేము

సత్పథమునం దుంటిమి, కాని యజ్ఞఫలము మాకెల్ల లభించు నుః"—అప్పుడు మహాభాగుండైన లోమహర్షణుండు మునిగణమునకు శిరసా నమస్కరించి యిట్లని చెప్పెను, "ఎచ్చట సరస్వతీనది ప్రవహించుచున్నదో యచ్చట యజ్ఞజన్యమైన మహాఫలము కలుగుచున్నది." వివిధవేదాభిజ్ఞులైన మును లది విని యందఱును గూడి సరస్వతిని స్మరించిరి. అపుడు యోగశీలురైన ఋషులు స్మరించినంతనే సరస్వతి మునుల యజ్ఞమును సఫలము చేయుటకు నక్కడ కరుగుదెంచెను. నైమిశారణ్యమున కరుదెంచి యామె కాంచనాక్షి యను పేరఁ బ్రసిద్ధయయ్యెను.

మహాతేజుండైన మంకణుఁ డాసరిద్వర యైన సరస్వతిని కురుక్షేత్రమునుండి తీసికొనివచ్చెను. గయుఁ డను రాజు గయాక్షేత్రమునందొక మహాయజ్ఞమును ప్రారంభించెను. ఆ యజ్ఞమునకు సరిద్వరమైన సరస్వతి యాహూత యయ్యెను. శంసితవ్రతులైన మహర్షు లప్పు డామెను 'విమల' యను నామధేయమునఁ బ్రసిద్ధి పఱచిరి. మహాత్ముండైన మంకణుఁ డక్కడ నుండియే యామెను మరల నాహ్వానము చేయఁగా నప్పు డామహానది కురుక్షేత్రమునఁ బ్రవేశించెను. దేవర్షిసేవితమును బవిత్రమునైన కోసలదేశ ముత్తర దిక్కునం దున్నది. ఉద్దాలకుఁ డనుముని యక్కడనుండి సరస్వతీనదిని ధ్యానము చేసెను. మునిమనోరథమును నెఱవేర్చుటకు సరిద్వరయైన సరస్వతి యచ్చటికిఁ గూడ వచ్చెను. వల్కలాజినధారులైన ఋషు లప్పు డామె నర్చింపవచ్చిరి. ఆకేదారక్షేత్రమునందు సరస్వతి 'మనోహర' యనుపేరఁ బ్రసిద్ధయయ్యెను. ఋషులును సిద్ధులు నామెను సేవించిరి. ఆమె నిఖిలపాపక్షయదక్షురాలు. పైని జెప్పఁబడిన మంకణుఁడు పరమేశ్వరారాధన మొనరించి ఋషులయుపకారార్థము దేవి

యగు సరస్వతిని గురుక్షేత్రమునఁ బ్రవేశపెట్టెను. పూర్వమునందు దక్షుఁడు గంగాద్వారమునందు యజ్ఞముచేయుచు నక్కడ భగవతి యైన సరస్వతిని 'విమలోదక' యను నామమునఁ బ్రఖ్యాతనొనర్చెను. మహాత్ముఁడైన మంకణుఁ డక్కడనుండికూడ నామెనాహ్వానముసే సెను. కురురాజు కురుక్షేత్రమునందు యజ్ఞము సేయుసమయమున సరస్వతి నక్కడకుఁ గొంపోయెను. ధీమంతుఁడైనమార్కండేయునిచే సరస్వతి సరోమధ్యమునకుఁ దేఁబడియెను. అనంతరము మహాత్ముఁ డైన మంకణుఁడు పుణ్యతోయమైన సరస్వతిని స్తవమొనరించి సప్త సారస్వతమును గావించి కృతకృత్యుఁ డయ్యెను.

## —♦ మంకణకుఁ డొనరించినశివస్తోత్రము ♦—

ఋషులడుగుచున్నారు— "మహర్షియైన మంకణుఁ డెట్లు సిద్ధిఁబొందెను. ఆతనితండ్రి యెవ్వరు? ఆతఁడు నృత్యాసక్తుఁడై యుం డఁగా నెందులకు మహాదేవుఁ డాతని నివారించెను?"—లోమహర్షణుఁ డిట్లుచెప్పుచున్నాఁడు—"మంకణముని కశ్యపునిమానసపుత్త్రుఁడు, ఆ తఁ డొకనాఁడు వల్కలములను ధరించి స్నానముచేయుటకు సంసిద్ధుఁడై యుండఁగా రంభ మొదలగు ప్రియదర్శనలైన యప్సరస లక్కడ కరు దెంచిరి. అప్పు డామనోహరాకారిణులైన యప్సరోగణములు వివ స్త్రలై స్నానము నిమిత్తము జలములం జొచ్చిరి. అప్పుడు మంకణుని మనస్సు క్షుభితమైపోయెను. ఆజలమునందే యాతనికి రేతఃపతన మ య్యెను. ఒకవ్యాధుఁ డపుత్రమును దీసికొనిపోయి యొకకలశమునం దుంచఁగా నది యేడుభాగములుగా విడిపోయెను. దానివ లన సప్తఋషులు జన్మించిరి. ఆఋషులు మరుద్గణ మని ప్రసిద్ధిఁగాం చిరి. వారినామము లేవనఁగా—వాయువేగుఁడు, వాయుబలుఁడు,

వాయుహనుఁడు, వాయుమండలుఁడు, వాయుకాలుఁడు, వాయురేతుఁడు, వాయుచక్రుఁడు.

మహర్షియైన మంకణకుని యీపుత్త్రులందఱుఁ జరాచరవిశ్వమును ధరించియుండిరి. పూర్వకాలమున మంకణకుఁడు కుశాగ్రమువలన సిద్ధినొందె నని ప్రసిద్ధి గలదు. ఓవిప్రులారా! కుశాగ్రమునందు మంకణకునిహస్తము క్షతమయ్యెను. దెబ్బ దగిలిన యాచోటినుండి శాకరసము స్రవింపఁజొచ్చెను. అతఁ డాశాకరసమును జూచి హర్షావేశముతో నృత్యము సేయఁజొచ్చెను. అప్పుడు స్థావరజంగమాత్మకమైన సమస్తజగత్తును నృత్యముసేయఁజొచ్చెను. మంకణకుని తేజమునకు మోహితమై జగమంతయు నిట్లు నృత్యముచేయుచుండుటఁ జూచి బ్రహ్మాదిదేవతలును, దపోధనులైన ఋషులును గూడి మహాదేవుని సన్నిధి కేఁగి, మంకణుని నృత్యవ్యాపారమునుగూర్చి యాయనతో నివేదించిరి. మఱియు వా రందఱును "ఓదేవదేవా! మహర్షియైన యీమంకణుఁ డిఁక నృత్యముచేయకుండుట కుపాయ మేది గలదో దానిని నీ వొనరింపవలయు నని ప్రార్థించిరి.

అప్పుడు మహాదేవుఁడు హర్షావేశుఁడై యున్న మంకణమునిని జూచి దేవహితముఁ గోరి యిట్లనియెను—"ఓమునిసత్తమా! నీవు తపస్వివి, ధర్మపథమునందే నీయునికి; కాని నీయీహర్షావేశమునకుఁ గారణ మేమి?" ఇట్లనఁగా ఋషి—"ఓబ్రాహ్మణుఁడా! నాహస్తమునుండి శాకరసము ప్రవహించుచుండుట నీవు చూడకున్నావు. ఇది చూచియే నేను మహాహర్షముతో నృత్యముచేయుచున్నాను." అని చెప్పెను. మహాదేవుఁడు రాగమోహితుఁడై యున్న యామునిని జూచి హాస్యపూర్వకముగా—"ఓవిప్రా! నీవు నావంకఁ జూడుము. ఇటు చూడుము. ఇంతమాత్రముచే నా కించుకయు నాశ్చర్యము కలుగుట

లేదు." అని చెప్పుచు మహాప్రభావుఁ డైన యామహాదేవుఁ డప్పుడు తనయంగుష్ఠమును దనవ్రేలికొనతో నొక్కి గాయము గావించెను. అప్పు డాక్షతస్థానమునుండి మంచువలెఁ దెల్లనైనభస్మము రాశిగాఁ బడఁజొచ్చెను. అది చూచి మంకణకుఁ డప్పుడు లజ్జితుఁడై మహాదేవుని పాద ద్వయముపైఁ బడి యిట్లు పలుకఁ దొడఁగెను—"నేను మహాత్ముఁడును శూలపాణియు నైన మహాదేవుని దక్క మఱి యెవ్వరిని మన్నింపను. ఓశూలధారీ! నీవు చరాచరజగత్తునకు గురుఁడవు. ఓవిశుద్ధా! బ్రహ్మాదిదేవతలు నిన్నే యాశ్రయించియున్నారు. నీవే కర్తవు. నీవే కారయితవు, నీవే మహదూపుఁడవు—సర్వస్వరూపుఁడవు. నీప్రసాదముచేతనే దేవత లెట్టిభయమును లేకుండ సుఖశాంతి గల్గి వసించుచున్నారు. సురాసురు లందఱకును నీవే యధీశ్వరుఁడవు, నాతపస్సు క్షీణింపకుండునట్లుగా ననుగ్రహింపుము."

లోమహర్షణుఁడు మరలనిట్లు చెప్పుచున్నాఁడు. "మహర్షియైన మంకణుఁడు మహాదేవు నిట్లు స్తవము గావించి ప్రణామ మొనరించెను. తరువాత దేవదేవుఁడు ప్రసన్నుఁడై యాఋషి కిట్లనెను. "ఓవిప్రుఁడా! నాప్రసాదముచే నీతపస్సు సహస్రగుణములుగా వర్ధిల్లుఁగాక. నేను నీతో నెప్పుడును నీయాశ్రమమునందు వసించెదను; ఏమానవుఁడు సప్తసారస్వతమునందు స్నాన మొనరించి నన్నర్చించుచున్నాఁడో యాతని కిహపరములయందు దుర్లభ మైన దించుకయును లేదు. నన్నర్చించుమానవులు నిశ్చయముగా సారస్వతలోకములఁ బొందుచున్నారు. శివప్రసాదముచే వా రంతమునఁ బరమపదము నొందుట కధికారులగుచున్నారు.

—♦ ఔశనాదివసిష్ఠాంతమాహాత్మ్యము. ♦—

లోమహర్షణుఁడు చెప్పుచున్నాఁడు—"అనంతరము శ్రేష్ఠాయు

క్తులై ఔశనసతీర్థమున కేఁగవలయును. ఈతీర్థమునందు, ఉశనాసిద్ధి ప్రాప్తించి గ్రహత్వము లభించుచున్నది. ఈపుణ్యకురుక్షేత్రమునందు సప్తజన్మసంచితమైన పాతకమునుండి విముక్తులై పరబ్రహ్మలాభము నొంది, జన్మమృత్యుభయములనుండి విముక్తులగుచున్నారు. ఇచ్చోట రహోదరుఁ డను మునిప్రకాండుఁడు మస్తకగ్రస్తుఁడై తీర్థమాహాత్మ్య దర్శనమున సిద్ధినొందెను; లోమహర్షణుఁ డిట్లు చెప్పఁగా ఋషులు మరల నడుగుచున్నారు—“ రహోదరముని మస్తకగ్రస్తుఁ డెట్లయ్యెనో యెట్లు విముక్తిఁ గాంచెనో, ఆతీర్థమాహాత్మ్య మెట్టిదో సవిస్తరముగా వినఁగోరుచున్నాము.” మరల లోమహర్షణుఁడు చెప్పుచున్నారు—“ ఓద్విజేంద్రులారా! పూర్వకాలమునందు మహాత్ముఁడైన రామచంద్రుఁడు దండకారణ్యమున వసించుచు బహుసంఖ్యాకులైన నిశాచరులను నిహతులఁ గావించెను. వారిలో నొకానొక దుర్లభరాక్షసుఁడు రామచంద్రుని తీక్ష్ణధార గల క్షురప్రహారముచే మస్తకము దెగి మహావనములోఁ బడిపోయెను. అప్పుడు రాక్షసుని యావిచ్ఛిన్నమస్తకము రహోదరమునివరునికంఠమును సమీపించి యాకస్మికముగా నాతనికంఠమును బట్టికొనియెను. రహోదరముని యరణ్యమధ్యమునం దట్లు తిరుగుచుండెను, క్రమముగా నాతనియస్థులను భేదించుకొని యామస్తక మాతనికంఠములోఁ బ్రవేశించెను. అందుచే నాతఁడు మొట్టమొదట నేతీర్థమునకే నేగుటకుఁగాని, యేప్రయత్నమైనఁ జేయుటకుఁగాని సమర్థుఁడు గాకుండెను. క్రమముగా నాతఁ డత్యంతబాధితుఁడై పడిపోయెను. కాని యిట్టియవస్థయందే యాతఁడు క్రమముగా భూమియందలి సకలతీర్థములకుఁ బర్యటనము చేయఁజొచ్చెను. ఇట్లు తిరుగుచు నొకనాఁడు రహోదరముని తనదురవస్థనుగూర్చి భావితాత్ములగు సప్తర్షులవద్దఁ జెప్పికొనియెను. అంతయు విని యా

ఋషు లామునివరుని, ఔశనసతీర్థమున కేఁగు మని యుపదేశ మొసఁగిరి. రహోదరుఁ డాహితము నాలించి యౌశనసతీర్థమున కేఁగెను. అతఁ డట్లు ఔశనసతీర్థమున కేఁగి జలముల స్పృశించినంతమాత్రముననే, యామస్తక మాతనిగళమును వీడి జలములలోఁ బడిపోయెను. ఓ ద్విజులారా! రహోదరముని నిష్పాపుఁడును, పూతాత్ముఁడు నై సంప్రీతచిత్తముతోఁ దన యాశ్రమమునకుఁ జేరఁదలఁచి, ఋషివరుల సన్నిధిని సమాచార మంతయు విశదపఱచెను. ఋషు లీ 'ఔశనస' తీర్థమునకుఁ గల, విశేషమాహాత్మ్యమునుగూర్చి విని యుందఱు నప్పుడచ్చటికి విచ్చేసిరి. అది మొద లాతీర్థమునకుఁ గపాలమోచనతీర్థమను పేరు గలిగెను. ఇచ్చట విశ్వామిత్రులవారి, విశ్వపవిత్రమైన మహాతీర్థము గలదు. ఈతీర్థమునందే విశ్వామిత్రమహర్షి బ్రహ్మర్షిత్వమును బొందెను. ఈతీర్థమునందు స్నానముచేసినచో నిస్సందేహముగా బ్రాహ్మణ్యత సిద్ధింపఁగలదు. ఎవ్వరైన బ్రాహ్మణు లీతీర్థమునందు స్నానముచేసినచో వారు విశుద్ధదేహులై పరమపదము నొందఁగలు న్నారు. తరువాత నియతాహారులు నియతచిత్తులు నై పృథూదకతీర్థమున కేఁగవలయును. అచ్చట ఋషంగుఁ డను పేరుగల యొకానొక ఋషి సిద్ధిఁబొందెను. ఆయన పూర్వజన్మజ్ఞానము గలవాఁడు. అతఁ డెప్పుడును గంగాద్వారమున వాసముచేయుచుఁ, దన కవసానకాలము తటస్థింపఁగానే తీర్థమాహాత్మ్యమును స్మరించుకొని, స్వధర్మనిష్ఠులును సాధుచిత్తులు నగు తనకొడుకులతో నిట్లు చెప్పెను—“సరస్వతీతీర్థమున కుత్తరదిశగా నెవ్వరు నిజదేహమును విడుచుచున్నారో, పృథూదకతీర్థమునం దెవ్వరు జపపరాయణు లగుచున్నారో వారి కెప్పుడును మృత్యువు ఘటిల్లదు.” అచ్చట బ్రహ్మయోని విరాజమాన మగుచుండెను.

పూర్వకాలమున బ్రహ్మ యచ్చటఁ బృథూదకమునందు దాశ్రి

ఠము గావించుకొని, సరస్వతీతటమునందు నివాసముచేయుచుండెను. అతఁడు చాతుర్వర్ణ్యసృష్టికొఱ కాత్మజ్ఞానతత్పరుఁడై యుండెను. అవ్యక్తయోనియైన బ్రహ్మ యట్లు ధ్యానముచేయుచుండఁగా నాతనిముఖమువలన బ్రాహ్మణు లుత్పన్నము గాఁజొచ్చిరి. తరువాత బ్రహ్మబాహుద్వయమునుండి క్షత్రియులును, ఊరుద్వయమునుండి వైశ్యులును, పాదద్వయమునుండి శూద్రులును జన్మించిరి. క్రమముగా నిట్లు నాల్గువర్ణములు నుత్పత్తి యగుటఁ జూచి, బ్రహ్మ యవ్వా డాశ్రమము లన్నిటిని స్థాపించెను. ఈవిధముగా నీతీర్థము బ్రహ్మచేఁ బ్రతిష్ఠింపఁబడిన దగుటచే బ్రహ్మయోని యనుపేరఁ బ్రసిద్ధిగాంచెను. ముక్తిని గోరి యీతీర్థమున స్నానముచేసినవారు మరల నెన్నఁటికి జన్మభయమును బొందరు.

ఇచ్చటనే అవకీర్ణ మనుపేరిట నొకప్రసిద్ధతీర్థము గలదు. అచ్చోట బకదాల్భ్యుఁ డనునాతఁడు మహాక్రోధమున రాష్ట్రరచనార్థము బ్రాహ్మణులతో హోమముచేయుటకుఁ బ్రారంభించెను. రాజున కప్పుడు బుద్ధివికాసము గలిగెను.

ఋషులు మరల నిట్లడిగిరి—"ఈయవకీర్ణనామకతీర్థ మెట్లు ప్రతిష్ఠింపఁబడినది? ధృతరాష్ట్రరాజు మొదట నెందుల కాతని నప్రసాదితునిఁ గావించెను?"—లోమహర్షణుఁ డిట్లు చెప్పుచున్నాఁడు—పూర్వము నైమిశారణ్యమునందలి ఋషులు దక్షిణలు పొందుటకొఱకు రాజగు ధృతరాష్ట్రునిదగ్గఱకువచ్చిరి. వారిలో బకదాల్భ్యుఁడు ముందునకు వచ్చి ఋషులకోరికను రాజున కెఱిఁగించెను. అప్పుడు ధృతరాష్ట్రరాజు బకదాల్భ్యుని నిందింపఁజొచ్చెను. అందుచే బకదాల్భ్యుఁ డత్యంతకోపావేశుఁడై తనశరీరమునందలి మాంసమును తీసి పృథూదకమునందలి యవకీర్ణమహాతీర్థములో ధృతరాష్ట్రుని

జ్యహోమముచేయుట కారంభించెను. ఇట్లు యజ్ఞము ప్రారంభించి నంతమాత్రముచేతనే ధృతరాష్ట్రరాజ్యము నానావిధముల నాశము గాంజొచ్చెను. రాజు దుష్కృతిపరిణామముచేఁ గ్రమముగా రాజ్యైశ్వర్యము విధ్వస్తమైపోయెను. అప్పు డానరపతి బ్రాహ్మణులకార్యకలాపమునుగూర్చి యాలోచించుకొనియెను; చిట్టచివరకు కాతఁడు పురోహితుని వెంటఁబెట్టుకొని వివిధరత్నరాసులతో విప్రుఁడైన బకదాల్భ్యుని ప్రసన్నునిగావించుటకు సరస్వతీతీర్థమున కేఁగెను.

బకదాల్భ్యుఁ డప్పుడు రాజువ్యవహారమునకు సంతుష్టుఁడై యిట్లు పలికెను. "బుద్ధిపూర్వకముగా బ్రాహ్మణుల కవమానము చేయకుము. బ్రాహ్మణుఁ డవమానింపఁబడినచో మూఁడుకులములపురుషులు వినష్టు లగుచున్నారు." ఇట్లు పలికి యప్పు డాతఁడు రాజునకు హితముచేయుట కుద్దేశించెను. తరువాత నాతఁడు నేయి యాఁజాలును బ్రోక్షించి మృతులైన రాజపురుషులను బునరుజ్జీవింపఁజేసెను. ఈయవతీర్ణతీర్థమునందు జితేంద్రియులై యెవ్వరు శ్రద్ధతో స్నానమాచరించుచున్నారో, వారిమనసులందలి సకలసదిచ్ఛలును సఫలము లగుచున్నది.

అచ్చోట 'యాయాత' నామమున నింకొక ప్రఖ్యాతతీర్థమున్నది, అక్కడ యజ్ఞారంభముచేసినచో నందు మధువును స్రవించును. భక్తిపూర్వకముగా నచ్చట స్నానముచేసినవారు సర్వపాపవిముక్తు లగుచున్నారు; మఱియు నశ్వమేధయజ్ఞముచేసినఫలము వారికి లభించుచున్నది.

ఓవిప్రులారా! ఈచోటనే "మధుస్రవ" మను మఱియొక పవిత్రతమతీర్థము గలదు. అక్కడ భక్తితో స్నానముచేసినమానవులు తమపితృపురుషుల కమృతముతోఁ దర్పణములు గావించినవా రగు

చున్నారు. అక్కడ నింకొకతీర్థము గలదు, దానిపేరు వసిష్ఠాపవాహము. భక్తితో నీతీర్థమున స్నానముచేసినవారికి వసిష్ఠలోకములు లభించును.

## —♦ అరుణాసరస్వతిసంగమమాహాత్మ్యము ♦—

అంతట ఋషిబృందములు మహాత్ముఁడైన రోమహర్షుణుఁ గాంచి "ఆర్యశ్రేష్ఠా! అత్యంతవేగవతియైన సరస్వతీనది మునిచంద్రుఁడైన వసిష్ఠుని వహించి తనవేగముతో నెందులకుఁ దీసికొనిపోయెనో యావృత్తాంతము వినుటకు మాకుఁ దెలియఁజెప్పుము." అని యడిగిరి. అప్పుడు రోమహర్షుఁ డిట్లు చెప్పసాగెను.

గాధిపుత్రుఁడైన విశ్వామిత్రుఁడును మహాత్ముఁడైన వసిష్ఠుఁడును సమమగు తపస్స్పర్ధ గలిగి విరోధులై యుండిరి. వసిష్ఠుఁడు స్థాణుతీర్థమునఁ దనయాశ్రమమును స్థాపించుకొనియెను. వసిష్ఠాశ్రమమునకుఁ బశ్చిమమునందే విశ్వామిత్రుని యాశ్రమ ముండెను. భగవంతుఁడైన స్థాణుఁ డేతీర్థమునందు యజ్ఞముగావించి సరస్వతిని బూజాపూర్వకముగా లింగాకారమున స్థాపనచేసెనో, యాస్థలమునందు వసిష్ఠుఁడు కఠినతపస్సు నొనర్చుచున్నవాఁడై యుండెను. ఆయన తపఃప్రభావమున విశ్వామిత్రుఁడు హీనప్రభగలవాఁ డయ్యెను. అప్పుడు విశ్వామిత్రుఁడు సరస్వతిని స్మరణముచేసి "నీవు మునివరుఁడైన వసిష్ఠుని నీవేగముచే నాకడకు దీసికొనిరమ్ము. వసిష్ఠుఁ డిచ్చటికి వచ్చినతోడనే నేనతని నిశ్చయముగా వినాశ మొనరింతును." అని చెప్పెను. ఈమాటలు విని సరస్వతి వ్యథితురాలయ్యెను. ఆమెసర్వాంగకములుఁ గంపింపఁజొచ్చెను. విశ్వామిత్రుఁ డట్లు కంపితురాలును వ్యథితురాలు నగుచున్న సరస్వతిని జూచి క్రోధోద్వేగముతో

"సరస్వతీ! అతిత్వరితముగా నీవు వసిష్ఠుని దీసికొనిరమ్ము" అని యదలించెను. సరిద్వరమైన సరస్వతి యప్పుడు విధిలేక వసిష్ఠమునీశ్వ రునివద్ద కేఁగి దుఃఖించుచు విశ్వామిత్రునిమాటలను విన్నవించెను. సరస్వతి శోకభరముచే నత్యంతకాతరయై, వివర్ణయై, దీనయై యుండు ట వసిష్ఠుఁడు చూచెను. అట్టియవస్థయందు నామెను జూచి యాతఁ డిట్లుపలికెను,—"దేవీ! నీవు నన్ను విశ్వామిత్రునివద్దకుఁ దీసికొని పొమ్ము"

కృపాశీలుఁడైన మునివలుకులను విని సరిద్వరమైన సరస్వతి తనసలిలప్రవాహముచే నత్సోటిని ముంచివేసెను. సలిలవేగముచే నొడ్డు విఱిగిపోయెను. వసిష్ఠుఁ డప్పుడు సరస్వతీసలిలములచేఁ గొట్టుకొ నిపోవుచు నామె నిట్లు స్తవముచేయఁజొచ్చెను. "ఓదేవీ! సరస్వతీ! నీవు పితామహునిసరోవరమునుండి జన్మించితివి. నీపవిత్రసలిలము లచే లోక మంతయుఁ బరివ్యాప్తమై యున్నది. నీవు నీయిష్టము గల ప్రదేశమున కేఁగుచుందువు. మేఘసమూహమునందలి జలరాశి నీవ లననే సృష్టింపఁబడినది; పృథివియందలి సమస్తజలములు నీమూర్తిమే లై యున్నవి. నీవలననే మేము మహామహిమాన్వితుల మైతిమి. పుష్టి, ధృతి, కీర్తి, సిద్ధి, కాంతి, క్షమా, స్వధా, స్వాహా, వాణీప్రభృతిసక లమును నీవు. ఈజగమంతయు భవదాయత్తము, నీవే సర్వభూతల ములయందు వాణీరూపమున విరాజిల్లుచుంటివి."

భగవతియైన సరస్వతి యీవిధముగా వసిష్ఠునిచే స్తుతినొంది, యప్పుడనాయాసముగా నాతనిని విశ్వామిత్రమునికడఁ గొం పోయెను. అట్లేఁగి యామె విశ్వామిత్రునిఁ బూజించి యాతనికి వసి ష్ఠాగమనము నెఱింగించెను. అప్పుడు విశ్వామిత్రుఁడు సరస్వతివలనఁ గొనితేఁబడిన వసిష్ఠునిఁ జూచి క్రుద్ధుఁడై యాతనిని వినాశ మొనరిం

చుట కుద్యతుఁ డయ్యెను. క్రుద్ధుఁడై యన్వేషణముచేయుచున్న విశ్వామిత్రునిఁ జూచి, సరస్వతి బ్రహ్మహత్యాభయముచే వసిష్ఠునిఁ దీసికొని మరలఁ దనజలవేగము నింకొకదిక్కునకుఁ బ్రవహింపఁజేసెను. సరిద్వరమైన సరస్వతి యీయిరువురిమాటను జవదాఁటెను; కాని విశ్వామిత్రుఁ డీవ్యాపారముచే వంచితుఁడయ్యెను. అప్పు డాతఁడు వసిష్ఠునిఁ దీసికొనిపోవుచున్న సరస్వతీనదిని గాంచి క్రోధారుణనేత్రుఁడై "సరిద్వరమా! నన్ను వంచించి నీవన్యవిధముగాఁ బ్రవహించిపోవుచున్నావు. ఓకళ్యాణీ! యీయపరాధముచే నీవు రాక్షసులచేఁ బరివృతురాలవై శోణితమును బ్రవహించుచుందువుగాక" అని శపించెను. విశ్వామిత్రునిచే నిట్లభిశప్తమై నాఁటనుండి యొకసంవత్సరమాత్రము సరస్వతి రక్తజలమును బ్రవహించెను.

తరువాత దేవతలు, ఋషులు, గంధర్వులు, నప్సరసలు మొదలగువారు సరస్వతీనదియొక్క యవస్థను జూచి యత్యంతము దుఃఖంపఁజొచ్చిరి. ఆరమణీయతీర్థశ్రేష్ఠము రక్తమును బ్రవహింపఁజేయుటఁ జూచి భూతములు, పిశాచములు మొదలగునవి యచ్చటికి రాఁజొచ్చెను. అవి యన్నియుఁ జేరి హర్షోత్కర్షముతో రక్తపానముసేయుచుండెను. వాని యంతరంగములయం దిఁక దైన్యమును దుఃఖమును లేకుండెను. శోణితపానముచే నవి పరమతృప్తిని బొంది నృత్యములు చేయుచుండెను, హాసమొనరించుచుండెను. స్వర్గమును జయించినవానివలె నానంద మనుభవించుచుండెను. ఒకప్పుడు శతయోజనములదూరమునుండి కొందఱు తపస్వులైన మునులు సరస్వతీతీర్థమునకు స్నానార్థులై యరుదెంచిరి. వికటాకారులైన రాక్షసులచే నావరింపఁబడెను. శోణితమును బ్రవహింపఁజేయుచున్న యానదిని వా రప్పుడు చూచిరి. అట్లు చూచి వారు సరస్వతి నుద్ధారముచేయుట కనేకప్రయత్నములు చేయఁ

జొచ్చిరి; మహాభాగులైన మహర్షు లందఱును గూడి సరస్వతి నిట్లు ప్రశ్నించిరి. "ఓసరిచ్ఛ్రేష్ఠమా! నీ వేకారణముచే నిట్లు రక్తప్రవాహము గల్గినదాన వైతివి? నీయీవ్యాకులత్వమును జూచియే మేము విస్మితులమగుచున్నాము."

అప్పుడు సరస్వతీనది విశ్వామిత్రుఁ డొసంగించిన సమస్తవ్యాపారమును వారికడ విశదపఱచెను. [illegible] పద్యవాక్యములకు సంప్రీతులై పుణ్యజలౌఘవాహినియుఁ బాపనాశనము నైన యరుణానదిని సరస్వతిలోనికిఁ దెచ్చిరి. సరస్వతి పూర్వస్థితి వలెనే నిర్మలజలపూర్ణ యయ్యెను. అది చూచి [illegible] దుఃఖించుచు నతిదీనభావములతో మరల [illegible] యిట్లు పలికిరి—"మేము స్వభావముచే క్షుధా[illegible], ధ[illegible]లము. మా కెప్పటికిని వినాశము లేదు. మే మిచ్ఛాపూర్వకముగా నెప్పుడును బాపముచేయము. మీయనుగ్రహాభావముచేను, మాదుష్కర్మఫలముచేను మాపక్షము దినదినాభివృద్ధి యగుచున్నది; కారణ మిదే, మేము బ్రహ్మరాక్షసులము. క్షత్రియులుగాని, వైశ్యులుగాని, శూద్రులుగాని దుష్కార్యమగ్నులై బ్రాహ్మణవిద్వేషము గలిగినవారైనచో బ్రహ్మరాక్షసు లగుచున్నారు. ఇదిగాక గురువునకుఁగాని, తల్లికిఁగాని, తండ్రికిఁగాని ద్వేషముచేయువారును, వృద్ధుల నవమానించువారును గూడ రాక్షసు లగుచున్నారు. పాపినీకామినీజనుల వ్యభిచారదోషముచేతఁగూడ మాపక్ష మభివృద్ధియగుచున్నది. అది యటుండనిండు, లోకములో నెంతటిఘోరపాపము లాచరించినవారినైన మీరెలు పరిత్రాణ మొనరింపఁగలరు"

కృపాశీలురైన మును లాపలుకులు విని సంతప్తులై తమలోఁ దా మిట్లు మాటలాడికొనఁజొచ్చిరి. "తుమ్మచే నపవిత్ర మైనదియు,

పురుగులచే నసహ్యమైనదియు, శిష్టులుగానివారు మూఁదుగా భుజించి నదియు, తలవెంట్రుకలు పడినదియు, గాలిచే నారిపోయినదియు శ్వాసలు విడువఁబడినదియు, నైన యన్నము రాక్షసులు భక్షింపఁదగినది. అభిజ్ఞులైనవా రెప్పుడు నట్టియన్నములను బొత్తిగా విసర్జింతురు. ఇట్టి యన్నము నెవ్వరు భుజించుచుందురో వారితోఁగూడ రాక్షసులును భుజించుచుందురు" ఆతపోధను లందఱు నిట్లు సంభాషించుకొని యానదిని పరిశుద్ధను గావించి, తరువాత రాక్షసులకు మోక్షప్రాప్తికొఱకు నొకసంగమమునందు స్నానముచేయున ట్లొనరించిరి. ఆయరుణాసరస్వతీనదులసంగమమునందు స్నానముచేసి మూఁడుదినము లుపవాసముచేసిన సకలపాపములు వినాశితము లగుచున్నవి. ఘోరకలియుగమునం దధర్మ మభ్యుదయము నొందువేళ నరుణాసంగమమున స్నానముచేసినచో ముక్తి లభించుచున్నది. అప్పు డారాక్షసు లందఱు నాసంగమస్నానములు గావించుకొని యొక్కొక్కరే పావనమూర్తులై దివ్యమాల్యదివ్యాంబరధారులై, స్వర్గగమశీలురలచేఁ బూజింపఁబడిరి.

## —♦ { ఋణమోచనాదితీర్థమాహాత్మ్యము<br>కామ్యకాదివనమాహాత్మ్యము. } ♦—

లోమహర్షణుఁడు చెప్పుచున్నాఁడు— "పూర్వకాలమునందు ఋషు లక్కడ నాలుగుసహస్రములను నివసించుచున్నారు. ఆనముద్రములలో నొక్కొక్కదానిలో గోసహస్రదానఫలము లభించుచున్నది. ఓబ్రాహ్మణులారా! అక్కడ మహర్షిసత్తములైన వారైన నేకొంచెము తపమాచరించినను నది పూర్ణతనొందుచున్నది. ఓవిప్రోత్తములారా! అచ్చటనే శతసాహస్రికము, శాతికము, అను రెండునదు లున్నవి. వానియందు స్నానముచేసినవారికి సహస్రగోవులను

దానము నొనరించిన ఫలము గలదు. ఇదిగాక, సరస్వతీతీరమునందున్న సోమతీర్థమున స్నానముచేసినచో రాజసూయయజ్ఞముచేసిన ఫలము కలుగుచున్నది. శ్రద్ధాశీలురు జితేంద్రియులునై, రేణుకాష్టకమున కెవ్వ రేఁగుచున్నారో వారికి మాతృభక్తిజనితమైన పుణ్యము లభించుచున్నది. బ్రాహ్మణసేవితములైన ఋణమోచన, కుమారాభిషేక, ఔజసతీర్థముల కేఁగి స్నానము గావించినవారు యశస్వులై కౌమారపురప్రాప్తి నొందుచున్నారు. చైత్రమాసమున శుక్లపక్షమున నష్టమినాఁ డచ్చట శ్రాద్ధముచేసినచో గయాశ్రాద్ధపుణ్యము లభించును. సన్నిహతీతీర్థమునం దెల్లు శ్రాద్ధముచేయవలయునో పూర్వమున వాయువుచేఁ జెప్పఁబడినది. అందుచేత సర్వప్రయత్నముల నచ్చట శ్రాద్ధానుష్ఠానము చేయవలయును. చైత్రమాసమున షష్ఠితిథిని శ్రద్ధతో నచ్చట స్నానముచేసిన వారిపితృపురుషు లక్షయమైన యుదకలాభము నొందుచున్నారు. అక్కడ, పంచవట మనుపేర విశ్వవిఖ్యాతమైన తీర్థమొకటి గలదు. మహాదేవుఁ డచ్చట స్వయముగా యోగము నవలంబించి యుండును; అక్కడ కేఁగి స్నానముచేసి మహాదేవుఁడైన మహేశ్వరు నర్చించినవారికి గాణపత్యప్రాప్తియు, సురబృందముతోడి విహారమును లభించును.

ఓద్విజేంద్రులారా! కురుక్షేత్రము విఖ్యాతతీర్థము, అచ్చటఁ గర్షణముచేయునిమిత్తమై కురురాజు కఠోరతపస్సు గావించియున్నాఁడు. ఆతనికఠినతపమునకు మెచ్చి యింద్రుఁ డాతనితో నిట్లనెను. "ఓరాజర్షి! నీయీతపశ్చర్యకు నేను సంతుష్టుఁడ నైతిని; అది యటుండ నిమ్ము, ఈకురుక్షేత్రమునకు వచ్చి యజ్ఞముచేసినవా రెవ్వరైన నగుదురుగాక, వారు సకలపాపవర్జితులై సుకృతలోకముల కేఁగుట కధికారు లగునట్లు చేసెదను." త్రిదశేంద్రుఁడైన యింద్రుఁ డిట్లు పాస

ముగఁ బలికి వెడలిపోయెను. తరువాత నాతఁ డిట్లు మరలమరల వచ్చుచు హాస్యముచేయుచు వెడలిపోవుచుండెను. కాని ఆ రాజర్షియంతరంగ మంతమాత్రమున కించుకయు సంచలింపదయ్యెను. ఇట్లు ఆతఁడు మరలమరల వచ్చుచు రాజును చలింపఁజేయుటకుఁ బలుకరించిపోవుచుండెను. కాని కురురాజు చలింపక తీవ్రతప మొనర్చుచుండెను. ఆతనితీవ్రతపస్సునకు ఇంద్రునిదేహము సంతప్తము గాఁజొచ్చెను, ఇంద్రుఁ డప్పుడు సంప్రీతచిత్తుఁడై "రాజా! నీ వెందుల కిట్లు ఘోరతప మాచరించుచున్నావో నా కెఱింగింపుము" అని యడిగెను. కురురా జిట్లు ఉత్తర మిచ్చెను. "శ్రద్ధతో నీతీర్థమునందు వాసముచేయువా రందఱును బరమాత్మ [illegible] బ్రహ్మభవనమున కేఁగఁగలరు. ఎట్టిమహాపాపములు చేసినవారైనను, పంచమహాపాతకములచే దూషితులైన వారైనను, ఈతీర్థంబున స్నానముచేసినచో విశుద్ధదేహులై పరమగతి నొందవలెను."

ఓ ద్విజవరులారా! పుణ్యప్రదమైన కురుక్షేత్రమునందుగల కురుక్షేత్రతీర్థమును [illegible]చో ముక్తిప్రాప్తులై పరమపదప్రాప్తు లగుచున్నారు. కురుక్షేత్రమునందు స్నానముచేసిన వారి కెట్టిపాపములు నిలువవు. అక్కడ స్నానముచేసినవారు కురురాజునాదేశముచేఁ బరమపదము నొందుచున్నారు. తరువాతఁ ద్రిభువనవిఖ్యాతమైన అరణకతీర్థమున కేఁగవలెను. పూర్వకాలమునం దక్కడ బ్రహ్మయు మహాదేవుఁడును ఋషులతో విరాజిల్లుచుండిరి. ఆతీర్థమునకుఁ బడమటిదెసను రుద్రాణియు, నుత్తరదిశను బద్మనాభుఁడును విరాజిల్లుచున్నారు. మధ్యస్థలమున అరణకతీర్థము శోభిల్లుచున్నది. ఇట్టితీర్థము త్రిభువనములలోను దుర్లభమైనది. దానియందు స్నానముచేసినవారిఁ బాపములు నిర్మూలితము లగుచున్నవి. వైశాఖమాసమున అష్టమీ

త్రిసంధ్యయందు మంగళవారమునాఁడు తత్తీర్థమున స్నానముచేసిన సకలపాపవిముక్తి గలుగును. నాలుగువంతులు సువర్ణముతోను, అపూపములతోను గలశదానము నెవ్వరిచ్చుటఁ జేయుచున్నారో వారు పాపమోచను లగుచున్నారు. ముందుగా రత్నయుతములైన కలశముల నిచ్చి దేవతాసంప్రీతి చేయవలెను, తరువాత సర్వపాతకహర మగునట్లుగాఁ గలశయుగ్మము దానముచేయవలయును. ఈవిధముగాఁ జేసి యెవ్వరు తత్తీర్థమునస్నానము చేయుచున్నారో వారు సర్వపాపవిముక్తులై పరమపదమొందుటకు సమర్థు లగుచున్నారు. ఇదిగాక అష్టమీమంగళవారము కలిసివచ్చిననాఁ డెవ్వరైన నక్కడ నేపుణ్యకార్యముచేసినను వారికి ముక్తిలాభము తప్పక కలుగును. సర్వతీర్థములకుఁ దీర్థస్వరూపమైన యాతీర్థమునందు స్నానముచేసినచో దేవతలయనుజ్ఞచేఁ బరమపదము ఘటిల్లుచున్నది. కామ్యకవనము సర్వవిధపాపములను ప్రశమితము చేయుచున్నది, దానిలోఁ బ్రవేశించినంతనే సమస్తపాపములనుండియు విముక్తి నొందుచున్నారు. సూర్యదేవుఁ డీవనము నాశ్రయించి తేజోమూర్తియై విరాజిల్లుచున్నాడు. ఓద్విజేంద్రులారా! ఈవనదర్శనముచేతనే ముక్తి లభించుచున్నది. ఏవ్యక్తి ఆదిత్యవారమునం దక్కడ స్నానముచేయునో యావ్యక్తికిఁ జిత్తశుద్ధి లభించుచున్నది, మఱియు సకలమనోరథసిద్ధి యగుచున్నది.

## —♦ దుర్గాదితీర్థమాహాత్మ్యము—స్థాణుమాహాత్మ్యము ♦—

అనంతరము ఋషులు సూతునిం గని “కామ్యకవనమునకుఁ బూర్వదిశయందు పరమపవిత్రమై యొప్పారుచున్న కుంజతీర్థ మెట్టి ప్రశస్తమైనదో వివరముగా వినఁగోరుచున్నాము.” అని యడుగఁగా లోమహర్షణుఁ డిట్లు చెప్పుచున్నాఁడు — మునులారా! మీరు సకలతీర్థశ్రే

ష్ఠనముల మాహాత్మ్యమును విందురు గాక. ఋషులచరిత్రకథలనుగూడ వినిన సకలపాపనిర్ముక్తులు గాఁగలరు. ఒకానొకప్పుడు నైమిశారణ్యమునందలి ఋషులు కురుక్షేత్రమునకు విచ్చేసిరి. సరస్వతీనదిలో స్నానముచేయవలె నని వారి కుద్దేశముకలిగెను; కాని వా రానదియందుఁ బ్రవేశింపఁజాలకపోయిరి; తరువాత వారు ప్రయత్నముచేసి యజ్ఞోపవీతనామ మగు నొకమహాతీర్థమును నిర్మాణము గావించిరి. తరువాత నెందఱుమునులు వచ్చినను దానియందుఁ బ్రవేశించుటకు సమర్థులుగాకపోయిరి. రంతుకముని యాశ్రమమెంతదూరమువఱకు వ్యాపించియున్నదో, అంతదూరమువఱకును చక్రతీర్థము వ్యాపించియున్నది. దేవినైన సరస్వతి యామాశ్రమమంతయు విప్రగణపరివ్యాప్తమై యుండుటఁ జూచి, విప్రహితార్థమై యనేకసుందరమైన కుంజములను నిర్మాణముగావించుకొనుచు పశ్చిమదిశామార్గమునఁ బ్రవహించిపోయెను. సరస్వతీనది యచ్చట సర్వభూతహితతత్పరయై నిలిచియుండెను. సరస్వతీనదియొక్క పూర్వదిక్ప్రవాహమునం దెవ్వరు స్నానముచేయుచున్నారో వారికి గంగాస్నానఫలము లభించుచున్నది. సరిద్వరమైన నర్మద, సరస్వతీదక్షిణప్రవాహమునందు సమ్మిళితమయ్యెను. యమునానది సరస్వతీపశ్చిమప్రవాహము నాశ్రయించెను. ఈనది ఉత్తరదిక్కుగాఁ బ్రవహించుచున్నను సింధునది యనుపేరు ధరించుచుండెను. ఈవిధముగాఁ బరమపావనియైన సరస్వతి నానాదిక్కులఁ బ్రవహించుచుండెను. దానియందు స్నానము గావించినచో సకలతీర్థములయందు స్నానముచేసినట్లే యగును. తరువాత మహాత్ముఁడైన మదనునితీర్థమున కేఁగవలయును. త్రిభువనవిఖ్యాతమైన యాతీర్థము విహారతీర్థమనుపేర వెలయుచున్నది. దేవతలందఱును గూడి శివదర్శనార్థమై యీస్థానమునకు వచ్చి దేవహితుఁడగు మహాదేవునిఁ

గాయక, హాహాహూహూలును, నందీశ్వరుఁడును, గణనాయకుఁడును మొదలగువారినిగూర్చి ప్రశ్నముఁ గలుగఁజొచ్చెను. నందీశ్వరుఁడు వచ్చినవాఁడై దేవతలతో "మహాదేవుఁడు దేవీసహితుఁడుగా విహారార్థముగా క్రీడించుచున్నాఁ" డని చెప్పెను. అది విని దేవతలు తమతమ స్థానములకు మరలిపోక యచ్చోట విహరింపఁజొచ్చిరి. అపుడు నారదుండు దేవతలక్రీడావినోదములఁ గాంచి సంతుష్టుఁడై యిట్లు పలికెను "శ్రీస్థానమగు నీ విహారస్థానమున దేవరు స్నానముచేయుదురో వారికి ధనధాన్యములతోను దక్షిణప్రియపదార్థములతోను సమగ్రాహారములు పరిపూర్ణము లగుట సంభవించును, సందేహము లేదు."

ఆతరువాత వ్యాసమహర్షి సారస్వతతీర్థమహిమ కొంత తెలుపవలయును, అక్కడ చేరిన వారలు పితృస్వామిత్వముఁ గలిగిన మానవులకు దుర్గతి పోగొట్టుకొనుటకు గలుగును. ఇచ్చోట విశ్వామిత్రునివలన సరస్వతి శాపము గలదు, దానిని దగ్గించుటచేతనే మానవులపాపములు దూరీభూతములై వారికిముక్తి నిశ్చయ మగుచున్నది. శ్రద్ధతో నెవ్వరిక్కడ దేవతలకును పితృదేవతలకును దానము లిచ్చుచున్నారో వారికవి యన్నియు నక్షయము లగుచున్నవి. పృథూదకమునకంటెను దీని విశేషత్వము కీర్తింపఁబడినది. సరస్వతీనది తూర్పుప్రవాహముగుంగా స్నానముచేసినవారు, మాతృహంతకులైనను, పితృహంతకులైనను, బ్రహ్మహంతకులైనను, గురుతల్పగాములైనను సరే స్నానాంతమున వారు పరిశుద్ధు లగుచున్నారు. సరస్వతి యిచ్చట దేవమార్గప్రతిష్ఠ గావించి దేవమార్గగామిని యయ్యెను. పూర్వదిగ్వాహినియైన సరస్వతి దుష్కృతికారులైనవారికిఁగూడఁ బుణ్యదాయినియై యున్నది. పూర్వదిగ్వాహిని యైన సరస్వతిని జేరి తత్తీరమునందు మూఁడురాత్రులు వసించినవారి కెట్టి దుష్కృతములు శరీరమునం దుండఁజాలవు. రుద్రుఁ

గజహూహూముల దర్శనస్పర్శనములవలని పుణ్యఫలమును, మఱియు నితరసరోవరముల మాహాత్మ్యమును, సకలము మాకు సవిస్తరముగా వర్ణించి చెప్పుము"

లోమహర్షణుఁడు చెప్పుచున్నాఁడు. "మీరంతయును వామనాఖ్యమహాపురాణమును వినుఁడు. ఈపురాణశ్రవణమున వామనప్రసాదమున ముక్తి లభింపఁగలదు; ఒకానొకప్పుడు సనత్కుమారుఁడు స్థాణువటమునసమీపమునఁ కూరుచుండియుండెను. బ్రహ్మపుత్రుఁడగు మహాత్ముఁడున్నైన యాతని వాలఖిల్యాదిమునిగణము పరివేష్టించియుండిరి. ఇట్టిసమయమునందు మార్కండేయమహాముని యచ్చటికి సవినయుఁడై వచ్చి సరోవరమాహాత్మ్యమునుగూర్చియు, వానిప్రమాణమునుగూర్చియు, వానియునికినిగూర్చియు నిట్లని ప్రశ్న చేసెను. "ఓద్విజోత్తమా! మహాత్మా! నీవు సకలశాస్త్రపారదర్శివి, బ్రహ్మసంభవుఁడవు. నేను నీసన్నిధానమున సర్వపాపహరమైన సరోమాహాత్మ్యము వినఁగోరుచున్నాను. నీవు తత్కీర్తనము నాకు వినిపింపుము. ఓద్విజేంద్రా! ఏయేతీర్థములు దృశ్యము లగునవి, యేయేతీర్థము లదృశ్యములు? ఈసాన్నిధ్యమునందలి స్థాణులింగములలో నేయేలింగములు పవిత్రములైనవి, యేయేలింగములదర్శనమాత్రముచే మానవులు ముక్తినొందుట కధికారు లగుదురు? స్థాణువటమున కెట్టి పుణ్యముగలదో, దానియుత్పత్తి వివరమెట్టిదియో అదియును నాకెఱింగింపుము. తీర్థములకుఁ బ్రదక్షిణ మాచరించుటవలన నెట్టిఫలము లభించునో, తీర్థస్నానములవలన నెట్టిపుణ్యము గలుగునో, గుహ్యములును, దేవదృశ్యములు నగు తీర్థములవలన నెట్టిపుణ్యము గలుగుచున్నదో, దేవదేవుఁడైన స్థాణుఁ డేవిధముగా సరోమధ్యమున విరాజిల్లుచుండునో, ఇంద్రుఁడు పాంసువులవలన నేవిధముగా సితీర్థసమును

బూర్ణము గావించెనో, స్థాణుతీర్థమాహాత్మ్య మెట్టిదో, చక్రతీర్థము వలన నెట్టిఫలము లభించుచున్నదో, సూర్యతీర్థసోమతీర్థములమాహాత్మ్య మెట్టిదో, తత్సమస్తము నాకు వర్ణించి చెప్పుము. ఓ మహాభాగుఁడా! శంకరునకును విష్ణునకును నెన్నివిధము లగు స్థానములు గలవో, సరస్వతికిఁగూడ నేయేస్థానములు నిర్దిష్టములై యున్నవో అవి యన్నియు వర్ణించి చెప్పుము. నీవు దేహధారివై యుండియు భగవానుఁడైన బ్రహ్మయనుగ్రహముగలవాఁడవై యున్నావు. సమస్త దేవమాహాత్మ్యతత్వములలో నీ కెఱుఁగరాని దించుకయు లేదు."

మార్కండేయమునీంద్రుని యీప్రశ్న విని బ్రహ్మపుత్రుఁడును మహామునియు నైన సనత్కుమారుని చిత్తము తీర్థములయందు గల్గినట్టి భక్తివశమున నాకర్షింపఁబడియెను. అప్పు డాతనియోగనిద్ర శిథిలమయ్యెను. ఆతఁడు మహేశ్వరునకు నమస్కరించి తాను పూర్వము బ్రహ్మసన్నిధి నెట్లు విని యుండెనో యట్లుగా నాయాప్రశ్నలకు నుత్తరము లిచ్చుటకు మొదలిడెను.

"మునివర్యా! మంగళమయుఁడును, వరదుఁడును, ఈశానుఁడు నైన మహేశ్వరునకు నమస్కరించి బ్రహ్మోక్తమైన తీర్థోత్పత్తివివరణమును వ్యక్తపఱచుచున్నాను. మొట్టమొదట భీషణమైన యేకార్ణవజలమునందు సమస్తమును మగ్నమై యుండెను. స్థావరజంగమముల వివరణ మేమియు లేదు. అప్పుడు ప్రజాగణమునకు బీజసంభవమగు నొకపెద్దయండ మావిర్భవించెను. బ్రహ్మ ఆయండమునందు శయనించి యుండెను. ఆతఁ డట్లు సహస్రయుగములు శయనించిన తరువాత మేల్కనియెను. అప్పు డాతనికి సత్త్వగుణోద్రేకము గలిగెను, ఆతఁడు మేల్కాంచి సమస్తము శూన్యముగా నున్న దని తెలిసికొనియెను. అందుచేత నాతఁడు రజోగుణమునకు వశుఁడై సృష్టివిషయమై

చింతింపఁజొచ్చెను. రజోగుణము సృష్టివిషయకమైన దని చెప్పఁబడి యున్నది. సత్వము స్థితిగుణ మని తెలియుచున్నది. తమోగుణము సృష్టిసంహారమునందు ప్రవర్తించుచున్నది. ఆభగవానుఁడు సర్వవ్యాపియుఁ బరమపురుషుఁడు గుణాతీతుఁడు నని నిర్దేశింపఁబడినది జీవరాసులయం దంతట నాతఁడు వ్యాపించియుండును. ఆతఁడే బ్రహ్మ, ఆతఁడే గోవిందుఁడు, ఆతఁడే సనాతనుఁడైన యీశ్వరుఁడు. ఎవ్వరామహాత్మునిఁ దెలిసికొనుచున్నారో వారికిఁ దెలియని దించుకయు నుండదు. ఇది నిశ్చయము. సనాతనుఁడు గుణాతీతుఁడు నైన యాపరమపురుషు నెఱింగినమోక్షవిదులకుఁ దెలియని దించుకయు లేదు. ఎవ్వరిచిత్త మఖండితరూపమున నాత్మయం దవస్థిత మగుచున్నదో, వారికిఁ దీర్థసేవవలనను, ఆశ్రమపరిగ్రహమువలనను బ్రయోజన మేమి? ఆత్మ యొకనదీస్వరూపము, సంయమములు దానికి పవిత్రసోపానములు, సత్యమే జలము శమదమాదిసంయుతమైన యానదియందు స్నానముచేసిననే పుణ్యకర్ముఁడైన పురుషుఁడు పవిత్రుఁ డగుచున్నాఁడు. ఇతరజలములను సేవించినంతమాత్రమున యంతరాత్మ యెప్పుడును పవిత్రము గాఁజాలదు. ఆత్మస్వరూపమైనసుఖమునందు నిరంతరము నిమగ్నులై యుండవలయును. ఇదియే పురుషునకుఁ బ్రధానకర్మ యని నిర్దేశింపఁబడినది. ఈయాత్మజ్ఞాన మొక్కటియే పురుషునకుఁ దెలిసికొనవలసిన దనియు, నది లభించినచో నొక్కమాటుగా సకలవాంఛలు విదూరితము లగు ననియు, సజ్జనులు చెప్పుచున్నారు. దేనియందు నేకత్వము, సమత్వము, సత్యత్వము, శీలత్వము, స్థితి, దండనిధానము, ఋజుత్వము, క్రోధనివృత్తియు లక్షితము లగుచున్నవో, యట్టిచిత్తము బ్రహ్మ... ... ఓ ద్విజవరులారా! మీని కటమున సంక్షేపముగా నబ్రహ్మస్వరూపమును వర్ణించియుంటినో,

పత్ను లందఱు నీవిధముగా నొండొరులఁ బిలుచుకొనుచుఁ గందమూ
లఫలాదుల సంగ్రహించుకొని భిక్షుకరూపియైన మహాదేవుని సమీ
పించి "భిక్షుకా! ఇదిగో భిక్షను గైకొమ్ము" అని పలికిరి. మహా
దేవుఁ డప్పుడు పరమాదరముతోఁ దనభిక్షాపాత్రను జాచి "ఓతపస్వి
నులారా! భిక్ష నొసఁగుఁడు, మీకు శుభమగుఁగాక" అని మంద
హాస మొనరించుచుండెను. ఇక్కడ మునిపత్నులు శంకరునకు భిక్ష
నొసఁగి కామాతురచిత్తలై "యోతాపసోత్తమా! నీ వవలంబించిన
యీవ్రతమునకు విధాన మెట్టిది? దిగంబరుఁడవైన నీసర్వాంగములును
వనమాలావిభూషితములై కనఁబడుచున్నవి. నీవు తాపసుఁడవైనను
నీయాకార మతిమనోహరమై యున్నది. నీ కేదేని యభిప్రాయ ము
న్నచో నారహస్యమును మాకడ వెల్లడింపుము." అని పలికిరి. వారి
పలుకులు విని శంకరుఁడు నవ్వుచు నిట్లనియెను. "ఇదియే నాయేక
రూపవ్రతము; కాని దీనిరహస్యము తెలుపరానిది. విశేషించి బహు
జను లున్నచోట నీవ్రతమున కర్థ మించుకయుఁ జెప్పఁజాలను. ఓసౌ
భాగ్యవతులారా! ఇది యెఱింగి మీరు వెడలిపోవుఁడు" శివుఁ డిట్లు
పలుకఁగా విని మునిపత్నులు, "ఓతాపసా! రమ్ము! మేమును నీవెంట
వచ్చెదము. ఏమన! మాకు నీవెంట వచ్చుట కత్యంత కౌతూహల
మగుచున్నది" అని చెప్పుచు వారు తమపాణిపల్లవములతో శంకరునిఁ
బట్టుకొనఁజొచ్చిరి. కామాతురలై యున్న యాకాంతలలోఁ గొంద
ఱాతనికంఠమును జుట్టికొనిరి. మఱికొందఱాతనికేశపాశము బట్టు
కొనిరి, ఇఁకఁ గొందఱాతనికటిభాగమును, గొందఱాతనిపాదద్వంద్వ
మును బట్టుకొనిరి. ఆశ్రమవాసులైన మును లందఱును దమపత్ను
లకుఁ గలిగిన యీచిత్తవికారమును జూచి యాగ్రహావేశులై "యీ
తాపసుని వధింపవలె" నని నిశ్చయించుకొని కఱ్ఱలతోడను, పాషాణ

ములతోడను శంకరుని భీషణమైన యూర్ధ్వలింగమును బడఁగొట్టిరి. లింగము పడినవెంటనే భగవానుఁడైన శంకరుఁ డంతర్హితుఁడై పోయెను. తరువాత నాయన పార్వతీదేవితోఁగూడ నవ్వుచుఁ గైలాసపర్వతమున కేఁగెను. ఇక్కడ దేవదేవుఁడైన శంకరునిలింగము చరాచరములపైఁ బడఁగానే భావితాత్ములైన ఋషులకు విషమవిక్షోభము సంభవించెను. ఈఘటన మంతయుఁ దలఁచుకొనుచు ఋషులు విశేషవ్యాకులచిత్తులై యుండిరి. వారిలో నందఱకంటెను బుద్ధిమంతుఁడైన యొకమునీశ్వరుఁ డప్పుడు తక్కినవారందఱను జూచి యిట్లు చెప్పెను. “ మనయాశ్రమమున కరుదెంచిన యాతాపసుని మన మెట్లు సంభావింపవలయునో తెలిసికొనఁజాలమైతిమి. అందుచేతనే యిట్టికష్టము సంభవించినది, ఇప్పుడు మనమందఱమును వెడలి బ్రహ్మకు శరణాపన్నులము గావలయును. ఆతఁడు దీనియభిప్రాయము నవశ్యముగా నెఱుంగఁగలఁడు. ”

ఇట్లుసంభాషించుకొని చింతచిత్తులైన వారందఱును బయలుదేఱి సురసేవితుఁడై యున్న బ్రహ్మసన్నిధానమున కేఁగిరి. అట్లేఁగి బ్రహ్మకుఁ బ్రణామము లాచరించి వారందఱును లజ్జావనతవదనులై బ్రహ్మకెదురుగా నిలువఁబడిరి. అప్పుడు బ్రహ్మ వారట్లు వివర్ణులై యుండుటఁ జూచి వారితో నిట్లనియెను—“ ఓహో ! మీరందఱు నత్యంతమూఢులై యున్నారు; అందుచే మీచిత్తములు క్రోధకలుషితములై యున్నవి. వాస్తవముగా మూఢబుద్ధులైనవా రెప్పుడును ధర్మమును గాని సత్క్రియామర్మమును గాని గ్రహింపఁజాలరు. ఓక్రూరకర్ములై. ఓతాపసులారా ! మీరు ధర్మతత్త్వము నాకర్ణింపుఁడు. విజ్ఞులైనవా [illegible] ధర్మ మాచరించి ఫలము నందుట కధికారులై యుండురు. ఏవిభుఁ డీదేహమునందు నాత్మయందు నధిష్ఠించియున్నాఁ

డో, ఆతఁడు మహాస్థాణుఁడు, ఆతని కాది లేదు, ఆతఁడు సర్వపరిణా రముల నిర్లిప్తరూపమున వ్యక్తుఁ డగుచున్నాఁడు. మఱి వస్తువులయం దుండి యుజ్జ్వలవర్ణములతో నెల్లపరికాశించుచున్నదో, అట్టియాత్మ యుమనస్సుతోఁగూడి తన్మయమై యున్నది. మనస్సుయొక్క భేదము ల నాశ్రయించియే సకలకర్మములును వర్ధిల్లుచున్నవి. కడువాని నా యాకర్మవశతచేతనే మనుష్యులు స్వర్గనరకకాదిభోగముల ననుభవిం చుచుండిరి. బుద్ధిమంతులైనవారు మొట్టమొదట శుద్ధిసాధనమైనయు పాయముచే మనస్సును బరిశుద్ధపఱుచుకొని జ్ఞాననిష్ఠులైయుందురు. ఆత్మయొక్క మాఱు ప్రబోధింపఁబడినచో నంతరాత్మ తాను నిరాకుల మై యుండును. సహజముగా మంత్రసిద్ధిగల్గియున్న పురుషున కింక దేహసంబంధమైన క్లేశముచే శుద్ధిఁబొందవలసిన యావశ్యకత లేదు. పాతకసమూహములనుండి తొలఁగియుండుటకే సత్క్రియ లన్నియుఁ గల్పింపఁబడినవి. అత్యంతకలుష దేహము సహజముగా శుద్ధినొందు టకు సమర్థము గాఁజాలదు. అందుచేతనే జనసమాజమునం దీసర్వధ ర్మప్రవర్తకమైన మార్గ మేర్పరుపఁబడినది. జరిగిపోవుచున్న వర్ణాశ్రమ విభాగములు జనాధ్యక్షుఁడైన యొకానొకనిచే నిరూపింపఁబడినవి. ఉత్తమభాగధేయులైన వారిని మోహముయొక్కమాహాత్మ్య మొక్క మాఱుగా నాక్రమింపఁజాలదు. అందుచే వారు మోహగ్రస్తులు గా రు; కాని మీరాశ్రమవాసులై యుండియుఁ గామక్రోధములచే నభి భూతులై యున్న ట్లగపడుచున్నారు. జ్ఞానులగృహములే యాశ్రమ ములు, అయోగులయాశ్రమములే గృహములు. సకలవాంఛలు నె క్కడ నుండునో, నారీమయభ్రాంతి యెచ్చట నుండునో యచ్చటనే యాభీషణక్రోధ ముండును. వాస్తవముగా నివి యన్నియు నాత్మజ్ఞా నమునకు విరోధములు. క్రోధమైనవానికిఁ బూజగాని, దానముగాని,

దానిని దెలిసికొనఁగలిగితిరేని మీరు నిశ్చయముగాఁ బరబ్రహ్మమును బొందఁగలరు; ఇప్పుడు బ్రహ్మయొక్క యుత్పత్తివార్తను వినుఁడు. నారాయణునివిషయమై యిట్టిశ్లోకము చెప్పఁబడియున్నది—జలములు నార, యని చెప్పఁబడుచున్నవి. కారణ మేమన? జలములు నరసంతతి. ఈజలములయందు శయనించుటచేత నారాయణనామము గలిగినది. ఆవిశుద్ధజలములయందు సమస్తజగము మునిఁగియున్న దని తెలిసి భగవానుఁ డాయండమును భేదించెను. దానియందు 'ఓం' అనశబ్దము సముత్పన్న మయ్యెను. "ఓంకారమునుండి భూః, భువః, స్వః" అనుశబ్దము లుత్పన్నములయ్యెను. వీనియేకత్రినామము "భూర్భువస్స్వః." దానినుండి సవితృనియుత్కృష్టతేజ ముద్భూత మయ్యెను. ఈయణుతేజము బయలుదేఱి సకలసలిలమును సంశోషణ మొందించెను. తేజమువలన శోషితము గాఁగా మిగిలినభాగము పిండాకారముగా నుండెను. ఆపిండమునుండి బుద్బుదము జన్మించెను. ఈబుద్బుదమునకుఁ గాఠిన్యము గలిగి దానినుండి భూమి ప్రాదుర్భవించెను. ఈధారుణియే భూతసంచయమునకు ధారిణి యయ్యెను. అండ మెచ్చటనుండెనో యచ్చటనే సరోవర ముండెను. ఆదియందే తేజను వినిర్గత మయ్యెనో యది యాదిత్యనామమునఁ బ్రసిద్ధమయ్యెను. లోకపితామహుఁడైన బ్రహ్మ, ఆయండమునుండి యుత్పన్నమయ్యెను. అతనిగర్భవేష్టనచర్మము మేరుపర్వతము, తక్కినపర్వతము లాతనిజరాయువులు, సాగరములును సహస్రసహస్రనదులును నాతనిగర్భోదకములు. బ్రహ్మనాభిస్థానమునుండి నిర్గతములైన పరమనిర్మలసలిలమువలననే మహాసరోవరముపరిపూర్ణత గాంచుట. ఆసరోమధ్యమునందే స్థాణురూపముగల వటవృక్షము విరాజమానమగుచుండెను. దానినుండియే బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులును జన్మమొందిరి, దానినుం

డియే ద్విజులకుశూద్రులకొఱకు శూద్రులు జన్మించిరి. ఆతరువాత నవ్యక్తజన్ముఁడైన బ్రహ్మసృష్టి వ్యాపారముకొఱకు మనస్సంయోగము చేయఁగా నాతనిమనస్సునుండి, మూర్తీభవించిన పరిశుద్ధతవోలె వాలఖిల్యఋషు లుత్పన్నమైరి. ఈమును లందఱును లెక్కకు, అష్టాశీతిసహస్రసంఖ్యాకులుగా నుండిరి. వీరందఱు నూర్ధ్వరేతస్కులు. తరువాత బ్రహ్మ మరల సృష్టినిమిత్తమై ధ్యానముసేయఁగా సప్తఋషులు జన్మించిరి. ఈఋషులందఱును బ్రజాపతులైరి. మరల బ్రహ్మదేవుఁడు రజోమోహితుఁడై సృష్టిచింతయందుఁ బ్రవేశింపఁగాఁ దపస్స్వాధ్యాయపరాయణులైన వాలఖిల్యు లుద్భవమైరి. వారందఱును నిత్యస్నాతులును దేవతార్చనానిరతులు నగుచు నుపవాసాది కఠోరవ్రతానుష్ఠానములచేఁ దమతమదేహముల శుష్కింపఁజేయఁజొచ్చిరి. మఱియు వారు కృశాంగులును నరములపోగులునై సహస్రదివ్యవర్షములపర్యంతము దేవదేవుఁడైన శంకరు నారాధన చేసిరి. కాని యందులకును శంకరుఁడు ప్రసన్నుఁడు గాలేదు. అనంతర మనంతకాలము గడచిపోయెను.

ఒకనాఁడు మహాదేవుఁడు ఉమాదేవితో నాకాశమార్గమునఁ బరిభ్రమణముచేయుచుండెను. అప్పుడు శాంకరీదేవి వారిని జూచి యతిశయదుఃఖితభావముతో జగత్ప్రభుఁడైన మహాదేవునిఁ బ్రసన్నునిఁ గన్గొని ప్రార్థించి యిట్లనెను. " దేవా! వనవాసులైన తపస్వు లత్యంతతీవ్రక్లేశము ననుభవించుచున్నారు. ఓదేవదేవా! నాయం దనుగ్రహించి వారిక్లేశమును నివారింపుము ఓదేవా! ఈఋషు లందఱు ధర్మపరాయణులు, అయి[illegible] కర్మ యత్నయమగుచున్నదేమి? వీరల్లు విశుద్ధదేహులై [illegible]శిష్టులైనను నేఁటివఱకు వీరికి సిద్ధి లభింపలేదేమి?" పతితోద్ధారకుఁడైన పినాకి

నిజమస్తకమునందలి చంద్రకిరణములచే నుద్భాసితుఁ డగుచు దేవివా క్యములు విని యీతెఱఁగునఁ బ్రత్యుత్తర మిట్లొసంగెను. "దేవీ! ధర్మ గతి యతిదుర్బోధమైనది, నీవు వారిప్రకృతితత్త్వమును బోధపఱచు కొనలేదు. ఈఋషు లందఱును ధర్మజ్ఞులు గారు, నేఁటివఱకు వీరు కామ నిర్జితులు గాలేదు. వీరికిఁ గ్రోధము గలదు. వీరిబుద్ధి నిరంతరము మోహావృతమై యున్నది" ఈపలుకు లాలించి దేవి మరల నిట్లని యెను. "దేవా! నీవు వీరికిఁ బ్రత్యక్షము గావలయును. ఏమన, నా కీవిషయమున నత్యంతమైన కుతూహల ముదయించుచున్నది." దేవ దేవుఁ డప్పుడు దేవిపలుకులకు మందహాసవదనుఁడై యిట్లనియెను. "దేవీ! నీ విచ్చటనే యుండుము; ఈఋషు లందఱును గఠోరతప స్సునిరతులై యున్నవారికి నే నేఁగెదను. తరువాత వీరికార్యక లాపములు జూచెదవుగాక" శంకరుని యీమాటలు విని శాంకరి సంతుష్టచిత్తయై యాయనకు ఋషులకడ కేఁగు మని చెప్పెను.

తరువాత వాలఖిల్యమునులు హోమాగ్నిని బ్రజ్వరిల్లఁజే యుచు నెచ్చోటఁ దపస్స్వాధ్యాయనిరతులై యున్నారో, యెచ్చోట వారు మంటిదిబ్బలవలె నెండుచితుకులను గుట్టలుగాఁ బోసికొనియు న్నారో, అచ్చటికి శంకరుఁ డేఁగెను. ఆతఁడు వారిని జూచి సర్వాంగ సుందరమైన రూపము ధరించుకొని దిగంబరుఁడై వనమాలాభిభూషి తుఁడై యువకదేహముతోఁ గపాలహస్తముతో మునులయాశ్రమ ముల సమీపమున భిక్షార్థమై తిరుగాడుచు "భిక్షాం దేహి" యనుచు మెల్లమెల్లఁగా నాశ్రమములలోఁ బ్రవేశించెను. ఆశ్రమవాసులైన యాబ్రహ్మవాదులభార్య లాతనిహృదయోన్మాదకరమైన రూపమును జూచి యందఱును ముగ్ధలై పోయిరి. తరువాత వారు "మన మాభి క్షుకునిఁ జూతము రం" డని యొండొరులఁ బిలుచుకొనఁజొచ్చిరి. ముని

తపోనుష్ఠానముగాని, నిత్యహోమముగాని, యీయన్నిటిలో నేదిగాని ఫలము నొసంగఁజాలదు; కోపనులైనవారికి సమస్తఫలములును వ్యర్థములైపోవును.

## —♦ బ్రహ్మాదికృతశివస్తోత్రము ♦—

సనత్కుమారుఁడు చెప్పుచున్నాఁడు—బ్రహ్మపలుకు లాలకించి ఋషులందఱును లోకమునకు శ్రేయస్సు గలిగించు మార్గమును జెప్పుమని మరలఁ బ్రశ్నించిరి. బ్రహ్మ యిట్లనియెను, లెండు, మఱి మందరమును శూలపాణియైన త్రిలోచనుని శరణొందుదము; ఆదేవదేవుని యనుగ్రహముచేతనే మరల మీరు యథాస్థితిని బొందఁగలరు. బ్రహ్మ యిట్లు చెప్పఁగానే ఋషు లందఱును కూడ బ్రహ్మతో సిద్ధులై కైలాసమున కేఁగిరి అచ్చట కేఁగి వారందఱును భగవానుఁడైన భవుఁడుమాదేవితో నాసీనుఁడై యుండుటఁ గాంచిరి అట్లు దర్శింపఁగానే లోకపితామహుఁడైన బ్రహ్మ సర్వజగత్పతియుఁ త్రిలోకవిభుఁడునైన శివునిస్తవ మొనరింపఁజొచ్చెను. "ఓదేవదేవా! నీవనంతుఁడవు, వరదుఁడవు, పినాకపాణివి, మహాదేవుఁడవు, పరమాత్ముఁడవు, నీకు నమస్కరించుచున్నాను. నీవు త్రిభువనేశ్వరుఁడవు, నీవు సర్వదా సకలసంత్రాణకర్తవు, నీకు నమస్కరించుచున్నా. దేవా! నీవే యేకసూత్రిజ్ఞానప్రదాతవు, నీవు పురుషోత్తముఁడవు, నీవు పద్మగర్భుఁడవు, నీవే సకలహృత్పద్మశాయివి, నీవు భీషణపాపరాశిని వినాశనము చేయువాఁడవు, నీక్రోధ మతిప్రచండమైనది. నీకు నమస్కరించుచున్నాను. ఓదేవా! విశ్వేశ్వరా! శూరనాయకా! నీకు నమస్కరించుచున్నాను. ఓశూలపాణీ! నీకు నమస్కారము. ఓవిశ్వభావనా! నీకు నేను నమస్కరించుచున్నాను."

ఋషిగణముతోఁ గూడి బ్రహ్మ యప్పు డిట్లు స్తవము నొనరింపఁగా మహాదేవుఁ డాయందఱను జూచి యిట్లనియెను—"మీరు వెడలి పొండు, మదీయలింగము మరలఁ బ్రాదుర్భావము నొందఁగలదు. మీరు సత్వరముగా నావాక్యమును బ్రతిపాలింపుఁడు. మదీయలింగ ప్రతిష్ఠ గావించినచో నేను మీయెడల నిస్సందేహముగా సంప్రీతుఁడను గాఁగలను. భక్తియుక్తులై యీనాలింగము నెవ్వరు పూజింతురో, వారి కెట్టికోరికలును దుర్లభములు గావు. లింగపూజవలన జ్ఞానకృత పాపము లన్నియు భస్మములు కాఁగలవు. లింగపూజ గావించినవారు విశుద్ధు లగుచున్నారు. ఈ విషయమున నింక నే యాలోచనయు నక్కఱలేదు. మీరు నిపతితము గావించిన నాలింగమును సన్నిహితియందుఁ బ్రతిష్ఠితము గావించి, మహాసరోవరము నుద్ధారము గావించి శీఘ్రమే విఖ్యాతి గాంచుఁడు. అప్పుడు మీకోరిక లన్నియు ఫలింపఁగలవు. దేవత లందఱును నాలింగమును స్థాణునామముతోఁ బూజింపఁగలరు. స్థాణ్వీశ్వరునిచే నీలింగము ప్రతిష్ఠింపఁబడుటచే, స్థాణ్వీశ్వరనామముతో నిది విఖ్యాతి గాంచును. సర్వదా స్థాణు నెవ్వరు స్మరించుచుందురో వారు సర్వపాపనిర్ముక్తు లగుచున్నారు. ఈలింగదర్శనముచే మానవులు విశుద్ధదేహులై మోక్షార్హు లగుచున్నారు"

మహాదేవుఁడు బ్రహ్మకును నాతనితో నున్నఋషులకును నిట్లు చెప్పుటచే వా రందఱును మరల దారువనమున కేఁగి యాలింగము నచ్చటనుండి తీవనెత్తుటకుఁ బ్రయత్నించిరి; కాని దేవతలు ఋషులు నేకముయ్యును నాలింగమును గదలఁజేయఁజాలరైరి. అప్పుడు వారందఱు నత్యంతపరిశ్రాంతులై బ్రహ్మను శరణుచొచ్చిరి. అట్లు మిక్కిలి యలసియున్న దేవతలను ఋషులను జూచి బ్రహ్మ యిట్లనియెను—

"మీ రీలింగము నణుమాత్రమైనను కదలించుటకు సమర్థులు గారు.

దేవదేవుఁడైన శూలపాణి తనయిష్టముచే దీని నిక్కడ విడిచియున్నాఁడు, కావున రండు మన మందఱముఁ గూడి యొక్కమాఱుగా నాతనినే శరణొందుదము. ఆమహాదేవుఁడు ప్రసన్నుఁడైనచో స్వయముగాఁ దానే యిచ్చటికి విచ్చేయఁగలఁడు."

బ్రహ్మ యిట్లు తెలుపఁగా దేవతలును, ఋషులును బ్రహ్మతోఁగూడి మహాదేవదర్శనలాలసులై కైలాసశైలమున కేఁగిరి. వా రట్లేఁగిరి గాని వారి కచ్చటఁ బరమేశ్వరునిదర్శనము లభింపలేదు; అప్పుడు వా రందఱును జింతాక్రాంతచిత్తులై బ్రహ్మను జూచి, దేవదేవుఁడైన మహేశ్వరుఁ డెక్కడ నున్నాఁ డని యడిగిరి. తరువాత వారందఱును జాలసేపు ధ్యానమగ్నులై యుండి మహేశ్వరుఁ డప్పుడు హస్తిరూపమున నున్నట్లు తమచిత్తములలోఁ బొడఁగాంచిరి. అప్పుడు బ్రహ్మతోఁగూడి దేవతలును ఋషులును బవిత్రమహాసరోవరమున కేఁగిరి. అక్కడ దేవదేవుఁడు స్వయముగా విరాజిల్లుచుండెను. కాని బ్రహ్మయు దేవతలును ఋషులును గూడ నచ్చట నలుదెసల వెదకియు నాతనిఁ గాంచలేకపోయిరి. అప్పుడు వా రందఱును జింతాకులులై పోయిరి.

అట్లుండఁగాఁ గొంతసేపటికిఁ గమండలువును జేతఁ బట్టుకొని ప్రీతియుతమైన పార్వతి వారికి దృష్టిగోచర యయ్యెను. ఆమెను దర్శించి దేవత లందఱు సంప్రీతచిత్తులై యిట్లు పలికిరి. "ఓతల్లీ! సమదర్శియు సర్వదాతయు నైన దేవదేవుఁడు మీ యెక్కడ కేఁగినచో మాకు దర్శన మొసంగును? ఓదేవీ! మీ మాయచేతను జాల వెదకికొనుచున్నాము."—దేవి కృపాన్వితయై యిట్లు పలికెను, "ఓమహాభాగులారా! ఇప్పు డిచ్చటనే మీరు మహేశ్వరునిఁ జూడఁగలరు. ఓదేవతలారా! మీ రమృతపానమును జేయుఁడు, అట్లయినచో శంకరుని దర్శింపఁగ

లరు."—భవాని చెప్పిన యీపలుకు లాలకించి దేవత లప్పుడు ను ఖాసీనులైరి, అప్పుడు వారు పవిత్రామృతమును పానముచేసిరి. తరువాత వారించుక విశ్రాంతులై పరమేశ్వరి నిట్లు ప్రశ్నించిరి, ‚‚దేవి! ఆమహాదేవుఁ డిక్కడకు వచ్చి హస్తిరూపముతో నెక్కడ నున్నాఁడు?" అప్పుడు దేవి మహాదేవుఁ డేసరోవరమునందు వసించియున్నాఁడో, ఆసరోవరమును వారి కెఱింగించెను. దానిని దర్శించి వారందఱు నత్యంతహర్షావేశపరవశులైరి. వారందఱు నప్పుడు పితామహుని ముందిడికొని యిట్లు విన్నపముచేయఁదొడఁగిరి. ‚‚ఓమహాదేవా! నీవు విడిచివచ్చిన త్రిలోకపూజ్యమైన యాలింగమును దెచ్చుట కెవ్వరును సమర్థులు గారైరి."—

బ్రహ్మాదిదేవత లిట్లు విన్నపముచేసికొనఁగానే, భగవానుఁడైన భవుఁడు దేవఋషిగణసమేతుఁడై యప్పుడు దారువనమున కేఁగెను. అక్కడ కేఁగి మహాదేవుఁడు హస్తిరూపము ధరించి యవలీలఁగా మహేశ్వరలింగమును తుండముతో నెత్తివేసెను. మహర్షు లప్పుడాతని స్తోత్రము గావించిరి. ఆకేఁ డప్పు డాలింగమును సరోవరపశ్చిమపార్శ్వమున సంస్థాపించెను. అందుచేత సమస్తదేవతలును, తపోధనులైన ఋషులును దాము కృతార్థులమైతి మని భావించుకొని మహేశ్వరు నిట్లు స్తవముగావింపఁజొచ్చిరి, ‚‚ఓపరమాత్మా! అనంతయోనీ! లోకసాక్షీ! ఓపరమేష్ఠీ, భగవానుఁడా! సర్వజ్ఞా! ఓక్షేత్రజ్ఞా, జ్ఞానజ్ఞేయా, సర్వేశ్వరా! ఓమహావిరించీ, మహావిభూతీ, మహాక్షేత్రజ్ఞా! ఓమహాపురుషా! సర్వభూతావాసా! ఆదిదేవా! ఓమహాదేవా! సదాశివా! ఈశానా! ఓదుర్విజ్ఞేయ, ఓదురారాధ్యా, మహాభూతేశ్వరా, త్ర్యంబకా! ఓమహాయోగీ! పరబ్రహ్మ! పరమజ్యోతీ! ఓబ్రహ్మజ్ఞశ్రేష్ఠా, ఓంకారరూపా! వషట్కారా, స్వాహాకారా! ఓస్వధాకా

రా ! పరమకారణా, సర్వగా ! ఓసర్వదర్శనా, సర్వదేవా, అజా ! ఓస హస్రార్చి, సుధామా, పరంధామా ! ఓవంశవర్త, సంవర్త, సంకర్షణా! ఓబడబానలా, అగ్ని షోమాత్మక, పవిత్రా ! ఓమహాపవిత్రా, మహామేషా, మహాకామహా ! ఓహంస, పరమహంస, మహారాజిక ! ఓమహేశ్వరా, మహాకాముక, మహాహంసా ! ఓభవక్షయకరా, సురసింధుసేవిత, హిరణ్యనాభా, హిరణ్యాగ్రకేశా ! ఓముంజకేశీ, సర్వలోకవరప్రదా, సర్వానుగ్రహకరా ! కమలేశయా, హృదయేశయా, జ్ఞానోదధీ ! ఓశంభూ, ఓవిభూ, మహాయజ్ఞా ! ఓమహాయాజ్ఞికా, సర్వయజ్ఞమయ, సర్వయజ్ఞసంస్తుత ! ఓనిరాశ్రయా, సముద్రేశా, అత్రిసంభూతా ! ఓభక్తానుకంపకా, అభగ్నయోగా, యోగధరా ! ఓవాసుకిమహాహావిద్యోదితవిగ్రహా, హరితనయన, త్రిలోచనా ! ఓజటాధరా, నీలకంఠ, చంద్రార్ధధరా ! ఉమాశరీరార్ధధరా, శూలధరా, పినాకధరా ! ఓఖడ్గచర్మధరా, గజచర్మధరా, దుస్తరసంసారమహాసంహారకరా ! ఓభక్తవత్సలా ! ప్రసన్నుఁడవు గమ్ము." అని బ్రహ్మప్రముఖులైన దేవతలు భక్తిభరులై శంకరుని స్తవమొనరింపఁగా మహాత్ముఁడైన మహాదేవుఁ డప్పుడాలింగమునందు సన్నిహితుఁడయ్యెను.

## స్థాణులింగమాహాత్మ్యము.

సనత్కుమారుఁ డిట్లు చెప్పందొడంగెను. తరువాత మహాదేవుఁడు ఋషులసమక్షమునఁ బితామహప్రముఖదేవగణముకడ నుత్తమలీర్థమాహాత్మ్యము నిట్లు వ్యక్తపఱచెను, "ఈసామీప్యమునందలి సరోవర మతిమాత్రపవిత్ర మని ప్రసిద్ధికెక్కియున్నది. దీనియందు నేను ప్రవేశించితిని; కేవలము నిది ముక్తిప్రద మైనది. ఇక్కడకు బ్రాహ్మణక్షత్రియవైశ్యు లెవ్వరైనను వచ్చి లింగదర్శనముచేసికొనినచోఁ ద

త్తుణము వారు పరమపదసాక్షాత్కారము నొందుటకు సమర్థులగుచున్నారు. దినకరుఁడు గగనమధ్యమునకు వచ్చునప్పటికిఁ బ్రతిదినము సరోవరసాగరప్రభృతితీర్థము లన్నియు స్థాణుతీర్థమునందు సమ్మిళితము లగుచుండును. పూర్వోక్తప్రకారముగా నెవ్వరు నన్ను సర్వదా స్తుత మొనరించుచుందురో వారికి నేను సకలకాలము సులభుఁడనై యుందును, సందేహములేదు.”

భగవానుఁడైన రుద్రుఁ డీవాక్యములు చెప్పి యంతర్హితుఁ డాయెను. దేవతలును ఋషులును దమతమ తావుల కేఁగిరి. తరువాత స్వర్గధామము నిరంతరమానవసమాగమముచేఁ బరిపూర్ణమైపోవుచుండెను. స్థాణులింగమాహాత్మ్యదర్శనముచే లోకు లందఱు నజస్రము స్వర్గధామమునకు గమనము చేయుచుండిరి. అప్పుడు దేవతలు మరల బ్రహ్మను శరణుచొచ్చిరి. అప్పుడు బ్రహ్మ వారితో “మీరిక్కడకు వచ్చినకారణ మేమి?” అని యడిగెను. అంతట దేవతలు “మేము మనుష్యులకు భయపడుచున్నాము, ఓపితామహా! మమ్ము రక్షింపుము” అని వేఁడుకొనిరి. పితామహుఁ డప్పుడు దేవతలకును, వారికిఁ బ్రభువైన యింద్రునకు నిట్లు చెప్పెను. “మీరందఱును గూడి పాంశువులచే నాసరోవరమును బూరణము గావింపుఁడు, అట్లయిన దేవాధిపతీ! నీకు హితసాధన మగును”

శాకశాసనుఁ డప్పు డాసరోవరముపైఁ బాంశువర్షమును గురియింపఁజొచ్చెను. ఇంద్రాదిదేవత లీవిధముగా నేఁడుదినములు పాంశువర్షమును గురియఁగా నప్పటికా సరోవరము నిండెను. దేవదేవుఁడైన మహేశ్వరుఁ డాపాంశువృష్టినిజూచి తనహస్తముతో నాలింగమును,దీర్ఘవటమును బట్టికొనియుండెను. అందుచేతనే యాతీర్థము పుణ్యతమ మయ్యెను. అప్పుడచ్చటఁ బాదపరిమితమాత్రమైనజలము ప్రతిష్ఠితమై

యుండెను. అందు స్నానముచేసిన సకలతీర్థములతోఁ జేసినట్లే యగును. ఎవ్వరావటలింగమునందు శ్రద్ధగలవారై శ్రాద్ధమును జేయుచున్నారో, వారిపితృపురుషులు వారియెడలఁ బ్రీతులై వారికి జగత్తులోని దుర్లభవస్తువుల నిచ్చుచుందురు. అనంతరము ఋషులందఱు నాసరోవరము దేవతలచే విడువఁబడిన పాంశువులమూలమున నిండిన దగుటఁ జూచి శ్రద్ధాభక్తులతో నాపాంశువులను దమతమదేహములకు తాచికొనఁజొచ్చిరి. ఆఋషు లందఱు నప్పుడు పాంశుస్పర్శచేఁ బాపవిముక్తులైరి. వా రందఱును దేవతలచేఁ బూజ్యమానులై బ్రహ్మపదము నొందిరి. మహాత్ములైన సిద్ధపురుషు లందఱును, ఆలింగపూజఁ గావించుచుఁ బూజాఫలముచేఁ బునరావృత్తిరహితమైన పరమపదము నొందఁగల్గిరి. బ్రహ్మ యప్పు డెపధముగా నాశైలమయలింగతత్వమును విదితముచేసి, తరువాత నాద్యలింగస్థాపనము గావించెను. తరువాత బ్రహ్మతేజముతో లింగము తేజోవంత మగుచుండెను. ఆలింగమును స్పృశించుటచేతనే సిద్ధులు పరమపదప్రాప్తి కర్హులగుచుండిరి.

ఓద్విజవరులారా! ఈసమయమున దేవతలు బ్రహ్మసమీపమున కేఁగి, దేవా! లోకు లందఱును లింగదర్శనమాత్రముననే పరమపదప్రాప్తు లగుచున్నారు, అని విన్నవించుకొనిరి. అప్పుడు భగవానుఁడైన బ్రహ్మ దేవహితార్థము పైఁగా నేఁకులింగములను బ్రతిష్ఠించెను. తరువాత సిద్ధాశ్రమవాసులైన ముముక్షులు భక్తిశ్రద్ధలతో నచ్చటిపాంశువులను సేవించి పరమపదము నొందఁజొచ్చిరి. క్రమముగా నీపాంశురాశి వాయుచాలితమై కురుక్షేత్రమునం దక్కడక్కడ నిక్షిప్తమయ్యెను. తత్సంస్పర్శచే దుష్కర్ములైన పురుషులును బరమపదమున లీనము గాఁ జొచ్చిరి. స్త్రీలుగాని, పురుషులుగాని యెవ్వరుగాని స్థాణుతీర్థప్రభావముచే జ్ఞానాజ్ఞానకృతసమస్తపాతకములనుం

డియు విముక్తులు గాఁజొచ్చిరి. లింగమును దర్శించినమాత్రమున నెట్టి ముక్తి గలుగుచున్నదో, వటవృక్షసంస్పర్శనముచేతఁగూడ నట్టి ముక్తియే లభించుచున్నది. ఆవటవృక్షసన్నిహితములైన జలముల యందు స్నానముచేసినవారికిఁగూడ నభీష్టఫలసిద్ధి గలుగుచున్నది. ఎవ్వరీజలములయందుఁ బితృతర్పణములు గావించుచున్నారో, వారి కాజలబిందుపరిమాణముగా ననంతఫలములు లభించుచున్నవి. స్థాణు లింగమునకుఁ బశ్చిమదిక్కుగా నెవ్వరు కృష్ణతిలలతోఁ బితృశ్రాద్ధమును, శ్రద్ధతోఁ దర్పణములు గావించుచున్నారో వారికిఁ బితృలోకములు మూఁడుయుగములపర్యంతము తృప్తి బొందఁగలవు. మన్వంతరము లుండునంతకాలము, నీలింగ మిచ్చట నుండునంతకాలము పితృపురుషులు ప్రీతులై యాతర్పణజలములఁ బానముసేయుచుందు రనియుఁ జెప్పఁబడియున్నది. సత్యయుగమునందును, త్రేతాయుగమునందును, సన్నిహితియందలి కూపము వాయుసంజ్ఞతోడను, ద్వాపరయుగకలియుగములమధ్యకాలమునందు రుద్రహ్రద మనుపేరితోడను బ్రసిద్ధమగును. చైత్రమాసమునందలి కృష్ణచతుర్దశీదినమున నేమానవశ్రేష్ఠుఁడు రుద్రకరతీర్థమున స్నానముచేయునో, అతఁడు పరమపదప్రాప్తి కర్హుఁడగుచున్నాడు. వటవృక్షమూలమునందుండి రాత్రికాలమున నెవ్వరు పరమేశ్వరిధ్యాన మొనరించుచున్నారో వారిమనోభీష్టము స్థాణువటమాహాత్మ్యముచే సిద్ధించుచున్నది.

## —♦ నానావిధశివలింగస్థానమాహాత్మ్యము ♦—

సనత్కుమారుఁడు చెప్పుచున్నాఁడు—“ ఓదివ్యజేంద్రులారా ! స్థాణువటమున నుత్తరదిశయందు శుక్లతీర్థమను తీర్థము గలదు, తూర్పు దెసయందు వ్యోమతీర్థము గలదు. దక్షిణదిశయందు దక్షతీర్థము

గలదు, పశ్చిమమునందు నకులగణతీర్థమున్నది. ఈపుణ్యతీర్థము లన్నిటిలోను స్థాణుదేవుఁడు విరాజమానుఁ డగుచున్నాఁడు. ఈస్థాణుదేవుని దర్శించినమానవులు పరమపదప్రాప్తు లగుచున్నారు. అష్టమీచతుర్దశీతిథులయందు మానవు లీసకలతీర్థములయందు సంచరింపవలయును. ఉమాదేవి లింగరూపమున శివపార్శ్వమునం దెల్లప్పుడు విరాజిల్లుచుండును. ఆమెదర్శనముచేతను మానవులు సకలాభీష్టసిద్ధులు గాంచుటకు సమర్థులగుచున్నారు. వటవృక్షమున కుత్తరమున మహాత్ముఁడైన తక్షుఁడు సర్వకామప్రదమైన యొకమహాలింగమును బ్రతిష్ఠించియున్నాఁడు. దానిపూర్వదిశయందు విశ్వకర్మనిర్మితమును బశ్చిమాభిముఖమునైన మహాలింగమును దర్శించినమానవులు సిద్ధినొందుచున్నారు. అక్కడ సరస్వతి లింగరూపమున విరాజిల్లుచున్నది. మానవు లామెను శ్రద్ధాభక్తులతో నమస్కరించినచో బుద్ధియు మేధయు లభించుచున్నది. వటవృక్షపార్శ్వమునం దొకలింగము గలదు. బ్రహ్మ దానిని స్వయముగాఁ బ్రతిష్ఠించెను. ఆవటేశ్వరస్వామిని దర్శించినచోఁ బరమపదప్రాప్తి గలుగుచున్నది. ఆతరువాత స్థాణువటమును దర్శించి ప్రదక్షిణముగావించినచో సప్తద్వీపవతియైన వసుమతికిఁ బ్రదక్షిణమాచరించిన ట్లగును. స్థాణువునకుఁ బశ్చిమదిశయందు నకులీశగణము విరాజమాన మగుచుండెను. వారిని భక్తిశ్రద్ధలతో నర్చించినచో సకలపాపనిర్ముక్తు లగుదురు. దానికి దక్షిణమున రుద్రాకర మనుపేర నొకతీర్థము గలదు. మానవు లాతీర్థమునందు స్నానముచేసినచో సకలతీర్థములయందును స్నానముచేసినట్లే యగును. దాని కుత్తరదిక్కున మహాత్ముఁడైన రావణునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన గోకర్ణమను మహాలింగము గలదు. ఆషాఢమాస కృష్ణపక్షచతుర్దశినాఁ డచ్చట స్నానముచేసి యుపవాస ముండినచో సర్వపాపములనుండి ముక్తులగుచున్నారు. అచ్చ

టనే మునిపుంగవులకు సిద్ధిప్రదమైన లింగము గలదు. రావణపుత్రుఁడైన మేఘనాథుఁ డాలింగమును బ్రతిష్ఠించెను. భక్తిపూర్వకముగా నాలింగము నర్చించినచో మహత్తరమైన శ్రీ లభించుచున్నది. దానికిఁ బశ్చిమముగా నున్నలింగము కుంభకర్ణునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. జ్యేష్ఠమాసమున శుక్లపక్షమున నష్టమీతిథియం దెవ్వరు శ్రద్ధాయుక్తులై ప్రయత్నపూర్వకముగా నుపవాసముచేసి యచ్చట నుందురో వారిపుణ్యఫలమును జెప్పెదను వినుము. వారికి ననేకపర్యాయములు యజ్ఞముచేసినఫలము లభించుచున్నది. సందేహములేదు. మునులు, సాధ్యులు, ఆదిత్యులు, వసువులు, వహ్నులు, మరుద్గణము, నీతీర్థమును సకలప్రయత్నములతో సేవించియున్నారు. వీరుగాక యేయితరప్రాణిసమూహమైనను స్థాణుతీర్థమునందుఁ బ్రవేశించినచో సకలపాపసమూహములనుండి విడివడి పరమపదమును గాంచును.

దేవదేవుఁడైన శూలపాణి యెచ్చట నేకలింగాకారముతో వెలసియుండునో, ఉమాదేవి యచ్చట నాలింగసన్నిధానమును విడిచియుండదు. ఆమెయు లింగరూపమున సర్వదా హరునిపార్శ్వమున విరాజిల్లుచుండును. గోకర్ణలింగము నెవ్వరు దర్శింతురో వారును బుణ్యఫలప్రాప్తు లగుచున్నారు. తెలిసికాని తెలియకకాని చేసినపాపములనుండి విముక్తు లగుటకుఁ గోరి శుచులై దేవదేవుఁడైన హరునిఁ బూజించినచో వారును బాపవిముక్తు లగుచున్నారు. కౌమారబ్రహ్మచర్యవ్రతముల నవలంబించిన నరు లెట్టిపుణ్యసంచయములఁ బొందుచున్నారో, అట్టిపుణ్యసంపాదనము నాయష్టమీదినమున శివార్చన మొనరించిన వారికి లభించుచున్నది. అనుపమరూపమును, సౌభాగ్యమును, ధనసంపదను, బొందుట కిచ్ఛగలవారు కుమారేశ్వరుని మాహాత్మ్యబలముచేఁ దమయిచ్ఛాపరిపూర్తి నొందఁగలరు, అందులకు సందేహము

ములేదు. దాని యుత్తరదిశను విభీషణుఁ డొకలింగమును బ్రతిష్ఠ గావించెను. తత్ఫలముచే నాతఁ డజరుఁడు నమరుఁడు నయ్యెను. ఆషాఢమాస శుక్లపక్షాష్టమినాఁ డుపవాసముండి యాలింగము నర్చించిన వారి కమృతత్వము సిద్ధించుచున్నది. పూర్వేరిత మనుపేరితోఁ బూర్వమచ్చట నొకలింగ మున్నది. ప్రయత్నపూర్వకముగా దాని నర్చించినవారికి సకలాభీష్టములు నెఱవేఱుచున్నవి. ఈస్థానమునందు దూషణుఁడు, త్రిశిరుఁడు నను నిద్దఱు నిశాచరులు భక్తితో నామహేశ్వరు నర్చించి సంతుష్టచిత్తులై యిష్టసిద్ధులఁ బడసిరి. చైత్రమాస శుక్లపక్షమునం దక్కడఁ బూజసేయువారికి వరము లిచ్చుటకు దేవదేవి సంసిద్ధమై యుండును. వా రక్కడ నభీష్టఫలముల నొందవచ్చును.

స్థాణువటమునకుఁ బూర్వదిశయందు హస్తిపాదేశ్వరుఁ డనుపేరితో మహాదేవుఁడు వెలసి యున్నాఁడు. ఆయనను దర్శించినవారు జన్మాంతరపాపములనుండి యవ్యాహతి నొందుచున్నారు. అక్కడకు దక్షిణదిశగా మహర్షియైన హారీతునిచేఁ బ్రతిష్ఠితమైన యొకలింగము గలదు. యత్నముతో దానిని బూజించినచోఁ బ్రపంచమునందలి సకలసిద్ధులుఁ గరగతములు గాఁగలవు. దానికి దక్షిణముగా నామహాపురుషుని తటాక మున్నది. దానిలో నొకపరమమంగళమయ మైన శివలింగము విరాజిల్లుచున్నది. కంకాళరూపియైన పరమాత్మ స్వయముగా భుక్తిముక్తిప్రదాయకమును బాపహారము నైన యాలింగమును బ్రతిష్ఠించెను. దానిని దర్శించినచో నగ్నిష్టోమయజ్ఞము గావించిన ఫలము లభించుచున్నది. దానికిఁ బశ్చిమమున సిద్ధలింగము ప్రతిష్ఠింపఁబడినది. సర్వసిద్ధిదాత యగుటచే నాతనికి సిద్ధేశ్వరుఁడని పేరు గలిగెను. దీనికి దక్షిణదిశను మహాత్ముఁడైన మృకండునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన యొకలింగము గలదు. దానిని దర్శించినంతమాత్రముచే

తనే యభీష్టసిద్ధి కలుగుచున్నది. దానికిఁ బూర్వదిశయందు మహాత్ముఁడైన యాదిత్యునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీస్థలింగమును దర్శించినచో సకలకిల్బిషములు వినాశములుగాఁగలవు. గంధర్వుఁడైనచిత్రాంగదుఁడును, అప్సరశ్శ్రేష్ఠమైన రంభయు నొండొరులపై నన్యోన్యానురాగములు గలవారై స్థాణుదర్శనమును గావించుకొనిరి. వారికోరికలప్పుడు సఫలము లయ్యెను. వారప్పుడు భక్తిభావముతోఁ బూజించి దేవదేవునిఁ బ్రతిష్ఠగావించి యప్పుడు తమనెలవులకు వెడలిపోయిరి. చిత్రాంగదేశ్వరుఁడు రంభేశ్వరుఁడు నను నీరెండులింగములను దర్శించినవరులు ప్రియదర్శనులై గొప్పకులమునందు జన్మించెదరు. దానికి దక్షిణముగా నిందునిచేఁ బ్రతిష్ఠితమైన శివలింగమును సందర్శించినవారికిఁ దత్ప్రసాదముచే సంకల్పఫలప్రాప్తి గలుగుచున్నది. మహర్షియైన పరాశరుఁ డక్కడ మహేశ్వరు నుపాసించి దర్శించుటచేతఁ గవిత్వలాభమును బొందెను. మహర్షియైన వేదవ్యాసులుగూడ నిచ్చటఁ బరమేశ్వరు నుపాసించి యాతనిప్రసాదముచే సర్వజ్ఞత్వమును బ్రహ్మత్వమును సంపాదించెను.

స్థాణునకుఁ బశ్చిమదిశయందుఁ బుష్కరప్రతిష్ఠితమైన హిమాలయేశ్వరలింగమును దర్శించినవారికి సిద్ధిలాభము సునిశ్చితము. దానికిఁ బశ్చిమముగాఁ బాపహరమైన దొకలింగము గలదు. అది కార్తవీర్యునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. తద్దర్శనముచే సద్యఃపుణ్యసిద్ధి కలుగును. దాని కుత్తరదిశయందు సుపార్శ్వునిచే స్థాపింపఁబడిన యొకలింగము గలదు. హనుమంతుఁడు దాని నారాధించి తత్ప్రసాదముచే సిద్ధిఁ గాంచెను. దానికిఁ బూర్వదిశయందుఁ బ్రభవిష్ణుఁడైన విష్ణుఁడు చక్రములో సుదర్శనలింగము నారాధించుచున్నాఁడు. దానికిఁ బూర్వభాగమున నింద్రవరుణు లిర్వురును సర్వాభీష్టదాయకములగు రెండులింగ

ములను బ్రతిష్ఠించిరి. మునులు, సాధ్యులు, ఆదిత్యులు, వసువులును సర్వపాపహరములైన యూసకలలింగములను బ్రియత్నముతోఁ బూజించుచుందురు. ఇవిగాక తత్వదర్శులైన ఋషులు మఱికొన్నిలింగములను బ్రతిష్ఠించిరి. అవి యసంఖ్యేయములు. వీని కుత్తరమునను, స్థాణునకుఁ బశ్చిమమునను, ఓఘవతీనదీపర్యంతము నొకసహస్రలింగములు పరినిష్ఠింపఁబడియున్నవి. వీని కుత్తరముగా, మహాత్ములైన వాలఖిల్యఋషులచేఁ బ్రతిష్ఠితమైన రుద్రకోటి యనుతీర్థమొంమగలదు. ఆతీర్థము బ్రహ్మసరోవరమునకు సమీపమున నున్నది. దానికి దక్షిణమున గంధర్వయక్షకిన్నరప్రతిష్ఠితములైన బహులింగములు గలవు, కాని వానిని లెక్కించుట యసాధ్యము. సర్వసమేతములు నాగ్గములు నగు మూఁడుకోట్లలింగములు గల వని వాయువు చెప్పియున్నాఁడు. ఇవిగాక యెన్నియో లింగములు గలవు. వానిని లెక్కించుట యశక్యము. ఈలింగములు రుద్రస్థాణము నాశ్రయించుకొని యున్నవి. ఇది యంతయు నెఱింగి శ్రద్ధతో స్థాణులింగమును సేవింపవలయును. తత్ప్రసాదముచేతనే మనోవాంఛితములు పూర్ణములు గాఁగలవు. కోరిక గలిగినయెనను సరియే కోరిక లేకయైననుసరియే, స్థాణుమందిరమునఁ బ్రవేశించినవారు నిష్పాపులై పరమపదము నొందఁగలుగుచున్నారు. చైత్రమాసమునఁ ద్రయోదశీతిథియందు దివ్యనక్షత్రయోగమున శుక్ర, సూర్య, చంద్రగ్రహముల సంక్రమణముచేఁ బరమపుణ్యమైన దినమున జగద్విఖ్యాతమైన బ్రహ్మ యీస్థాణులింగమును బ్రతిష్ఠించెను. నాఁట నుండియు దేవతలును ఋషులును నాస్థాణులింగము నర్చించుచుండిరి. ఉక్తకాలమున నిరాహారులై శ్రద్ధావంతులై యెవ్వరు మహాదేవు నర్చించుచున్నారో, వారికిఁ బరమపదప్రాప్తి యగుచున్నది. మహాదేవుఁ డక్కడ నధిష్ఠించియున్నాఁ డని యెఱింగి యెవ్వరు ప్రదక్షిణము

చేయుచున్నారో, వారు సప్తద్వీపవతీసమగ్రమైన పృథివికిఁ బ్రదక్షిణ ముచేసినవా రగుచున్నారు.

—♦వేణచరితమును, వేణకృతశివస్తవమును♦—

అనంతరము మార్కండేయుఁ డిట్లుచెప్పంగడంగెను-"ఓమునీ! నేను స్థాణుతీర్థమాహాత్మ్యమును వినఁగోరుచున్నాను. ఇచ్చట సిద్ధులైనవారిని గూర్చి నాకెఱిఁగింపుము" సనత్కుమారుఁడు చెప్పుచున్నాఁడు-"ఉత్తమమైన స్థాణుమాహాత్మ్యము నాకర్ణింపుము. దీని నాకర్ణించినమానవులు సకలపాపనిర్ముక్తులై వెలయఁగలరు. పూర్వకాలమున జగత్తంతయు నేకార్ణవీకృతమై చరాచరవస్తుజాల మంతయు వినష్టమయ్యెను. అప్పుడు విష్ణునాభికమలమునుండి సర్వలోకపితామహుఁడైన బ్రహ్మ యుద్భవించెను. బ్రహ్మపుత్రుఁడు మరీచి, మరీచిపుత్రుఁడు కశ్యపుఁడు, కశ్యపతనయుఁడు భాస్వంతుఁడు, భాస్వంతునకు మనువు పుట్టెను. మనువు తుమ్ముచుండఁగా నాతనిముఖమునుండి యొకపుత్త్రుఁ డావిర్భవించెను. ఆపుత్రుఁడు చతుస్సాగరపరివృతమైన భూమికి రాజై, ధర్మరక్షకుఁడయ్యెను. ఆతనిపత్ని పేరు సర్వభయాపహమైన భయాదేవి. ఆమె మృత్యురూపిణియైన కాలునివలన నుత్పన్న యయ్యెను. ఆమెగర్భమునుండి వేదనిందకుఁడును, దురాత్ముఁడు నైన వేణుఁ డుద్భవించెను. ఆతనితండ్రియైన క్షుతుఁడు పుత్రునిమోముఁ జూచి వనమునకు వెడలిపోయెను. అడవుల కేఁగి యాతఁ డత్యంతకఠోరతపస్సుచేతను, ధర్మానుష్ఠానముచేతను స్వర్గమును, మర్త్యభూమిని నావరించుకొని పునరావృత్తిరహితమైన పరమపదము నొందెను. అప్పుడు వేనుఁడు సమస్తభూవలయమునకు నాధిపత్యము నొందెను. కాలకన్యాగర్భమునఁ బుట్టిన వేణరాజు మాతామహదోషముచే దుర్వృత్తుఁడును, వేదవినిందకుఁడునై తన రాజ్యములో నంతట నిట్లని చాటింపించెను— "దానము

యజనము, హోమము, మొదలగునవి యెవ్వరును జేయవలసిన యావశ్యకత లేదు. అందఱును న న్నొక్కఁడనుమాత్రమే యభివాదనముచేయుచుఁ బూజింపఁదగును. మీ రందఱు నావలనఁ బ్రతిపాలితులగుచుఁ బరమసుఖ మనుభవింపుఁడు. జగత్తులో నాకంటె నితరదైవము లెవ్వరును లేరు. అత్యనురాగభావముతో మీ రిఁక నెవ్వరి నాశ్రయింపవలెను ?"

ఇట్లువేనరాజు సాటింపించఁగా విని యప్పటఋషు లందఱు నేకమై రాజునొద్దకు వచ్చి యిట్లుపదేశించిరి—రాజా, వేదమే ధర్మములకుఁ బ్రమాణము. దానిచే యజ్ఞము ప్రతిష్ఠిత మయ్యెను. యజ్ఞము లేఁకాక మఱి దేనివలనను స్వర్గవాసులైన అమరులు పరితృప్తులు గారు. వారు సంతృప్తులు గానిచో సస్యవృద్ధికిఁ జాలినవర్షములు లభింపవు. కేవలము యజ్ఞములును, యజ్ఞభాగభోగులగుదేవతలునే చరాచరవిశ్వమును ధరించుచున్నారు. "ఋషు లిట్లు పలుకఁగా విని వేనరాజు క్రోధారుణితనేత్రుఁడై యిట్లు నొక్కి చెప్పెను. "యజ్ఞమును దానమును జేయవలసినయావశ్యక మేమియును లేదు" అని—ఈ మాటలు చెప్పుచుండఁగనే యాతని కత్యంతక్రోధావేశము గలిగెను. అప్పుడు ఋషులును క్రోధోద్దీపితులైరి, ఋషు లంఱునేకమై మంత్రపూతములు, బ్రహ్మసన్నిభములు నైనదర్భలచే నాతని నప్పుడు నిహతుని గావించిరి. రాజ్య మప్పు డరాజకమయ్యెను; సర్వము నంధకారాచ్ఛన్న మైపోయెను. దస్యులు నిరాతంకముగాఁ బ్రజాపీడనమున కారంభించిరి. దస్యుపీడితులైన ప్రజలందఱు నప్పుడు ఋషులను శరణుచొచ్చిరి. ఋషు లప్పుడు వేనరాజువామకరమును మంథన మొనరింపఁ జొచ్చిరి. అట్లు మథింపఁబడిన వేనునిమొడమచేతినుండి పొట్టివాఁ డగు నొకపురుషుఁ డుత్పన్నమయ్యెను. ఋషు లాతనికి నిషీదుఁడని పేరుఁ

చిరి. దానినుండియే వేణకలువజాతమైన నిషాదజాతి యుత్పన్నమ య్యెను. ఆపిమ్మట ఋషులు వేనునికుడిచేతిని మథనముగావింపఁజొ చ్చిరి. ఆకరము మంథన మొనరించుచుండఁగా దానినుండి మఱియొక పురుషుఁ డుద్భవించెను. ఆపురుషుఁడు సకలదివ్యలక్షణలక్షితుఁడు. ఆతఁ డొకపెద్ద పర్వతమంత యాకృతి గలిగియుండెను. ఆతనిహస్తము లు ధనుర్బాణ, చక్ర, ధ్వజచిహ్నములు కలిగియుండెను. ఇట్లు పుట్టి నపురుషునిఁ జూచి యింద్రాదిదేవత లాతనికే పృథ్వీరాజ్యాభిషేకము గావించిరి. ఆతఁడు రాజ్యభారమును వహించి భూజను లందఱకు మ హారంజకముగా రాజ్యమేలుచుండెను. పూర్వమున నాతనితండ్రి శా సనమునకు విరక్తులై యున్న భూప్రజ లందఱు నిప్పు డాతనిచేఁ బరిపాలి తు లగుచు నాతనియం దనురక్తులై యుండిరి. ప్రజారంజన మొనరిం చుచున్న హేతువుచే నాతఁడు రాజను పేరికెంతయుఁ దగియుండెను.

వేణనందనుఁ డిట్లు రాజ్యముచేయుచుండఁగా, నాతని కొకచిం తగలిగెను. "ధర్మద్వేషి యైననాతండ్రి యజ్ఞాదికార్యములకు విద్వేషి గా నుండెడివాఁడు. ఇప్పుడు నేనాతనికిఁ బారలౌకికసుఖములను గల్గిం చుకార్యము లేవిధముగానొనరింపవలయును ?" అని యాతఁ డాలోచిం చుకొనుచుండఁగా నప్పుడు దేవర్షియైన నారదుఁ డక్కడ కరుదెంచెను. ఆతని కర్ఘ్యపాద్యము లొసంగి పీఠము వెట్టి సాష్టాంగదండములు గా వించి పూజించి, రా జాతని నిట్లు ప్రశ్నించెను. "భగవానుఁడా ! నీవు సర్వలోకశుభాశుభంబు లెఱుంగుదువు. నాతండ్రి దురాచారుఁడును దే వబ్రాహ్మణవిద్వేషియు నయ్యెను. ఆతఁడు స్వధర్మత్యాగియై పరలో కమున కేఁగెను, ఆతనికి సుఖము గల్గించుసత్కర్మలు నే నేమి చేయవ లయు ?" రా జిట్లడుగఁగా నారదుఁడు దివ్యదృష్టిచేఁ బరలోకగతుఁ డైన వేణునివృత్తాంతముఁ దెలిసికొని యిట్లు తెలియఁబఱిచెను. "నీ

తండ్రి మ్లేచ్ఛకులములోఁ బుట్టియున్నాఁడు, ఇప్పు డాతనిసర్వాంగము లును క్షయకుష్ఠరోగములచే నిండియున్నవి."

నారదుఁ డిట్లుచెప్పఁగానే రాజు దుఃఖార్త్తహృదయుఁడై యిట్లని చింతింపఁజొచ్చెను—ఇప్పుడు నే నేమి చేయవలయును? పితృపురుషులను భవమునుండి పరిత్రాణన మొనరించినవాఁడే నిజముగాఁ బుత్త్రనామమునకు కర్హుఁడుగదా." అని చింతించి యారాజు తనశాయశక్తిని పితృఋణమును దీర్చుకొనుటకు దృఢసంకల్పుఁడై మరల నారదమహామునిని ప్రశ్నించెను. నారదుఁ డప్పు డిట్లుత్తర మిచ్చెను—"రాజా! నీవు తీర్థయాత్రలు సేవించి దేహమును బవిత్రముగావింపవలయును. సరోవరసన్నిధానమునం దున్న మహాతీర్థములో స్నానముచేసిన శుద్ధి లభించుట నిశ్చయము."

మహాత్ముఁడైన నారదముని యీయుపదేశమును రాజు శ్రద్ధతో నాలకించి యించుకసే పాలోచించి తరువాత వెంటనే యామ్లేచ్ఛదేశమునకుఁ బ్రయాణమై వెడలెను. ఆతఁడు ముత్రదేశమున కేఁగి, తన తండ్రి యచ్చట [illegible] క్షయరోగముచేతను, కుష్ఠరోగముచేతను నాక్రాంతుఁడై యుండుటఁ జూచెను. తండ్రిని దర్శింపఁగానే పుత్త్రునిచిత్తము మహాశోకసంతప్త మాయెను. ఆతఁ డప్పు డామ్లేచ్ఛులను జూచి యిట్లనియెను— "మ్లేచ్ఛులారా! నేను నమస్కారము చేయుచున్నాను. ఇప్పు డీపురుషుని నాగృహమునకుఁ గొంపోయెదను. ఇందులకు మీరు సమ్మతించితిరో నే నీయనను దీసికొనివెళ్ళి రోగనివారణము గావించెదను." దయాశీలుఁడైన రాజు ప్రసంగమునకు మ్లేచ్ఛులు సమ్మతించి యాతనికి సాష్టాంగనమస్కారములు గావించి "ప్రభో! నీయిష్ట మెట్లో అట్లే చేయుము" మని చెప్పిరి. తరువాత వేణనందనుఁడు కొందఱు శిబికావాహకులను బిలిపించి "మీరు త్వరిం

వుమంది కలిసి యీవ్యాధిగ్రస్తుని బల్లకియందుంచి యనాయాసము గాఁ దీసికొనిరండు" అని యాజ్ఞాపించెను. దయాళుఁడైన రాజునాజ్ఞ శిరసావహించి వాహకు లప్పు డాతని శిబికలో నెక్కించుకొని సత్వర ముగాఁ గురుక్షేత్రమున కేఁగిరి. అచ్చటి కేఁగి వా రాశిబికను స్థాణు తీర్థతీరమున దింపిరి. ఆతరువాత మాధ్యాహ్నకాలము కాఁగానే రా జారోగిని స్నానముచేయించుట కుద్యుక్తుఁ డయ్యెను. ఆసమయము నందు వాయుదేవుఁ డంతరిక్షమునందుండి రాజును నిషేధించుచు నిట్లు పలికెను—"వత్సా! అట్టి సాహసికకార్యమునకుఁ గడంగకుము. సర్వవిధములచేతను దీర్థపవిత్రతను గాపాడుము. వీఁడు భీషణపాపము లచే జడితుఁడై యున్నాఁడు. వేదనింద మహాపాపము. ఆపాపము నుండి నిష్కృతిఁ గాంచుట యసంభవము. మహాపాపి యైన యీదుర్గతపురుషుఁడు స్నానముచేసినంతమాత్రముచే ముహూర్తకాలము గానే తప్పక యీమహాతీర్థ మపవిత్రమై పోఁగలదు." రాజప్పుడు వాయుదేవునిపలుకులు విని యత్యంతదుఃఖితుఁడై దుఃఖించి దుఃఖించి— "ఓదేవతలారా! ఈయన కెట్టిప్రాయశ్చిత్తము గావలయునో నిర్దేశింపుఁడు. నే నట్లొనరించెదను." అని ప్రార్థించెను. అప్పుడు దేవతలు "నీవు ప్రతితీర్థమునందును స్నానముచేయుచు నీస్నానజలముచే నీతని దేహమును దడపుచుండుము. ఎన్నిదినములవఱకుఁ బాపక్షయముగాదో అన్నిదినములవఱకును, బ్రతికూలవాహినియైన సరస్వతీనదియందు శ్రద్ధతో స్నానముచేయించవలయును. పాపక్షయము కాఁగానే ముక్తి లభింపఁగలదు. ఈతఁడు మిక్కిలి స్వార్థపరుఁడును దేవద్వేషియు నైన వాఁడు. బ్రాహ్మణు లీతనిఁ బరిత్యాగ మొనరించిరి. ఈతఁడు తనంతఁ దా నించుకయైనఁ బరిశుద్ధి నొందఁజాలఁడు. అందుచే నీతని నుద్దేశించి నీవే స్వయముగా సకలతీర్థములయందును భక్తితో స్నానముచేయవల

యును. అట్లయినచో నాయాతీర్థజలములచే నభిషిక్తుఁడై యాతఁడు పవిత్రుఁడు కాఁగలఁడు." అని చెప్పిరి.

అప్పుడు రాజు వారిమాటలను విని తండ్రికొఱకొక యాశ్రమమును నిర్మాణముగావించి యాతని నందుంచి, తండ్రిని బవిత్రుని జేయునిమిత్తమై యాతఁడు తీర్థయాత్రలకు బయలుదేఱెను. అట్లేఁగి యాతఁడు ప్రతిదినమును దీర్థసమూహములలో స్నానముచేసివచ్చుచు, నెప్పటికప్పుడు తీర్థజలములచేఁ దండ్రి నభిషిక్తునిఁ జేయుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁ డొక కుక్కురము స్థాణుమున్యమునఁ బ్రవేశించెను. ఈకుక్కురము జన్మాంతరమునందు గాలగణమున కధిపతిగా నుండి దేవద్రవ్యమునకు రక్షకుఁడుగా నుండెను. అట్లాతఁడు నిరంతరము దేవద్రవ్యమును సంరక్షించుచు సర్వదా దేవకార్యతత్పరుఁడై యుండెను. ధర్మమార్గమునం దిట్లు కాలము గడపుచుండుటచే నాతఁ డందఱకును బహుప్రియుఁడుగా నుండెను. ఇట్లు కొంతకాలము గడచినతరువాత నాకస్మికముగా నాతని కొకకాలమందు దేవద్రవ్యము నపచయము గావించుటకు బుద్ధిపుట్టెను. తరువాత నాతఁ డధర్మము నాశ్రయించెను. కొంతకాలమైనపిమ్మట నాతఁడు పరలోకమున కేఁగఁగా యమరాజాతనిఁ జూచి కుక్కురగర్భమునఁ బుట్టుమని శపించెను. యమునాజ్ఞ కాఁగానే యాతఁడు సౌగంధికవనములో కుక్కురమై జన్మించెను. బహుకాలమైనపిదప నీకుక్కురము మఱికొన్నికుక్కురములచేఁ జుట్టుకొనఁబడి పరాభవమొందెను. అప్పు డది యతిదుఃఖముతో ద్వైతవనమును వదలి సన్నిహత్యసరోవరమునకుఁ జేరెను. మిక్కిలి తృష్ణాతురమై యది యచ్చటఁ బ్రవేశించి, స్థాణునియనుగ్రహముచే వెంటనే సరస్వతీజలముల మునింగెను. తీర్థజలమున మునిఁగినతోడనే యది సర్వపాపనిర్ముక్త యయ్యెను. అప్పు డాకుక్కుర మాహారమును గోరు

చు నదీతీరమునఁ గూరుచుండెను. భీతచిత్తముతో వచ్చిన యాతు
క్కును జూచి రోగిష్టమై యున్న వేణుఁడు దానిని మెల్లమెల్లఁగా నిమురఁ
జొచ్చెను. అవెంటనే యాతఁడు స్థాణుతీర్థమున మునింగెను. అనేకదిన
ములనుండి యనేకతీర్థసహస్రాహముల జలకణములచే నభిషిక్తుఁ డగుచు
వేణుఁ డిప్పుడు కుక్కురదేహజలకణములను స్పృశించినవాఁ డగుటచేఁ
దత్క్షణమే యాతనిచిత్తము వైరాగ్యయుక్త మయ్యెను. వేణుఁ డిట్లు
స్థాణుతీర్థమాహాత్మ్యముచేతను, బుద్ధుఁ డొనరించిన తరణోపాయము
చేతను దరించి యప్పుడే దివ్యదేహమును జితేంద్రియత్వమును బొంది
స్థాణువునకుఁ బ్రణిపాతము లొనరించి, భక్తితో నాతని నిట్లు స్తవము
చేయఁజొచ్చెను. "ఎవ్వఁడు మహాదేవుఁడును, మహాత్ముఁడును, విశ్వ
పతియుఁ, జంద్రమౌళియు, జన్మహీనుఁడును, దేవదేవుఁడునో, యాత
నికి నేను శరణాపన్నుఁడ నగుచున్నాను. ఓపూర్వశత్రువినాశనుఁడవైన
దేవదేవా! నీవే దేవగణముల కధిపతివి, బలవంతుల బలగర్వము
నీసన్నిధిని ఖర్వమైపోవును. దేవతలకును ఋషులకును నీవే యేక
మాత్రపూజితుఁడవు. నీకు నేను నమస్కరించుచున్నాను. ఓవిరూ
పాక్షా, సహస్రాక్షా, త్రినేత్రా! నిన్ను యక్షేశ్వరున కేకాంతప్రీతి
పాత్రుఁడవు. నీపాణిపాదములు సకలదిక్కులకును బ్రసారితములు, నీక
న్నులు, ముఖము, మస్తకము సర్వత్రపరివ్యాప్తములు. నీ వన్నిఁటిచే
తను వినఁబడుచున్నావు. అంతటను వ్యాపించి విరాజిల్లుచున్నావు.
ఓశంకుకర్ణా, మహాకర్ణా, కుంభకర్ణా! ఓఅర్ణవాలయా, గజేంద్రకర్ణా,
గోకర్ణా, పాణికర్ణా! నీకు నమస్కరించుచున్నాను. ఓశతజిహ్వా, శతా
వర్తా, శతోదరా, శతాననా! గాయత్రిదేవిగణము సర్వదా నీమా
హాత్మ్యమును గీర్తించుచుండును. అర్కోపాసకులు పూజ్యమైన నీపూ
జను జేయుచుందురు. నీవు బ్రహ్మవు, శతక్రతువు నూర్ధ్వమునందు

నీయధిష్ఠానము. ఇదియే యందఱిమతమును, నీవు మహామూర్తిధారివి. గోష్ఠమునందు గోగణమువలె నీమూర్తియందే సమస్తదేవతలు విరాజిల్లుచుందురు, సమస్తసాగరములును సమస్తభూమియు విరాజిల్లుచుండును. నీదేహమునందుఁ జంద్రుఁడు, అగ్ని, వరుణుఁడు, నారాయణుఁడు, సూర్యుఁడు, బ్రహ్మ, బృహస్పతి, మొదలగువారు కనఁబడుచున్నారు. ఓభగవానుఁడా! కార్యము, కారణము, క్రియ, కరణము, ప్రభవము, ప్రళయము, సత్తు, అసత్తు, ఆహారము, లధసేవత మొదలగునమస్తము నీవే. భవుఁడు శర్వుఁడు వరదుఁడు నుగ్రరూపియునైన దేవునకు నమస్కరించుచున్నాను. అంధకాసురభంజనుఁడైన పశుపతి కేను నమస్కరించుచున్నాను. నీవు త్రిజటివి, త్రిశిరుఁడవు, త్రిశూలివి, త్ర్యంబకుఁడవు, త్రినేత్రుఁడవు, త్రిపురఘ్నుఁడవు, నీకు నేను నమస్కరించుచున్నాను. నీవు ముండ, చండ, అంశ, ఉత్పత్తిహేతువవు, డిండిమాసక్తహస్తుఁడవు, దండిముండుఁడవు. నీకు నమస్కారము చేయుచున్నాను. నీవు ఊర్ధ్వకేశప్రౌఢుఁడవు, శుష్కుఁడవు, వికృతుఁడవు, ధూమ్రుఁడవు, లోహితుఁడవు, స్నిగ్ధుఁడవు, నీలగ్రీవుఁడవు, నీకు నమస్కరించుచున్నాను. నీవు విశ్వరూపుఁడవు, విరూపుఁడవు, శివుఁడవు, సూర్యమాలవు, సూర్యస్వరూపుఁడవు, సూర్యధ్వజమాలాలంకృతుఁడవు. నీకు నమస్కారము. నీవు నానానామధారివి, పటుతరుఁడవు, గణేంద్రనాథుఁడవు, వృషస్కంధుఁడవు, ధనుర్ధారివి, సంక్రందనుఁడవు, చండుఁడవు, పర్ణధారపుటుఁడవు, హిరణ్యవర్ణుఁడవు, కనకవర్చసుఁడవు, స్తుతుఁడవు, స్తుత్యుఁడవు, స్తుతిస్థసర్వుఁడవు, సర్వభక్షకుఁడవు, సర్వభూతదేహివి, హోతవు, హంతవు, సితోదగ్రపతాకివి, నమఃస్వరూపుఁడవు, మంత్రస్వరూపుఁడవు, కటంకటుఁడవు, కృశనాశుఁడవు, శయితవు, ఉద్ధితుఁడవు, స్థితుఁడవు, ధామసారుఁడవు, ముండుఁడవు,

కుటిలుఁడవు, నర్తనశీలుఁడవు, లయవాదిత్రశాలివి, నాట్యోపహారలు
బ్ధుఁడవు, ముఖవాదిత్రశాలివి, జ్యేష్ఠుఁడవు, శ్రేష్ఠుఁడవు, బలాతిబల
ఘాతివి, కాలనాశుఁడవు, కాలుఁడవు, సంసారక్షయరూపివి, హిమవద్దుహి
తృభర్తవు, భైరవుఁడవు, ఉగ్రుఁడవు, దశబాహుశాలివి, చితాభస్మప్రియుఁ
డవు, కపాలకరుఁడవు, విభీషణుఁడవు, భీష్ముఁడవు, హిమవ్రతధరుఁడవు,
వికృతవక్త్రుఁడవు, వక్రప్రాంతుఁడవు, ఉగ్రదృష్టివి, పక్వామమాంసలుబ్ధుఁ
డవు, తుంబీవీణాప్రియుఁడవు, వృషాంకవృష్టివి, గోమానుఁడవు, కటంకటుఁ
డవు, పచంపచుఁడవు, శ్రీమురూపివి, సర్వవరిష్ఠుఁడవు, వరదాతవు, వర
దుఁడవు, విరక్తవస్త్రుఁడవు, భావనుఁడవు, అక్షమాలివి, విభేదభేదభి
న్నుఁడవు, ఛాయవు, తపనుఁడవు, అఘోరుఁడవు, ఘోరరూపివి,
ఘోరఘోరతరుఁడవు, శివుఁడవు, శాంతుఁడవు, శాంతతముఁడవు, బ
హునేత్రశాలివి, ఏకమూర్తివి, శ్రేష్ఠుఁడవు, యజ్ఞభాగప్రియుఁడవు,
పంచాలుఁడవు, సితాంగుఁడవు, యాతుగామకుఁడవు, చిత్రఘం
టుఁడవు, ఘంటాఘంటిఘంటుఁడవు, సహస్రశతఘంటుఁడవు, ఘంటా
మాలావిభూషణుఁడవు, ప్రాణసంఘట్టఘంటుఁడవు, కిలాకిలప్రియుఁడవు,
గృహవృక్షనికేతనుఁడవు, గర్భమాంససృగాలుఁడవు, తారకుఁడవు, త
రుఁడవు, యజ్ఞుఁడవు, యజివి, హుతుఁడవు, ప్రహుతుఁడవు, యజ్ఞవా
హుఁడవు, హవ్యుఁడవు, తప్యుఁడవు, తపనుఁడవు, తుండుఁడవు, తుం
డ్యుఁడవు, తుండపతివి, అన్నదుఁడవు, అన్నపతివి, నానాఅన్నభోజివి,
సహస్రశీర్షుఁడవు, సహస్రచరణుఁడవు, సహస్రోద్యతశూలుఁడవు, సహ
స్రభగణుఁడవు, బాలానుచరగోప్తుఁడవు, బాలలీలావిలాసుఁడవు,
బాలవృద్ధుఁడవు, క్షుబ్ధుఁడవు, క్షోభణుఁడవు, గంగాలులితకేశుఁడవు,
ముంజకేశుఁడవు, షట్కర్మతుష్టుఁడవు, త్రికర్మనిరతుఁడవు, నగ్నప్రా
ణుఁడవు, చండుఁడవు, కృశుఁడవు, ఆస్ఫోటనుఁడవు, ధర్మార్థకామమో

ఏకధ్యకథముఁడవు, సాంఖ్యుఁడవు, సాంఖ్యముఖ్యుఁడవు, సాంఖ్యయోగముఖుఁడవు, విరథుఁడవు, రథ్యుఁడవు, చతుష్పథుఁడవు, రథుఁడవు, కృష్ణాజినోత్తరీయుఁడవు, హరికేశుఁడవు, త్ర్యంబకుఁడవు, అంబికానాథుఁడవు, వ్యక్తుఁడవు, అవ్యక్తుఁడవు, వేధవు, కాముఁడవు, కామదుఁడవు, కామఘ్నుఁడవు, తృప్తాతృప్తవిచారివి, సర్వదయాసంపన్నుఁడవు, కల్పసంఖ్యావిచారివి, మహాసత్త్వుఁడవు, మహాబాహుఁడవు, మహాబలుఁడవు, మహామేఘధరప్రఖ్యుఁడవు, మహాకాలుఁడవు, మహాద్యుతివి, మేఘాగ్నుఁడవు, యుగాగ్నుఁడవు, చంద్రార్కపతివి, అన్నమవు, అన్నభోక్తవు, పక్వాన్నోజివి, పానుఁడవు, అనలుఁడవు, జరాయుజుఁడవు, అండజమవు, స్వేదజమవు, ఉద్భిజ్జమవు, దేవదేవేశుఁడవు, చతుర్విధభూతగ్రాముఁడవు, చరాచరస్రష్టవు, ప్రహంతృప్రభృతినాముఁడవు, నీయీప్రత్యేకప్రత్యేకనామములచే నిన్ను నమస్కరించుచున్నాను. బ్రహ్మవాదులు నిన్నే పరబ్రహ్మమని స్మరింతురు. నీవు మానస్సుకుఁ బరమజ్యోతివి, నీవే జ్యోతిక జ్యోతిస్స్వరూపుఁడవు. బ్రహ్మాదులు నిన్ను హంస, వ్రత, మధుప్రభృతినామములచేఁ జెప్పుచుందురు. గాస్తకుఁడవు, శ్రీకంఠుఁడవు నీవే ...ను లీసమున నామములచే నిన్నుఁ బిలుచుందురు. నిత్యమును నీవు వేదములచేతను ఉపనిషత్తులచేతను నుచ్చరింపఁబడుచున్నావు

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనువర్ణచతుష్టయమువారును, తక్కినహీనవర్ణములును, మేఘసంఘములును, విద్యుత్తులును, అశనిగర్జనములును, సంవత్సరములు, ఋతువులు, మాసములు, మాసార్ధములు, యుగములు, నిమేషములు, కాష్ఠలు, నక్షత్రములు, గ్రహములు, బలములు మొదలగు సమస్తము నీవే. వృక్షములలోఁ గకుభము, గిరులలో హిమాలయము, మృగములలో వ్యాఘ్రము, పక్షుల

లోఁ జాహ్నవము, భోగులలో ననంతుఁడు, సముద్రములలో క్షీరసము ద్రము, యంత్రములలో ధనుర్యంత్రము, ప్రహరణములలో వజ్రము, వ్రతము లన్నిటిలో సత్యవ్రతమును నీవు. మతియు, ఇచ్ఛ, ద్వేష ము, రాగము, మోహము, శమము, అశమము, వ్యవసాయము, ధృతి, లోభము, కామము, క్రోధము, జయము, అజయము మొదలగుసమ స్తమును నీవు. శక్తి, గద, ఖట్వాంగి, శరాసని, ఛేత్త, భేత్త, ప్రహర్త, మంత, నేత, సనాతనుఁడు మొదలగునామము లన్నియు నీవే. దశ దిక్కుల నానావిధధాన్యాకారములు నీవు. సముద్రములు, సరోవరము లు, గంగ, పర్వతములు, వృక్షములు, లతలు, వల్లులు, తృణములు, ఓషధులు, పశువులు, మృగములు, పక్షులు, పుష్పఫలప్రదకాలము లు, వేదములయాది, ప్రాణాయామము, గాయత్రి, ప్రణవము, లోహిత ము, హారితము, నీలము, కృష్ణము, పీతము, సితము, కద్రువు, కపిల ము, కపోతము, మేచకము, సవర్ణము, అవర్ణము, కర్త, హర్త, ఇం ద్రుఁడు, యముఁడు, వరుణుఁడు, ధనదుఁడు, అనిలుఁడు, ఉష్ణాంశుఁ డు, భానుఁడు, స్వర్భానుఁడు, శిష్యుఁడు, హోత, త్రిసౌపర్ణుఁడు మొద లగు సమస్తము నీవే. నీవే యజుర్వేదములకు శతరుద్రీయము, పవిత్ర ములకు పవిత్రము, మంగళములకు మంగళము. నీవు కొండవృక్షమునం తుమ్మవి, అఖిలజీవములకు ముఖ్యమవు, నీవు సత్త్వ రజస్తమములును, ప్రతిపత్పతివిని. ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యా నము, ఉన్మేషము, నిమేషము, క్షుతము, జృంభితము, నీసకలము నీనామములే. నీవు లోహితాంతర్గతదృష్టివి, మహావక్త్రుఁడవు, మహోదరుఁడవు, శుచిరోముఁడవు, హరిశ్మశ్రుఁడవు, ఊర్ధ్వకేశుఁడవు, చలాచలుఁడవు, గీతవాదిత్రనృత్యజ్ఞుఁడవు, గీతవాదిత్రప్రియుఁడవు, మ త్స్యము, జాలము, జలౌకము, కాలకేళి, అకాలము, వికాలము, దుష్కాలము, కాలము, నృత్యము, నృత్యకర్త, యజ్ఞము, యజ్ఞ

వ్యాధి, ఆధినాశకుఁడు, ఆధివిస్తారకుఁడు, సమూహము, అసమూహము, శాంత, సనాతనుఁడు, శిఖండి, పుండరీకాక్షుఁడు, పుండరీకవనవాసి, త్ర్యంబకుఁడు, దండధారి, ఉగ్రదంష్ట్రుఁడు, కులాంతకుఁడు, సురశ్రేష్ఠుఁడు, సోమపుఁడు, మరుత్పతి, అమృతాశి, జగన్నాథుఁడు, దేవదేవుఁడు, గణేశుఁడు, విషాగ్నిపాయి, సోమపాయి, క్షీరపాయి, ఆజ్యపాయి, మధువు, మధుపుఁడు, బ్రహ్మవంతుఁడు, ఘృతచ్యుతుఁడు, సర్వలోకభోక్త, సర్వలోకపితామహుఁడు, హిరణ్యరేతుఁడు, అద్వితీయపురుషుఁడు, స్త్రీ, నపుంసకుఁడు, బాలకుఁడు, యువకుఁడు, జీర్ణదంష్ట్రుఁడు, విశ్వకృత్తు, అంతేగిరి, విశ్వకర్త, ధాత, వరేణ్యుఁడు, అగ్నియు నీవు. విశ్వకర్తలు నీకుఁ బ్రణతులై నిన్నుఁ బూజించుచున్నారు. సూర్యచంద్రులు నీచక్షువులు, నీవు అగ్నివి, ప్రపితామహుఁడవు. సరస్వతి నీవాక్కు, దివారాత్రములు నీరూపాంతరములు. నీవు నిమేషోన్మేషకర్తవు. బ్రహ్మ, గోవిందుఁడు, ప్రాచీనఋషులు నీతత్త్వ మెట్టిదో గ్రహింపఁజాలరు. నీవు శతసహస్రపురుషరూపమున వ్యాపించి యనంతతపోరూపమున విరాజిల్లుచున్నావు. జితశ్వాసుఁడవు, జితేంద్రియుఁడవు. సత్త్వనిష్ఠుఁడవు. యోగమార్గగులు తేజ్యోతిస్వరూపమును జూచుచున్నారో, ఆయోగాత్ముఁడవు నీవే, నీకు నమస్కారము. అవ్యక్తములు దర్శనాతీతములు నగు నీమూర్తు లేవి గలవో వానిచే నన్నుఁ బుత్త్రునివలెఁ బ్రతిపాలింపుము. ఓపాపలేశశూన్యా! నేను నీకు రక్షణీయుఁడను, నన్ను రక్షింపుము. నీకు నమస్కరించుచున్నాను. నీవు భక్తవత్సలుఁడైన భగవానుఁడవు, నేను నీకు నిత్యభక్తుఁడను. నీవు జటివి, దండివి, లంబోదరుఁడవు, క్రతురూపుఁడవు, దీర్ఘజిహ్వుఁడవు, మహాదంష్ట్రుఁడవు, రుద్రాత్ముఁడవు, నీకు నేను నమస్కరించుచున్నాను. ఎవ్వని కేశపాశములయందు మేఘబృందము, ఎవ్వనిసర్వాంగసం

ధులయందు నదీసమూహము, ఎవ్వనికుక్షిలో సాగరనిచయమును గలిగి యుండెనో, ఆతోయాత్మకుఁడగు నీకు నేను నమస్కరించుచున్నాను. యుగాంతకాలమున సర్వభూతభక్షకుఁడై జలమధ్యమునం దెవ్వఁడు పవ్వళించియున్నాఁడో, ఆయంబుశాయివి నీవే, అట్టినిన్ను నేను శరణొందుచున్నాను. రాహువదనమునఁ బ్రవేశించి రాత్రియం దెవ్వఁడు సోమపానముసేయుచుండెనో, సూర్యుని గ్రాసముచేయుకాలమునం దెవ్వఁడు తనతేజముచే రాహువు రక్షించుచున్నాఁడో, వాఁడే నీవు, నీకు నే నమస్కరించుచున్నాను. ఎవ్వఁడు పతితగర్భరక్షకుఁడును, స్వాహాస్వధాస్వరూపుఁడును, ఎవ్వఁడు అంగుష్ఠమాత్రపురుషశరీరుఁడై సర్వదేహములయందు విరాజిల్లుచున్నాఁడో, అతఁడు సతతము నన్ను రక్షించుఁగాక! నాకు సన్నిహితుఁ డగుగాక! ఈనదీనిచయము, సాగరసమూహము, పర్వతప్రకరము, గుహానివహము, వృక్షమూలములు, గోష్ఠములు, కాంతారగహనములు, చతుష్పథములు, రథ్యాచత్వరములు, సభాసమూహములు, హస్తిశాలలు, రథశాలలు, అశ్వశాలలు, జీర్ణోద్యానములు, జీర్ణవాటికలు, భూతపంచకము, దిఙ్మండలము, దిక్ప్రాంతములు సకలము, చంద్రసూర్యాంతరములు, చంద్రసూర్యరశ్మిజాలములు, రసాతలము, తదూర్ధ్వప్రదేశములు మున్నగువానియందు వాసముచేయుచు రాకపోకలు జరుపుచుండువాఁడెవ్వఁడో, వానికి సర్వదా నేను ఎదేపదే నమస్కరించుచున్నాను. ఓ దేవా! నీవు నాయెడలఁ బ్రసన్నుఁడవు గమ్ము. నాహృదయము నా బుద్ధి నీయందే తవిలియున్నవి." ఇట్లు మహాదేవుని వేణరాజు స్తవ మొనరించెను.

—♦ బ్రహ్మాదికృతశివస్తోత్రము. ♦—

సనత్కుమారుఁడు చెప్పుచున్నాఁడు — వేణుఁ డిట్లు స్తవము నొన రింపఁగాఁద్రిలోకపతియు వాగ్విదుఁడు నైన శివుఁడు సాంత్వనవాక్యముల నిట్లు పలికెను. రాజా ! నీస్తవమునకు నేను సంతుష్టుఁడ నైతిని. అధిక మేందులకు? నీవిక్కడ నాసమీపముననే వాసముచేయఁగలవు. ఇచ్చట బహుకాలము వాసముచేసి తరువాత నాశరీరమునం దుత్పన్నుఁడవై నీవు సురవినాశివై అంధకాసురుఁ డనునామంబునఁ బ్రఖ్యాతుఁడ వయ్యెదవు. హిరణ్యాక్షుని గృహంబున నీవు జన్మించి దినదిన ప్రవర్ధమానుండవు కాఁగలవు. పూర్వజన్మమునందలి వేదనిందాజనిత మైన భీషణదోషఫలముచే, నీకిట్టియసురజన్మ మెత్తవలసివచ్చెను. జగన్మాతకొఱకు నీ వెప్పు డభిలషించెదవో, అప్పుడు శూలప్రహారముచే నేను నిన్ను నిహతునిఁ గావించి యిచ్చటనే కూల్చెదను. ఆసమయమున నీవు సర్వపాపవిముక్తుఁడవై భక్తిభరముచే నన్ను దర్శింపఁగలవు. ఆదర్శనఫలముగా నీవు భృంగిరిటి యనుపేర విఖ్యాతగణాధిపతివి గాఁగలవు. అప్పుడు నీవు నిత్యము నాసన్నిధానమునందే యుండఁగలవు. తరువాత నీవు సిద్ధి నొందఁగలవు.

వేణరాజకృతమైన యీస్తోత్రము నెవ్వరు కీర్తించుచున్నారో, యెవ్వ రాకర్ణించుచున్నారో వారి కెట్టియమంగళమును ఘటిల్లదు. ప్రపంచములో వారు దీర్ఘాయువులై యుండఁగలరు. సకలదేవతలలో శివుఁడు విశిష్టుఁడై నట్లే స్తవసమూహము లన్నిఁటిలో వేణుఁడుచేసిన యీస్తవము గరిష్ఠమైనది. ఎవ్వరు యశమును, రాజ్యమును, సుఖమును, ఐశ్వర్యమును, ధనమును, సన్మానమును గోరుచున్నారో, వారు భక్తితో నీస్తవమును ముఖ్యముగా వినఁదగును. విశేషించి విద్యార్థు లీస్తవమును బ్రయత్నముతో వినవలయును. ఈస్తవము

వినినవారు, వ్యాధిగ్రస్తులు, దుఃఖితులు, దరిద్రులు, రాజభీతులు, రాజకార్యవిచ్యుతులు నైనను వారు మహాభయములనుండి విముక్తు లగుచున్నారు. మఱియు నీదేహమునందే వర్ణశ్రేష్ఠతను బొందుచు న్నారు. అట్టివారు తేజోయశములు గలవారై నిష్పాపదేహముచేఁ బ్రకాశింపఁగలరు. ఏగృహమునం దీస్తవము పఠింపఁబడునో ఆగృహ మునందు రాక్షస, పిశాచ, వినాయకప్రభృతు లేవిఘ్నములును గలి గింపఁజాలరు. భర్త యనుమతిగొని యేస్త్రీ యీస్తవము నాలకించు చున్నదో, ఆస్త్రీ పుట్టింట నత్తింటఁగూడ దేవివలె సన్మానింపఁబడఁ గలదు. ఎవఁడు సమాహితచిత్తముతోఁ బ్రతిదినము నీదివ్యస్తోత్ర మును శ్రవణముచేయుచున్నాఁడో, ఆనరుని సకలకార్యములును సఫ లములగును. ఈస్తవమును బఠించినమానవులకు మనస్సులోని తలంపు లన్నియు నెఱవేఱును. నోటితోఁ జెప్పినమాట లన్నియు సమకూరు ను. ఇదిగాక మనోవాక్కాయములచేఁ జేసినసకలపాపములు నిర్మూ లితము లగును.

అనంతరము మహాదేవుఁడు వేనునిం గాంచి, ‹‹ వేనరాజా ! నీకు శుభ మగుఁగాక. నీ కేమి వరము కావలయునో కోరుము” అని యెను. వేనుఁ డిట్లుపల్కెను—స్వామీ ! నే నీలింగమాహాత్మ్యముచే తను, లింగదర్శనముచేతను, భవద్దర్శనముచేతను సర్వపాపవిముక్తుఁడ నైతిని. ఓదేవేశా ! నీవు సంతుష్టుఁడవైనచో, మఱియు నేను నీవర దానమునకు యోగ్యుఁడ నని నీదివ్యచిత్తమున కెక్కెనదో నోశంకరా! దేవధనము నపహరించినదోషముచే గుక్కజన్మము నెత్తినయీపురు షునియెడలఁ బ్రసన్నుఁడవు గమ్ము. ఓభగవానుఁడా ! నే నీసరోవర ములో నవగాహన మొనరింపనమకట్టినప్పుడు మొట్టమొదట దేవతలు నన్ను నిషేధించిరి ; కాని యీకుక్కరము నాకు విశేషోపకారమును

జేసియున్నది. అందుకొఱకే దీనియెడల నిన్నుఁ బ్రసన్నుఁడవు గమ్మని కోరుచున్నాను.” అని వేనుఁడు ప్రార్థింపఁగా శంకరుఁ డాలకించి సంతోషముతో నిట్లు చెప్పెను. “నిశ్చయముగా నీకుక్కరముకూడఁ బాపవిముక్తి నొందఁగలదు. నాయనుగ్రహముచే నిది శివలోకప్రాప్తిఁ గాంచును. ఈనాస్తవము వినుటవలన నెవ్వరైననుసరియే సర్వపాపనిర్ముక్తు లగుదురు. ఓమహీపతీ! కురుక్షేత్రమాహాత్మ్యము, లేక యీసరోవరమాహాత్మ్యము, లేక మదీయలింగోత్పత్తివృత్తాంతము నివి యన్నియు నాకర్ణించుటవలన పాపవిమోచనము తప్ప దని యెఱుంగుము.”

అనిచెప్పి సనత్కుమారుఁడు మరలఁ జెప్పుచున్నాఁడు—భగవానుఁడైన శంకరుఁ డిట్లు చెప్పి యప్పుడాజనమధ్యమునుండియే యంతర్హితుఁ డయ్యెను. అప్పు డాకుక్కరము పూర్వజన్మస్ఫురణము గలిగినదై తత్క్షణమే దివ్యరూపమును ధరించి రాజుసన్నిధికి వచ్చినిలిచెను. రాజైన వేణతనయుఁ డప్పుడు స్నానముచేసి తండ్రిని దర్శింపఁగోరి తండ్రికుటీరమునకు వచ్చెను. కాని తండ్రికుటీరము శూన్యమైయుండెను. ఆతనిరోగగ్రస్తుఁడైనతండ్రి యాతని కగపడలేదు. వేణనందనుఁడు శోకాకులుఁడై పోయెను. ఆసమయమునం దాతనితండ్రి యైనవేనుఁ డత్యంతహర్షోత్కర్షుఁడై యచ్చటికరుదెంచి కుమారునకిట్లని యెను—వత్సా! నీవే సత్పుత్రుఁడవు. నీసహాయముచే నేను నేఁడు నరకార్ణవమునుండి యుద్ధరింపఁబడితిని. నీవు నన్నుఁ బ్రతిదినమును ననేకతీర్థజలములచే నభిషిక్తునిఁ గావించుచు వచ్చితివి. ఆపుణ్యము చేతఁ బరమదేవుఁడైన స్థాణువియనుగ్రహము నాతనిదర్శనమును బొంది నేనిప్పుడు పాపవిముక్తుఁడ నైతిని, ఇఁక స్వర్గమునందలి శివలోకమున కేగఁగలను.” ఇట్లు చెప్పి వేనుఁ డక్కడ నొకమహేశ్వరలింగమును

ప్రతిష్ఠగావించెను. పుత్రునివలనఁ దరించినవాఁడై యాస్థాణుతీర్థము నందే సిద్ధినొందెను. స్థాణుతీర్థమాహాత్మ్యముచేఁ గుక్కురముఁగూడఁ బరమసిద్ధి లభించినదై సకలపాపములనుండి విడివడి భవమందిరమున కేఁగెను. నృపతియైన వేణతనయుఁడు పితృఋణవిముక్తుఁడై వసుంధరను బరిపాలించుచుఁ బుత్రవంతుఁడై నియతధర్మములను యజ్ఞానుష్ఠానములను నెఱపుచు, విప్రవర్గములకు వివిధకామ్యవస్తువుల నొసఁగుచు నానావిధభోగ్యవస్తువుల ననుభోగించుచు, సుహృద్వర్గమునకు ధనవితరణ మొనరించుచు, బన్నిని బరితుష్టినొందించుచు నిల్పియుండి తరువాతఁ బుత్రునకు రాజ్యాభిషేకము గావించి కురుక్షేత్రమున కేఁగెను. అక్కడనుండి యచ్చోట కేఁగి కఠోరతపశ్చర్యచే శంకరునిఁ బూజించి స్వచ్ఛందమరణముచేఁ బరమపదమున కేఁగెను. ఇట్టి స్థాణుతీర్థమాహాత్మ్యకథ నెవ్వ రాకర్ణించుచున్నారో వారికి సర్వపాపములు క్షయమగుచున్నది. వారు పరమగతిలాభము నొందుచున్నారు.

## —♦ చతుర్ముఖకృతశివస్తవము. ♦—

పిమ్మట మార్కండేయుఁడు సనత్కుమారునింగాంచి యిట్లనియెను— “ ఓ యనఘా! చతుర్యుగములయుఁ, బృథివీపతులయు నుత్పత్తివార్త వినఁగోరుచున్నాను.” సనత్కుమారుఁడు చెప్పుచున్నాఁడు- “ ఓ పాపరహితుఁడా! పద్మజుఁడైన బ్రహ్మ సృష్టివ్యాపారమునం దభిలాష గలిగి, యేమేమి కావించెనో, అది యంతయు నీకడ విపరించి చెప్పెద నాకర్ణింపుము. భగవంతుఁడైన పితామహుఁడు తా నావిర్భవించి చరాచరమైనభూతజాలమును సృష్టించెను. తరువాత మరల సృష్టిగూర్చి చింతింపఁగా నొకమనోహరురాలైన కన్య యుత్పన్న యయ్యెను. ఆకన్యయాకారము నీలోత్పలనిభమైన శ్యామవర్ణము, కటి

తటము సూక్ష్మము, నయనద్వయము పరమసుందరము. బ్రహ్మ యా మనోజ్ఞమూర్తియైనలలనను గాంచి సంభోగింప నభిలషించెను. ఆమహాపాపఫలముచేతనే బ్రహ్మశిరము విశీర్ణమయ్యెను. అతఁడు శీర్ణమస్తకుఁడై విశ్వవిఖ్యాతమైన సన్నిహతీతీర్థమున కేఁగెను. ఈతీర్థము పాపాహరమును, బరమపవిత్రమును. బ్రహ్మ ఋషిసిద్ధసేవితమైన పవిత్రస్థాణుతీర్థమున కేఁగి, సరస్వతి కుత్తరతీరమున నొకశివలింగమును బ్రతిష్ఠించెను. తరువాత నాతఁడు మనోహరధూపగంధాదులచేఁ బూజించుచుఁ బ్రతిదినము రుద్రసూక్తమును బఠించుచు రుద్రు నర్చింపఁజొచ్చెను. ఈవిధముగా నాతఁడు భక్తితో శివపూజానిరతుఁడై యుండఁగా భగవంతుఁడైన నీలలోహితుఁడు స్వయముగా నక్కడకు వేంచేసెను. ఆయన యట్లరుదెంచుటఁ జూచి లోకపితామహుఁడైన బ్రహ్మ భూతలమున కొఱఁగి శిరసానమస్కారములు గావించి యాతని నిట్లు స్తోత్రము చేయఁజొచ్చెను— "ఓ భూతభవిష్యద్వర్తమానముల కాశ్రయమైన మహాదేవా! నీకు నమస్కారము. నీవు స్తుతినిత్యుఁడవు, త్రిలోకపాలకుఁడవు, పవిత్రదేహుఁడవు, సర్వపాపహర్తవు, చరాచరగురుఁడవు, గుహ్యపదార్థమవు, మఱియు గుహ్యపదార్థప్రకాశకుఁడవు. నీవు భైషజ్యప్రయోగముచే సకలరోగవినాశము గావింతువు. కాలరవాజినముచే నీశరీర మావృతమై యున్నది. నీవు వీతశోకుఁడవు. నీకసంఖ్యనమస్కారములు. వారికల్లోలసంక్షోభమును, మహాబుద్ధివిఘట్టనమును నీవే. నీనామము జపించువారికిఁ బునరుత్పత్తిదోషము కలుగదు. నీవు నిత్యుఁడవు, ద్రిలోకధ్వంసివి, శంకరుఁడవు, అప్రమేయుఁడవు, వ్యాధివిఘాతకుఁడవు, పరుఁడవు, అపరిమేయుఁడవు, సర్వభూతప్రియుఁడవు, యోగేశ్వరుఁడవు, దేవదేవుఁడవు, సర్వపాపహరుఁడవు, స్థాణుఁడవు, ప్రసిద్ధుఁడవు, సిద్ధవందితోషణుఁడవు, భూతసంసారదుర్గుఁడవు, విశ్వ

రూపుఁడవు, ఫణీంద్రగీతమహిముఁడవు, ఫణీంద్రాంగదధరుఁడవు, ఫణీంద్రవరహారుఁడవు, మఱియు భాస్కరుఁడవు, నీకు నేను మాటిమాటికి నమస్కారము లొనరించుచున్నాను."

బ్రహ్మ యిట్లు స్తోత్రముచేయఁగా దేవదేవుఁడైన శంకరుఁ డాతని కిట్లనియెను. "భవితవ్యమునుగూర్చి శోకించుట యెప్పుడును గర్తవ్యముగాదు. పూర్వము వరాహకల్పమందు నీమస్తకము నాచే నపహరింపఁబడియున్నది, అది యిప్పుడు చతుర్ముఖమై యున్నది. అది యెప్పుడును జెడనిది. ఈసన్నిహతీతీర్థమునందు నీవు మదీయలింగప్రతిష్ఠగావించి సర్వపాపవిముక్తుఁడవై సృష్టివాంఛచే నీవు నన్నుఁ బ్రేరేపించితివి, అందుచే నేను నీచెప్పినట్లు భూతవర్గమునకు దృష్టిగోచరుఁడనైతిని. ఈసన్నిహతీతీర్థమునందు నేను దీర్ఘకాలము తపోనిమగ్నుఁడనై యుండుటచే నీవు నాకొఱకు బహుదినములు ప్రతీక్షించి, సర్వభూతములకు సృష్టికర్తనుగా నీవు నన్ను సంకల్పించితివి, అప్పుడు నేను దదవస్థయు జలమగ్నమై యున్న మదీయలింగమును జూచి—అగ్రజన్ములైనవా రెవ్వరు లేనిచో నేను సృష్టికార్యమును బూర్ణము గావించెద ననిచెప్పియుంటిని. నీవందుల కిట్లంటివి—"నీకంటె నగ్రజన్ములైనవా రెవ్వరును లేరు. ఈస్థాణులింగము వివశమై జలమగ్నమై యున్నది. అందుచే నీవే నాకు హితమొనరింపుము" అని.

తుద కాభగవానుఁడే దక్షుఁడు మొదలగు ప్రజాపతులనుసృష్టించెను. వారే యీచతుర్విధభూతసంచయమును సృష్టించిరి. ఓబ్రహ్మ! సృష్టింపఁబడినవెంటనే యాప్రజాసమూహ మంతయు నాఁకలిగొని యాకస్మికముగాఁ బ్రజాపతులను భక్షించుటకుఁ బరుగులిడఁ జొచ్చెను. ప్రజాపతులప్పు డాత్మరక్షణము గోరి పితామహునిశరణుచొచ్చిరి, వారప్పుడు పితామహునిఁ బ్రజావర్గమునకు మహావృ

త్తులను నిర్దేశింపు మని ప్రార్థించిరి. తరవాత స్థావరములకు భూమియే యన్నముగను, జంగమములకు మహౌషధులును — బలవత్ప్రాణులకు దుర్బలప్రాణులును భక్ష్యములుగను నిర్దేశింపఁబడెను. అప్పుడు ప్రజాగణము తమతమ నిర్దిష్టఖాద్యములను బొంది మరలఁ దమ తమనెలవులకు వెడలిపోయెను. అందువలనఁ బ్రజావర్గముపరస్పరప్రీతితో వర్ధిల్లఁజొచ్చెను, సకలభూతములు నిట్లు వర్ధిల్లుచుండుటఁజూచి లోకగురుఁడవైన నీవు పరితుష్టుడవు కాఁగానే, అప్పుడు నేను జలములనుండి లేచి ప్రజాగణమును జూడఁగంటిని. అనంతరము నాతేజముచేత విధింపఁబడిన యాప్రజాపుంజమును జూచి నేనత్యంతకుపితుఁడనై నాలింగము నూడఁబెఱికి పాఱవైచితిని. అట్లు నిక్షేపింపఁబడిన యాలింగము సరోవరమధ్యమునం దూర్ధ్వముగా విరాజిల్లుచుండెను. అప్పటినుండియు నీలింగము జగత్తునందు స్థాణునామముతోఁ బ్రసిద్ధి నొందుచున్నది. ఈలింగము నొక్కమాఱు దర్శించినంతమాత్రముననే మానవులు సకలపాపములనుండి నిర్ముక్తులై పునరావృత్తిరహితమైన పరమపదము నొందుచున్నారు. కృష్ణాష్టమీదినమునందు సమాహితచిత్తులై యెవరీతీర్థమునందు వసించుచుందురో వారికిఁ దెలియకచేసినపాపము లన్నియు నిర్మూలములై పోవుచున్నవి" భగవంతుఁడైన దేవదేవుఁ డిట్లు చెప్పి తత్క్షణమే యంతర్హితుఁ డయ్యెను. తరువాత బ్రహ్మయుఁ బాపములచే విడువఁబడిన విశుద్ధదేహము గలవాఁడై చతుర్ముఖదేవు నర్చించి, సరోవరములో దేవదేవునిలింగము లనేకములు సృష్టించెను. వానిలో మొదటిది బ్రహ్మసరోవరము, అది పవిత్రమును హరిపార్శ్వమునఁ బ్రతిష్ఠింపఁబడినదియు నై యున్నది. రెండవది బ్రహ్మసదనము, అది నిజాశ్రమమునందే విహితమై యున్నది. దానికిఁ బూర్వదిశయందుఁ దృతీయలింగము ప్రతిష్ఠితమైనది. నాలుగవది యైన

బ్రహ్మలింగము సరస్వతీతటమునందే స్థాపింపఁబడినది. ఈపరమపవిత్రలింగము లన్నిటిని బ్రహ్మ ప్రతిష్ఠించెను. ఎవ్వ రుపవాసముండి యీసమస్తలింగములను దర్శించుచుందురో, వారికిఁ బరమగతి ప్రాప్తించును. కృతయుగమునందు హరిపార్శ్వమును, త్రేతాయుగమునందు బ్రహ్మశ్రమమును, ద్వాపరమునందు దానికిఁ బూర్వదిక్కును స్థానములు. కలియుగమున సరస్వతీతటము ప్రశస్తము. భక్తియుక్తచిత్తులై యెవ్వ రీసకలపవిత్రస్థానములను దర్శించి పూజింతురో, వారికి సకలపాపనిర్ముక్తియుఁ బరమపదప్రాప్తియు లభించును. సృష్టిప్రారంభకాలమునందు పితామహుఁడు స్వయముగా సరస్వతీనది యుత్తరతీరమున మహేశ్వరునిఁ బూజించెను. అందుచే నాతఁ డచ్చటఁ జతుర్ముఖనామమున విఖ్యాతుఁ డయ్యెను. నరులు జితేంద్రియులై యుపవసించి ప్రయత్నముతో నాతనిఁ బూజించినచో, వా రొనరించిన చేయరాని పాపము లన్నియు నిర్మూలము లగుట నిశ్చయము. అనంతరము త్రేతాయుగమునందు స్థాణుదేవునిసమీపమునఁ జతుర్ముఖనామమున మఱియొకమహాలింగము పూజింపఁబడెను. శ్రద్ధతో ఆలింగము నుద్దేశించి నమస్కరించినను సర్వపాపనిర్ముక్తు లగుదురు. ఈలింగమునకు సన్నికటమునందు లీలాశంకరసంభూతమైన భానుశంకరలింగము విరాజిల్లుచున్నది. తరువాత ద్వాపరయుగమునందుఁ దనయాశ్రమమునందే యున్న శంకరుని శ్రద్ధతో నర్చించినయెడల వర్ణసంకరసంజనితములైన రాజసభావము లన్నియు విమోచనము లగును. కృష్ణచతుర్దశీదినమున మానవులు తత్పూజ గావించినచో, అభక్ష్యభక్షణజనితమైన సకలపాపములనుండియు విముక్తు లగుదురు. కలికాలమునందు మానవులు వసిష్ఠాశ్రమమునందుండి చతుర్ముఖుని స్థాపించినచో ముఖ్యసిద్ధి నొందుటకు సమర్థులగుదురు. ఆస్థలమునం దెవ్వరైన జితేంద్రియు

లును, నియతాహారులును, శ్రద్ధాయుక్తులునై మహాదేవునిఁ బూజించినచో, వారికిఁ బరమగతి లభించును. నేనిదే నీవద్ద స్థాణుతీర్థమాహాత్మ్యమును గీర్తించితిని. దీని నాకర్ణించినమానవులు సకలపాపవిర్ముక్తు లగుదురు.

## —♦ కురుక్షేత్రమాహాత్మ్యము ♦—

అనంతరము సనత్కుమారుఁ డిట్లు చెప్పం దొడంగెను—"తరువాత మహాదేవుఁ డాతీర్థశ్రేష్ఠమును జూచి—నీ విట్లు సమ్మిశ్రితభావముతోఁ బ్రవహించుచున్నహేతువుచేత భూమియందు నీకుఁ బృథూదకమనునామము గలిగి ప్రధానతీర్థముగాఁ బరిగణింపబడఁగలవు" అని చెప్పెను. నారాయణుఁడు దేవతలతో నిట్లు చెప్పను—ఓదేవతలారా! మహేశ్వరునిచే నీపృథూదకతీర్థము పవిత్రమును పాపభయవినాశమును నయ్యెను. అందుచే మీ రామహాతీర్థమున కేఁగవలయును. అక్కడ కేఁగి యాతీర్థశ్రేష్ఠమును మీ రిట్లు ప్రార్థన మొనరింపవలయునో, యది యాకర్ణింపుఁడు. సూర్యచంద్రులును బృహస్పతియు మృగశీర్షానక్షత్రమున నెప్పు డుందురో, అప్పు డాతీర్థము 'అక్షయా' నామముతో నభిహితమగును. ఓసురవరులారా! ప్రాచీనసరస్వతి యెప్పుడు ప్రవాహిత యగునో, అప్పుడు మీ రచ్చట కేఁగి భక్తిభావముతో శ్రద్ధానుష్ఠానముతోఁ బితృపురుషుల నారాధింపుఁడు. ఈరీతిగా భగవంతుఁడైన మురారి యనేకవిషయములను జెప్పెను. అది విని యింద్రప్రముఖులైన దేవతలు కురుక్షేత్రమునందలి పుణ్యతీర్థమైన పృథూదకమున కేఁగిరి. అక్కడ కేఁగి వారు స్నానముచేసి తరువాత బృహస్పతినిఁ జూచి—భగవానుఁడా! నీచే మృగశీర్షానక్షత్రము పాపహరమైన పుణ్యతిథిగాఁ బరిగణింపఁబడినది. ఇచ్చట మీరు వసించియు

న్నారు. చంద్రసూర్యులు నిచ్చట విరాజిల్లుచున్నారు. అందుచే నతి విశిష్టకాల ముపస్థితమైనది. ఓగురూ! ఈదేవకార్య మిప్పుడు నీయధీనమై యున్నది. కేవలము నీవే దీనిని సంపాదింపనగును" అని పలికిరి. దేవతలకు సురాచార్యుఁడు మగల నిట్లనియెను. "ఓదేవతలారా! నేను నక్షత్రాధిపతిని గాఁగల్గినచో మృగశీర్షానక్షత్రమునందు గమనము చేయవచ్చును" దేవతలాతనిప్రార్థనమును సమర్థించిరి. అప్పుడు బృహస్పతి మృగశీర్షానక్షత్రమును బొందెను. క్రమముగా నాషాఢ [illegible] చంద్రహయతిథి ప్రవేశించెను. ఈతిథి యందు [illegible] భ[illegible]యుక్తులై, హవిష్యభోజనులై [illegible] మధుమిశ్రితములైన తిలపిండములను [illegible]. [illegible] ప్రీ[illegible], మఱియు వారు తమ [illegible] దేవతలాకన్యను [illegible] దేవతలప్రసాదముచే మేనకను బొంది [illegible] సుఖం చుచుండెను. హిమవంతుఁడు సిద్ధకన్యలో యథేష్టవిషయభోగము లనుభవించుచుఁ దృప్తుఁడై యామెగర్భమునందుఁ బరమరూపవతులైన ముగ్గురు కన్యకలను గాంచెను. ఈకన్యకాత్రయము యథాకాలమునందు దేవతలైరి.

— { భిక్షురూపధారియైన శివునకును, ఉమాదేవికిని జరిగిన సంభాషణము. } —

అనంతరము పులస్త్యుఁ డిట్లు చెప్పఁదొడంగెను. మేనకగర్భమున గుణరూపవతులైన ముగ్గురు కన్యలును, సునాభుఁ డనునొకపుత్రుఁడు నుద్భవించిరి. మహాముని! మేనకపుత్రిక పేరు రాగిణి

ఆమె రక్తాంగి, రక్తాక్షి, రక్తాంబరవిభూషిత. రెండవపుత్రికపేరు 'కుటిల' కుటిలశుభాంగియుఁ బద్మపత్రాక్షియు; ఆమె కేశపాశము నీలకుంచితము, ఆమె శ్వేతవర్ణమాల్యాంబరధారిణి. మేనకతృతీయపుత్రికనామము 'కాళి.' కాళి యాకృతి నీలాంజననిభము, నయనములు నీలేందీవరతుల్యములు. ఆమెరూపము ఉపమాతీతము. అది యటుండనిమ్ము, ఈకన్యాత్రయము జన్మించినతరువాత ఆఱువత్సరములు నిండియు నిండనియప్పుడే తపస్సున కేఁగిరి. దేవత లప్పు డాసౌమ్యాకృతిగల కుమారీత్రయమును దర్శించిరి. ఆదిత్యులును వసువులును వారిలో శశికరసన్నిభమై ప్రకాశించుచున్న తపస్విని యైనకుటిలను బ్రహ్మలోకమునకుఁ గొనిపోయిరి. వారట్లామెను బ్రహ్మలోకమునకుఁ గొంపోయి బ్రహ్మతో "ఓపితామహా! ఈకన్య మహిమహంతయగు పుత్రునిఁ బ్రసవింపఁగలదా?" అని యడిగిరి. ఈమాటలు విని పితామహుఁ డిట్లనియెను—"ఈతపస్విని శంభునితేజమును ధరించుటకు సమర్థురాలు గాదు; ఈవరాంగిని దప్పక పరిత్యజింపుఁడు." ఈమాటలు విని కుటిల క్రుద్ధురాలై బ్రహ్మ కిట్లనియెను—భగవానుఁడా! దుర్ధరమైన శంభుతేజమును నే నెందులకు ధరింపఁజాలను, అంకులకవశ్యముగాఁ బ్రయత్నించెదను. ఓసత్తమా! వినుము. నేను దీవ్రతపస్సుచే జనార్దను నారాధించి, యెట్లు హరునిమస్తకము నవనతము గావింపఁజాలుదునో, నిశ్చయముగా నట్లు చేసెదను. ఈనామాట ధ్రువము, సత్యము."

ఇట్లు చెప్పి పులస్త్యుఁడు మరల నిట్లనియెను. "ఓమహామునీ! కుటిలవాక్యములు విని సర్వవిధాతయు భగవంతుఁడునైన బ్రహ్మయెంతయుఁ గ్రుద్ధుఁడై "ఓసీ! పాపినీ, కుటిలా! నీవు నామాటలను సహింపఁజాలకపోయితివి. ఆయపరాధముచే నాశాపమున కు నిర్ద

గ్ధురాలనై సర్వత్రి జలరూపమునఁ బరిణతి నొందుము." అని శపించెను. అంతట హిమాలయనందిని యైనకుటిల బ్రిహ్మచే నిట్లభిశప్తయై వేగవతియైన జలమయీమూర్తిని ధరించి బ్రిహ్మలోకమునంతను దముపఁజొచ్చెను. పితామహుఁ డాజలోచ్ఛ్వాసమయియైన కుటిలను జూచి ఋగ్యజుస్సామబంధనములచే నామె నచ్చట దృఢముగా బంధించియుంచెను. అప్పుడు జలమయియైన గిరికుమారి నిర్మలబ్రిహ్మలోకమును దడపుచు బ్రిహ్మ బంధించిన బంధనములచే బ్రిహ్మలోకమునందే యాబద్ధయైయుండెను. తరువాత సురగణములు హిమాలయకన్యయైన రాగిణి యను రాగవతిని గూడ బ్రిహ్మలోకమునకుఁ గొనిపోయి బ్రహ్మయెదుట నాపె నునిచిరి. బ్రహ్మ యామెనుగూడ నసమర్థురా లని చెప్పి నిరాకరించెను. అప్పుడు రాగిణి క్రుద్ధురాలై యిట్లనియెను—"నే నిట్టితపస్సుచేసి యున్నానుగదా, మహిషహంతయగుపెనొందుటకు నే నెందులకుఁ దగను?" అప్పుడు బ్రిహ్మ యామెనుగూడ శపించి యిట్లనియెను, "నీవునామాటమీఱితి, దేవతల నతిక్రమించుటకుఁ జూచితివి, అందుచే నీవు సంధ్యారాగముగాఁ బరిణమింపుము."

ఓమునిశ్రేష్ఠా! బ్రిహ్మశాపముచేఁ దత్క్షణమే యారాగిణిసంధ్యయై ప్రకాశింపఁజొచ్చెను. బ్రహ్మ యాశైలసందిసదేహమును దృఢముగాఁ గృత్తికాభాగముచేఁ బట్టియుంచెను. క్రమముగాఁ దపస్వినియైన మేనక యిది తెలిసికొనియెను. ఆమెకుమార్తెలిద్దఱు గతించిరి. అప్పుడామె మూఁడవకూతురైన కాళిని తపస్సునుండి మరలించుటకుఁ దలఁచుకొని 'ఉ-మా' యనుచు నామెను నివారించుటకుఁ బ్రియత్నించుచుండెను. అప్పటినుండియు నాకన్య మాతృకృతమైన 'ఉమా' నామముతోడనే ప్రసిద్ధ యయ్యెను. కన్యకుఁ గలిగిన యీ 'ఉమా'

వామెను తండ్రికిఁగూడఁ గన్నుఁగోచరమయ్యెను. కాని 'ఉమ' మాత్రము తపస్సునుండి యించుకయు విముఖురాలు గాలేదు. ఆమెతపోవనము నేర్పఱచుకొనియెను. అనంతర మా యుమ యంతరంగములో శూలపాణియు, దేవదేవుఁడు నైన వృషధ్వజుని జింతించుచుఁ గఠోర తపమున నిమగ్న యయ్యెను.

అంతట బ్రహ్మ దేవతలను జూచి—"మీరు హిమవంతుని తృతీయకన్యవద్ద కేఁగి యాతపస్విని నిచ్చటికిఁ దీసికొని రావలయును" అని చెప్పెను. బ్రహ్మ యనుజ్ఞచే దేవతలందఱును హిమాలయమున కేఁగి హిమవత్పుత్రిం దర్శించిరి. కాని వారామె తేజమునకుఁ బరాభూతులై యామెను సమీపింపఁజాలరైరి. ఇంద్రుఁడు బ్రహ్మాదిదేవతలతోఁగూడ సర్వులామెతేజముచేఁ బ్రతిహతులై బ్రహ్మసన్నిధికి మరలి వచ్చి హిమవత్పుత్రి తేజఃప్రకర్షమునుగూర్చి యాతని కెఱిఁగించెను. బ్రహ్మ యది యంతయు విని యిట్లనియెను—"ఆమెయే నిశ్చయముగా శంకరవల్లభ, కానిచో మీరు తేజస్వులై యుండియు నామెతేజమునందు నిస్తేజులై త్రోసివేయఁబడిరేల? ఏమైన నేమి, ఇప్పుడు మీరు నిశ్చింతులై మీమీస్థానముల కరుగుఁడు. తారకుఁడును మహిషాసురుఁడును త్వరలోనే నిహతులు కాఁగలరని మనస్సున నుంచుకొనుఁడు."

బ్రహ్మ యిట్లు చెప్పఁగానే యింద్రాదిదేవతలు నిశ్చింతులై తమతమనెలవులకుఁ దత్క్షణమే వెడలిపోయిరి. ఇఁక నిక్కడ శైలేశ్వరుఁడైన హిమవంతుఁడు భార్యాసమేతుఁడై వెడలి తపోనిరతయై యున్న యుమను దపస్సునుండి మరలించి గృహమునకుఁ దెచ్చెను. మహామతి యైన దేవదేవుఁ డప్పుడు నిరాశ్రయమైన రౌద్రవ్రతము నవలంబించి సుమేరువు మొదలగు మహాశైలములందుఁ దిరుగుచుండెను.

ఇట్లు తిరుగుచు నొకప్పు డాతఁడు శైలశ్రేష్ఠమైన హిమాలయమునకు వచ్చెను. హిమవంతుఁ డాతనికి శ్రద్ధతో నర్చనాదికములు గావించెను. ఆరాత్రి యాతఁ డక్కడనే వసించెను. మఱునాఁడు హిమవంతుఁ డాతని సమీపించి సంభ్రమములో నిట్లనియెను. "విభూ! నీవు తపస్సాధనకొఱ కిచ్చటనే వసింపవలయు నని ప్రార్థించుచున్నాను" గిరివరుఁ డిట్లు ప్రార్థింపఁగా విని హరుఁ డాతనిప్రార్థన మంగీకరించెను. అతఁ డప్పుడు తననిరాశ్రయవ్రతమును బరిత్యజించి యాశ్రమము నాశ్రయించి వసింపఁజొచ్చెను. దేవదేవుఁడైన శూలపాణి యిట్లాశ్రమస్థుఁడు కాఁగానే గిరినందిని యైన కాళి యొకమా ఱక్కడ కరుదెంచెను.

భగవంతుఁడైన హరుఁ డట్లరుదెంచిన యుమను జూచి తనప్రియురాలైన సతీదేవి మరల జన్మించిన దని తెలిసికొని స్వాగతసంభాషణపూర్వకముగా నామెను బూజించి మరల యోగచర్యారతుఁ డయ్యెను. అప్పుడు వరారోహయు భామినియు నైన కాళి కృతాంజలికములతో నభ్యాగతయై సఖీగణముతో నాతనిపాదద్వయమునకు వందనము లాచరించెను. తరువాతఁ జాలసేపటివఱకు శంకరుఁడు గిరినందినివంక దృష్టి సారించియుండెను. "ఈపని యుక్తమైనది కాదు" అని పలుకుచు నాతఁ డంతర్హితుఁడై పోయెను. పార్వతి యప్పుడు హరుని యీకఠోరవాక్యమును విని దుఃఖావేగమును బొందిన దయ్యెను. తరువాత నామె మనస్సులో నుదాసీనురాలై తండ్రిదగ్గఱి కేఁగి యిట్లనియెను. తండ్రీ! నేను తీవ్రతప స్సాచరించుటకు మహారణ్యమునకుఁ బోవలయును. అక్కడ కేఁగి పినాకపాణియు, దేవదేవుఁడు నైన శంకరు నారాధింతు నిదే నాయుద్దేశము"— తండ్రియైన హిమవంతుఁడు కూఁతుప్రస్తావమునకు సమ్మతించెను.

అప్పుడు పార్వతి 'లలిత' యనునామము ధరించుకొని హిమాలయముయొక్క విశాలపాదదేశమునందు మహేశ్వరారాధనకొఱకుఁ దప మాచరింపఁజొచ్చెను. అప్పు డామెసఖీబృందము తపస్విని యైన యామెపరిచర్యకొఱకు నియుక్తులైరి. ఫలమూలములు, సమిత్కుశలు మొదలగువాని నన్నిటిని వారు సంపాదించిపెట్టుచుండిరి. పార్వతి తనచిత్తవినోదనముకొఱకు మంటితో నొకశూలపాణియైన రుద్రమూర్తిని నిర్మించుకొని "యిదియే యథార్థతేజస్వియైన నాశూలపాణి యగు" నని చెప్పుచు నిత్యము నారుద్రమూర్తికిఁ బూజ లొనర్చుచు, మాటిమాటికి నాతని దర్శించుచు నుండెను. తరువాతఁ బార్వతిశ్రద్ధఁ జూచి త్రిపురారి సంతుష్టుఁ డయ్యెను. ఆతఁడు పలాశదండము, ముంజమేఖల, యజ్ఞోపవీతము, ఛత్రము, మృగాజినము, కమండలువు మొదలగునవి ధరించి, భస్మభూషితదేహుఁడై వటువేషధారియై సకలాశ్రమములం దిరుగుచుఁ దుదకుఁ బార్వతియాశ్రమమున కేఁగుదెంచెను. ఓనారదా! అప్పుడు కాళి సఖిగణముతో నభ్యుత్థానముచేసి, యభివాదనాదులచే నాతని సన్మానించి యథారీతినిజిజ్ఞాసగావించెను—"భిక్షూ! నీ వెక్కడనుండి యరుదెంచితివి, నీయాశ్రమ మెక్కడ? నీ వెక్కడ కేఁగుచున్నావు! అన్నియు సత్వరముగా నెఱింగింపుము" అది విని యాతఁ డిట్లుత్తర మిచ్చెను—వ్రతవ్రతయైన యోబాలికా! నాయాశ్రమము కాశీధామమునఁగలదు. నేను దీర్ఘపర్యటనముగావించుచుఁ బృథూదకమున కేఁగఁగలను. ఉమ మరల నిట్లనియెను. "ఓభిక్షూ! నీ విప్పు డేఁగఁదలఁచుకొనిన పృథూదకమున కేఁగుటవలన నేపుణ్యము లభించును? మఱియు మార్గమధ్యమునం దేయేతీర్థములలో స్నాన మాచరించితివి, వానివానిఫలము లెట్టివి?" భిక్షు విట్లనియెను—నే నన్నిటికంటెను ముందు ప్రయాగతీర్థమునందు స్నాన

ముచేసితిని; ఆతరువాత కుంజామ్రి, జయంత, చండికేశ్వర, బంధు
బృంద, కర్కంధ, కనఖల, సరస్వతీ, అగ్నికుండ, భద్రా, త్రివిష్టప,
కౌనట, కోటితీర్థ, తపుక మొదలగుతీర్థము లన్నిటికి యథాక్రమముగా
నేఁగి స్నానములు గావించితిని; తరువాత నిప్పుడు నీయాశ్రమమునకు
వచ్చితిని; ఇచ్చట నీతో సంభాషించి తరువాతఁబృథూదకమున కేఁగె
దను. అది యటుండ నిమ్ము, నే నిప్పుడు నిన్నడుగుప్రశ్నలకుఁ గోపిం
పకుము. ఓకృశోదరీ! నీవు తపస్సువలన దేహమును గృశింపఁజేయు
చున్నట్లగపడుచున్నావు, ఇది మాపక్షమున నవశ్యకర్తవ్యము. ఏమ
న? ద్విజాతివర్గమునకు బాల్యమునుండియు సంయమము లగుట శ్లాఘనీ
యము. కాని యోభీరురాలా! నీ వీప్రథమవయసునందే పదార్పణము
గావించి యెందుకొఱకు తప స్సాచరించుచున్నావో, ఈవిషయమున
నాకొక విశేషసందేహము గలిగినది. ఓవిలాసినీ! స్త్రీజనమునకుఁ బ్ర
థమవయసు భర్తతో వివిధభోగసుఖము లనుభవించుటయందే కడవ
నగును. నీవందులకు విపరీతముగాఁ గనఁబడుచున్నావు. ఇదిగాక
లోకములో నెల్లరును, సౌందర్యము, ఆభిజాత్యము, ఐశ్వర్యము మున్న
గువానినే యాకాంక్షించి తపస్సుచేయుట కనఁబడుచున్నది. కాని
గిరీంద్రనందినీ! నీకు వీనిలో నొకటియు నించుకయుఁ గొదవగావు,
అన్నియు సంపూర్ణములుగా నున్నవి. ఇఁక నీ వెందుల కలంకారము
లను ద్యజించి జటాధారణ మొనరించితివో, చీనాంబరములను ద్రోసి
పుచ్చి వల్కలములఁ దాల్చితివో?"

అప్పుడు పార్వతికి సఖియు, సోమప్రభ యనునామము గల
దియు, తపఃప్రవీణురాలునైన యొక్కర్తు భిక్షువునకు యథాక్రమమున
నుత్తర మిచ్చుట కుద్యుక్తురా లయ్యెను. సోమప్రభ యిట్లనియెను—
"ఓద్విజశ్రేష్ఠా! పార్వతితప స్సాచరించుటకుఁ గారణ మేమో యాత

క్షింపుము. అధికముగాఁ జెప్పనేల? ఈమహాకాళి హరునిఁ బతిగాఁ బొందఁగోరి తప మాచరించుచున్నది." అప్పుడు సోమప్రభ మాటలు విని భిక్షువైన శంకరుఁడు తనమస్తకము కంపించునట్లుగాఁ బెద్దనవ్వు నవ్వుచు నిట్లు పలికెను. "అట్లయినఁ బార్వతీ! నేను నిన్నడుగుచున్నాను!—ఈబుద్ధి నీ కెవ్వరు గఱపిరి? చూడుము, పల్లవపేలవములైన యీనీకరములు, భుజంగసంగతములైన హరునికరములతో నెట్లు సమ్మిళితములు గాఁగలవు? నీవు దుకూలాంబరధారణయోగ్యురాలవు, మహాదేవుఁడు మృగచర్మధారి; నీవు చందనచర్చితవు, మహాదేవుఁడు భస్మభూషితుఁడు; నిజముగా నిట్టియఘటనఘటన మెప్పుడును సమీచీనము గాదు.

ఓవిప్రోత్తమా! భిక్షు విట్లు పలుకఁగానే పార్వతి యాతని కిట్లనియెను—ఓభిక్షూ! నీ విట్లు పలుకవలదు; వాస్తవముగా హరుఁడు సర్వగుణగరిష్ఠుఁడు. అట్లుగాక, అతఁడు శివుఁడైనను భీముఁడైనను గానిమ్ము, సధనుఁడైనను నిర్ధనుఁడైనను గానిమ్ము, భూషితుఁడైనను అభూషితుఁడైనను గానిమ్ము, ఎట్లయిన నాతని యిష్టానుసారముగానే యుండనిమ్ము, అతఁడే నానాథుఁడు." "సఖీ! నిజముగా నీ వీపుంశ్చలవర్తుఁడైన భిక్షువును నివారింపుము. ఓసోమప్రభా! నిందించువారి కంటెను వినువా రధికపాపము నొందుచున్నారు" పులస్త్యుఁడు చెప్పుచున్నాఁడు—వరదా! హిమవద్దుహిత యిట్లు చెప్పి యచ్చటనుండి లేచెను; అప్పుడు హరుఁ డాభిక్షురూపమును బరిత్యజించి స్వకీయమైన శివరూపమును ధరించి యిట్లు పలికెను.

"ప్రియురా! నీపితృభవనమున కేఁగుము. నిన్నుఁ గోరుటకొఱకు నేను హిమాగ్రహమునకు మహర్షుల నంపెదను. నీ విక్కడ మంటితో నిర్మించిన యీ భద్రేశ్వరలింగము జగత్తునందు భద్రేశ్వరనామముతోనే

ప్రసిద్ధము గాఁగలదు. దేవతలు, దానవులు, గంధర్వులు, యక్షులుఁ, గింపురుషులు, ఉరగులు, సర్వదా దీనిని బూజించుచుందురు. మానవులును శుభాకాంక్షులై దీని నర్చించుచుందురు." గిరినందిని దేవదేవునిచే నిట్లభిహితయై యంబరపథమునఁ బితృగృహమునకు వెడలెను. మహాతేజుఁడైన శంకరుఁడును గిరికన్యను విడిచి పృథూదకమున కేఁగి యథావిధిగా స్నానముచేసెను. అనంతరము దేవదేవుఁడు పృథూదకస్నానముచే నిష్పాపుఁడై, గణాధ్యక్షుని, నందిని, దక్షిణప్రమథగణమును గూడుకొని మందరాచలమునకు వచ్చి విడిసెను. మహాదేవుఁడు ప్రమథగణముతో మందరపర్వతమునకు రాఁగానే గిరివరుఁడైన మందరుఁ డత్యంతపులకితుఁడై పోయెను. తరువాత నాతఁడు దివ్యదివ్యకందమూలఫలజలాదులచేఁ ద్రిలోచనుని, నాతని ప్రమథగణములను, ఆతనివాహనము నర్చించెను.

## —♦ శివునికొఱకుఁగన్యనిమ్మనిదేవతలుహిమాద్రినిబ్రార్థించుట ♦—

పులస్త్యుఁడు మరల నిట్లు చెప్పుచున్నాఁడు,—తరువాత రుద్రదేవుఁడు మందరాద్రిచే సంపూజితుఁడై ప్రీతుఁ డయ్యెను, అప్పు డాతఁడు అరుంధతిని మహర్షులను స్మరించెను. మహాత్ముఁడైన శంకరుఁడు స్మరించినంతనే ఋషులు సుందరకందరశోభితమైన మందరాచలమునకు వచ్చిచేరిరి. దేవదేవుఁడైన త్రిపురారి వారిని జూచి ప్రత్యుత్థాన మొనరించి యథాపూజనము గావించి యిట్లనియెను, "ఇప్పు డీపర్వతవరుని కన్య శ్లాఘ్యయు, సర్వదేవసంపూజ్యయు నై యున్నది. విశేషించి మీపాదపంకజస్పర్శచే నేఁడీపర్వతరాజు నిష్పాపుఁ డయ్యెను. అది యట్లుంచి మీ రీసుందరమును, సువిశాలమును, సమతటము నైన యీ

కొండనెత్తమునందు, పద్మవర్ణమును మృదువును నగు నీశిలాపటము నందుఁ గూరుచుండుఁడు."

శంకరదేవుఁ డిట్లు పలుకఁగానే సమవేతులైన యాఋషు లంద ఱు నరుంధతితోఁగూడ శైలసానువునందుఁ గూరుచుండిరి. ఋషు లందఱుఁ గూరుచుండఁగానే, గణాధ్యక్షుఁడైననంది వారి కర్ఘ్యపాద్యా దులచేఁ బూజసల్పి సంయతభావముతో నొక్కెడ నిలుచుండెను. తరువాత దేవదేవుఁడు, వినీతులై యున్నసురలను సప్తర్షులకును నిజ కీర్తివృద్ధికొఱకు ధర్మసంగతములైన హితవాక్యము లిట్లు చెప్పఁదొడఁ గెను. "ఓకశ్యప, అత్రి, వసిష్ఠ, విశ్వామిత్ర, గౌతమ, భరద్వాజ, అంగిరసులారా! మీ రెల్లరు నాకర్ణింపుఁడు! పూర్వము దక్షునందినియై నసతి నాప్రియపత్నియైయుండెను. ఆమె దక్షునియెడలఁ గలిగినరోష ముచే యోగమార్గమునఁ బ్రాణత్యాగము గావించెను. ఇప్పు డాసతి మరల శైలేశ్వరునకు తనయయై యుమానామమున జన్మించెను. అం దుచే నోద్విజసత్తములారా! మీరు నానిమిత్తము శైలేంద్రునివద్ద నుండి యుమాయమను బ్రార్థించి తేవలెను."—హరునియనుజ్ఞకు సప్తర్షు లందఱు నేకగ్రీవముగా నంగీకరించి "ఓంనమః శంకరాయ" అనువా క్యము నుచ్చరించి హిమాలయాభిముఖులై బయలుదేఱిరి. తరువాత శంభుఁ డరుంధతినిగూడ నచ్చటి కేఁగు మని కోరి యిట్లు చెప్పఁదొడఁ గెను. "ఓసుందరీ! నీవును హిమాలయమున కేఁగుము; ఏలన? పు రంధ్రీమణులే పురంధ్రీమణుల ధర్మరక్షణకు సహాయ లని తెలియఁబ డుచున్నది." శంకరుఁ డిట్లు పలుకఁగా నరుంధతి యాతనిమాట మీ ఱఁజాలక లోకాచారప్రకారము తనభర్తతోఁగూడఁ బయలుదేఱి "నమస్తేరుద్ర" యని పల్కి వెడలెను. వారప్పుడు ఓషధిప్రస్థమును పేరుగల హిమాలయశృంగమున కేఁగి పురందరపురీతుల్యమైన శైల

రాజు సుందరపురమును జూడఁజొచ్చిరి. తరువాత శైలేంద్రుని సుంద రీబృందము లాదరముతో వారి నెదుర్కొనిరి. శైలరాజసుతుఁడైన సునాభుఁడు మొదలగు గొప్పవారుఁగూడ భక్తిశ్రద్ధలతో వారికి మర్యాద లొనరించిరి. తరువాతఁ, దపోధౌతకల్మషులును మహాత్ములునైన మహర్షులు గంధర్వ, యక్ష, కిన్నర, ప్రభృతులు తమ్ముఁ జూచి రా నగాధరాజు కనకోజ్జ్వలరమ్యభవనమునఁ బ్రవేశించిరి. తరువాత వారు పరిశస్తమైన పురద్వారమువద్ద కేఁగి దౌవారికుల యనుమతిని బ్రతీక్షించుచుండిరి. తరువాత గంధమాదనగిరి ద్వారరక్షకవేషముతోఁ గరమున నొక పద్మరాగమయమైన పెద్దదండమును ధరించి తొందరతో నచ్చటికి వచ్చెను. అప్పుడు ఋషు లాతనిఁ జూచి యిట్లనిరి— ఓదౌవారికా! మాకు విశేషకార్య మొకటి గలిగి యిచ్చటికి వచ్చితిమి కావున నీవు గిరిరాజు సన్నిధి కేఁగి, పెక్కురు మహర్షులువచ్చియున్నారని చెప్పవలయును. ఋషులిట్లు చెప్పఁగానే గంధమాదనగిరివరుఁడు బయలుదేరి యనేకముఖ్యపర్వతములచేఁ బరివృతుఁడై యున్న హిమవద్గిరీంద్రునిసన్నిధి కేఁగి, తనహస్తములోని దండమును ముందేతివంకకుఁ ద్రోసి జానువులపై కొఱగి కూరుచుండి— "ఓశైలరాజా! మీ ప్రాంగణప్రదేశమునందుఁ గొందఱు మహర్షులు నిలిచి యున్నారు. వారి కేదియో విశేషప్రయోజనము గలదఁట. వారు మీదర్శనము నభిలషించుచున్నారు" అని మనవిచేసెను. పులస్త్యుఁడు చెప్పుచున్నాడు, గిరిరాజు దౌవారికునిమాటలు వినినంతనే స్వయముగా నర్ఘ్యమును జేతఁ బుచ్చుకొని ససంభ్రముఁడై ద్వారమువద్ద కేఁగెను, తరువాత గిరిరాజు ఋషిశ్రేష్ఠుల నర్ఘ్యపాద్యాదులచే నర్చించి సభాస్థలమునకుఁ దెచ్చి యథాయోగ్యములగు పీఠములపైఁ గూరుచుండఁబెట్టెను. వారట్లుపవిష్టులు గాఁగానే, వాక్యజ్ఞుఁడైన గిరీంద్రుఁడు వారిని జూ

చి యిట్లు పలికెను, ‹‹ ఓహో! నేఁడేమి! మేఘసంచారము లేకయే వర్షముగలిగినది. కుసుమోద్గమము గాకయే ఫలనిష్పత్తి ఘటిల్లినది! వాస్తవముగా నేఁడు మీయాగమన మత్యాశ్చర్యము, నచింత్యము నై యున్నది. ఓసత్తములారా! నే నిప్పుడు యథార్థముగా ధన్యుఁడ నైతిని, శైలరాజనామము నాకు సార్థక మాయెను. మీరు నాగృహ ప్రాంగణమున కరుదెంచుటచే నాదేహము నేఁడు పవిత్ర మయ్యెను. ఓద్విజేంద్రులారా! అనన్యసంస్పర్శలేని నాగృహాంగణమును మీ దృష్టిపాతముచేతను, మీపాదస్పర్శచేతను మీరు సాక్షాత్తీర్థములవలెఁ బవిత్రముఁ గావించిరి. ఓవిప్రేంద్రులారా! నేను మీదాసుఁడను; వాస్తవముగా మీరేప్రయోజనమునకై కరుదెంచియున్నారో, ఆప్రయోజనభారమును దీర్ప నాకాజ్ఞాపింపుఁడు. నేను దారాపత్యభృత్యులతో మీయాజ్ఞ నెఱవేర్చుచు మీకుఁ గింకరుఁడనై యుంటిని, ఏమి యాజ్ఞాపింతురో యాజ్ఞాపింపుఁడు. ”

శైలరాజేంద్రునిపలుకు లాలకించి తీక్ష్ణవ్రతులైన ఋషులు తమవచ్చిన ప్రయోజనమును హిమవంతునకు దెలియఁజేయు మని వృద్ధుఁడైన యంగిరుని గోరిరి. కశ్యపాదిఋషులప్రేరణచే నంగిరుఁడు గిరిరాజుతో నిట్లు పలుకఁదొడఁగెను—‹‹ పర్వతశ్రేష్ఠా! మే మరుంధతితోఁగూడ నీగృహమున కేఁగుదెంచిన కార్యమును గూర్చి వినుము. దక్షయజ్ఞధ్వంసి యెవ్వరో, శూలకపాలపాణియుఁ ద్రినయనుఁడు నైనవాఁ డెవ్వరో, శంకరుఁడు శర్వుఁడు వృషవాహనుఁడు నైనవాఁ డెవ్వరో, జీమూతకేతుఁడు శత్రుఘ్నుఁడు యజ్ఞభోజి స్వయంప్రభు నైనవాఁ డెవ్వరో, ఈశ్వరుఁడు, స్థాణుఁడు, హరుఁడు, భీముఁడు, నుగ్రుఁడు, మహేశ్వరుఁడు, మహాదేవుఁడు, పశుపతి మొదలగునామముల చేఁ బ్రసిద్ధుఁడగుచున్నవాఁ డెవ్వఁడో యాతనికర్తృత్వముచేతనే మేమో

గిరీంద్రా! భవన్నికటమున కేతెంచితిమి. భవత్కన్యయగు దివ్యలోక సుందరియును నైన కాళిని దేవదేవునికొఱకు బ్రార్థించుచుంటిమి, అందుచేత భవత్తనయకన్యయైన కాళిని శివునకు సమర్పించుట నీకుఁ గర్తవ్యమై యున్నది. ఓ హిమగిరిరాజ! ఎవ్వనిపుత్రిక రూపాభిజాత్యసంపత్తి బలముచే నట్టిసుభగపతికిఁ బ్రియురాలని గాఁగల్గుచున్నదో యామెజనకుఁ డే ధన్యుఁ డని మే మనుకొనుచున్నాము. ఓశైలాధిపా! హరుఁడే నాల్గువిధము లైన భూతములకును దండ్రి యని నిరూపింపఁబడెను. వాస్తవముగా నీకాళి వారికి జనని కాఁగలదు. దేవత లెల్లరు ముందుగా శంకరునకు నమస్కరించి తరువాత నీతనయకు నమస్కరించుచుందురు. నీవు శత్రువుల మస్తకములపై భస్మభూషితపాదవిన్యాసము చేయుము. మేము యాచకులము, దేవదేవుఁడు స్వయముగా వరుఁడు, నీవు దాతవు, సర్వజగజ్జననిస్తుల యీయుమాదేవి వధువు, వాస్తవముగా నీకు సకలమును శుభము."

పులస్త్యుఁడు చెప్పుచున్నాఁడు—అంగిరుని యీప్రస్తావము విని హిమవత్పుత్రియును కాళి తలవంచుకొనియెను. మొట్టమొదట నామె యంతరంగమునందు హర్షము ఉదయించెను, కాని తరువాత దైన్యము గలిగెను. అనంతరము శైలరాజైనహిమవంతుఁడు గంధమాదనుని జూచి యిట్లాజ్ఞాపించెను. "గంధమాదనా! నీవు సత్వరముగాఁ బ్రత్యేకప్రత్యేకము గిరివరులనికేతనముల కేఁగి మేరువు మొదలగు సమస్తశైలశ్రేష్ఠముల నాహ్వానించుకొని రమ్ము" పిమ్మట పిలువఁబడిన గిరివరు లందఱును గార్యగౌరవము నెఱింగినవారై శీఘ్రముగా శైలరాజుగృహమున కరుదెంచి విస్మితచిత్తములతోఁ గనకసింహాసనములయందాసీనులైరి. ఉదయ, హేమకూట, రమ్యక, మందర, ఉద్దాలక, వారుణ, వరాహ, గరుడాసన, శుక్తిమంత, వేగసాను, దృఢశృంగ,

శృంగవంత, చిత్రకూటాదిపర్వతవరములును, అవిగాక తక్కిన చిన్న చిన్నపర్వతములును, నాసభయందుఁ బ్రవేశించి యచ్చటిఋషిబృందమునకు నమస్కరించి కూరుచుండెను. తరువాత గిరిరాజు తనభార్యయైన మేనక నక్కడకుఁ బిలిచి యిట్లనెను. "కళ్యాణీ! నీవు సపుత్రికముగా నిచ్చటికి రమ్ము" అప్పుడు తపస్వినియైన మేనక యచ్చటిమునీశ్వరుల చరణములకు వందనము లాచరించి జ్ఞాతివర్గముతో సంభాషించి పుత్రిసహితముగా నచ్చటి కరుదెంచెను. ఓనారదా! తరువాత శైలము లన్నియు నుచితస్థలములయం దుపవిష్టములై యుండఁగా వాక్యాభిజ్ఞుఁడైన శైలరాజు సమాదరపూర్వకమైన మధురస్వరముతో నక్కడివా రందఱకు నిట్లనియెను. "పుణ్యదర్శనులైన యీసప్తర్షులు మత్కన్యను మహేశ్వరునినిమిత్తమై యడుగుచున్నారు. నే నీసంగతి మీయందఱకును దెలియఁజేయుచున్నాను. మీరు నాకు జ్ఞాతివర్గము వారు, అందుచేత నీసందర్భములో నాకర్తవ్య మేమో మీరు నాకెఱిఁగింపుఁడు. ఏమన, మీయిష్టానిష్టముల నుపేక్షించి నే నెవ్వరికిని గన్యాదానముచేయరాదు, కనుక నీసంబంధమై మీమీయుద్దేశములను యుక్తియుక్తముగా వెల్లడింపుడు."

హిమాద్రిమాటలు విని మేరుప్రభృతిశైలగణ మంతయు నేకగ్రీవముగా నిట్లు పలికెను. "మునివరులు యాచకులు, వరుఁడు స్వయముగాఁద్రిపురహరుఁడైన హరుఁడు; వాస్తవముగా నిఁక నీసంబంధమందు మతభేదము లెట్లుండును? మీ రీపాత్రునకుఁ గన్యాదానముఁ జేయఁదగినవారు. అల్లుఁడు మనయందఱకు నిష్టుఁడైనవాఁడు" అనసమయమునందు మేనక తనభర్తను సంబోధించి యిట్లు పలికెను. "శైలేంద్రా! నావిన్నప మాలకింపుము! ఇటు చూడుము! పితృగణమానసకన్యను దేవదేవునకు సంప్రదానము గావించుటకొఱకే నా కొసం

గియున్నారు. భూతపతి యీకన్యగర్భమునందుఁ గాంచినపుత్రుని హస్తమునందే మహిషుఁడు, తారకుఁడు, మొదలగుదానవులు, నిహతులు గాఁగలరు" అని మేనక చెప్పఁగా విని శైలేంద్రుఁడు తనకూతుం జూచి "వత్సా! నే నిప్పుడు నిన్ను శంభున కొసంగుచున్నాను" అని చెప్పి, తరువాత ఋషులను జూచి "ఓతపోధనులారా! నాకన్యయైన యీకాళి శంకరునకు వధు వగుటకు భక్తివినమ్రుఁడనై మీకుఁ బ్రణామము లాచరించుచున్నాను" అని పలికెను. అప్పు డరుంధతి లజ్జాశీలయైన కాళిని దనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని శివనామాంచితములైన మధురసంభాషణములచే నూఱడించెను. తరువాత సప్తర్షులు— "ఓశైలరాజా! వినుము, జామిత్రగుణయుక్తమైన పుణ్యతిథి వివాహమునకు సులగ్నము. రాఁగలతృతీయదివసమునఁ జంద్రుఁ డుత్తరఫల్గునీనక్షత్రమునకు రాఁగలఁడు. అది మిత్రనామకముహూర్త మని చెప్పఁబడినది. ఆతిథియందు భగవానుఁడైన హరుఁడు మంత్రోచ్చారణపూర్వకముగా నీకన్యను పాణిగ్రహణము చేయఁగలఁడు. మేము వివాహమునకు శుభదినము స్థిరపఱచినాము. కనుక మా కనుజ్ఞ యొసఁగుము. మేము మావద్దనెలవుల కేఁగవలయును." అని పలికిరి. అనంతరము శైలరాజు మునిపుంగవులను మధురఫలకందమూలాదులచే సత్కరించి, వినీతభావముతో సాగనంపెను. మునీంద్రులును సత్వరముగా నచ్చోటు విడిచి మందరాభిముఖులై బయలుదేరిరి. తరువాత వారు త్వరలోనే మందరభూధరమున కేఁగి మరల శంకరుని సందర్శించిరి. ఋషులు మహేశ్వరున కప్పుడు ప్రణిపాతము లొనరించి యిట్లు పలికిరి. "భగవానుఁడా! నీవే శైలరాజనందినికి భర్తవైతివి; బ్రహ్మాదిత్రైలోక్యవాసు లందఱును, ఈవివాహశుభము నవలోకింపఁగలరు"

అనంతరము మహేశ్వరుఁడైన హరుఁడు ఋషులవలుకులు విని యరుంధతీసహితముగా ఋషుల నందఱను యథాక్రమముగా యథావిధిగా సత్కరించెను. ఋషులు హరునివలనఁ బూజితులై సురగణములను వెంబడి కాహ్వానముచేయుపనిమీఁద వెడలిపోయిరి. బ్రహ్మ, విష్ణుఁడు, ఇంద్రుఁడు, భాస్కరుఁడు మొదలగుదేవతలు హరునిదర్శనమున కేతెంచిరి. వారప్పుడు మహేశ్వరుసన్నిధి కరుదెంచి యాతనికిఁ బ్రణామము లొనరించి కూరుచుండిరి. అప్పుడు హరుఁడు నంది మొదలగు గణాధ్యక్షగణమును సంస్మరించెను. తక్షణమే వారును వచ్చి హరుని పాదములకు వందనములు గావించుకొని కూరుచుండిరి. విక్షిప్తజటాజూటుఁడైన మహాదేవుఁ డప్పుడు, అరణ్యమునందు శాలకదంబాదివృక్షపరివృతమైన ప్రరోహమూలముగల మహావనస్పతివలె, దేవగణముచేతను బ్రమథగణముచేతను బరివృతుఁడై పరిశోభితుఁడు గాఁ జొచ్చెను.

—♦ గౌరీకళ్యాణము ♦—

పులస్త్యుఁడు చెప్పుచున్నాఁడు—ఓమునీంద్రా! అట్లరుదెంచిన సురగణమును జూచి నందీశ్వరుఁడు వారందఱితోడను యథాయోగ్యముగా సంభాషించెను. భగవానుఁడైన శంకరుఁడు ప్రత్యుత్థానపూర్వకముగా హరి నాలింగనము చేసికొని, బ్రహ్మకు నమస్కరించి, శతక్రతుని సంభావించి, తక్కినదేవతలను యథాయోగ్యముగాఁ బూజించెను. ఈసమయమున వీరభద్రుఁడు మొదలగు బ్రమథగణము, శైవగణము, పాశుపతగణము, నందఱు శంకరునకు జయశబ్దములు చేయుచు మండలాదిగ్ కరుగుదెంచిరి. తరువాత భగవానుఁడైన శంకరుఁడు వివాహవిధిఁ గొనసాగించుటకు దేవగణముతోడను బ్రమథగ

ణముతోడను మందరాచలమునుండి కైలాసశైలమున కేఁగెను. ఆచ్చట దేవమాతయైన యదితియు సుందరియైన సురభి, సురమాప్రభృతిరమణీగణమును నేకాగ్రచిత్తములతో మహాదేవునివైవాహికమండనక్రియలు నిర్వహించుచుండిరి. అప్పుడు మహాదేవునిమస్తకము మహానాగావేష్టిత మయ్యెను. లలాటము రమ్యరోచనతిలకాంకిత మయ్యెను. అతఁ డప్పుడు సింహాజినమును బరిధానముగా ధరించెను. అతినీలవర్ణమునైన భుజంగము లాతనిదేహమునందుఁ గుండలాకారముగా శోభిల్లుచుండెను. మహాసర్పము లన్నియు నాతనికి రశ్న, వలయ, హార, కేయూర, నూపురస్థానములయం దధికారములు చేయుచుండెను. మస్తకమునందు సమున్నతజాటముతో శోభిల్లుచుండెను. మహాదేవుఁడు నందివాహనము నధిరోహించెను. ఆతనిముందు ప్రమథగణములవారు తమతమవాహనముల నధిరోహించి నడువఁబోచ్చిరి. హుతాశనుఁడు మొదలగుదేవతలు, ఆతనిపార్శ్వములయందు నడువఁజొచ్చిరి. దేవదేవుఁడైన జనార్దనుఁడు లక్ష్మితో గరుడవాహనమును బితామహుఁడు సరస్వతితో హంసవాహనమును నధిరోహించి శంకరునిపార్శ్వభాగములందు బ్రయాణముసేయుచుండిరి. సహస్రాక్షుఁడైన దేవేంద్రుఁడు శచీదేవితో నైరావతము నెక్కి సువిశాలమైన తెల్లగొడుగును శ్వేతవర్ణఛత్రమును జేఁబూని సరిద్వరయైనయమున కచ్ఛపము నారోహించి వెంటఁగాఁ బ్రయాణముచేయుచుండెను. సరిచ్ఛ్రేష్ఠయైన సరస్వతి గజారోహయై హంసకుందేందునిభమైన వాలవ్యజనమును గరమునఁ దాల్చి ప్రయాణముచేయుచుండెను. కామచారులైన షడృతువులు మహేశ్వరునికొఱకుఁ బంచవర్ణపుష్పములను బట్టుకొని నడచుచుండిరి. వేగవంతమైన పృథూదకము, ఐరావతప్రతిమానమైన గజము నారోహించి యనులేపనములను జేతఁ బట్టికొని ప్రయాణముసేయుచుం

డెను. తుంబురుఁడు మొదలగు గంధర్వులు మధురస్వరముతో గాన మొనరించుచును, కిన్నరులు వాద్యములు వాయించుచును మహాదేవుని వెనువెంట నరుగుచుండిరి. అప్సరోగణము నృత్యములు సేయుచుండెను. మునిగణము స్తోత్రము లొనరించుచుండెను. గంధర్వులందఱును శూలపాణియైన త్రిలోచనుని పార్శ్వభాగముల వెంట నడచుచుండిరి, వీరుగాక ఏకాదశకోటిరుద్రులును, ద్వాదశకోటిఆదిత్యులును, అష్టకోటివసువులును, సప్తషష్టికోటిప్రమథులును, చతుర్వింశకోటి ఊర్ధ్వరేతులైన ఋషులును మహాదేవునితో నడచుచుండిరి. మఱియు నసంఖ్యరాక్షస కిన్నర యక్షగణములును హరవివాహమునకు భక్తిశ్రద్ధలతో హరు వెన్నంటి నడచుచుండిరి.

ఇట్లేఁగుచు నత్యల్పకాలములోనే దేవదేవుఁడు భూధరాధిపుని తలప్రదేశమును సమీపించెను. అప్పుడు సకలశైలములును కుంజరముల నెక్కి నాల్గుదిక్కులనుండియు వచ్చి వారికిఁ బ్రత్యుద్గతులైరి. అనంతరము భగవానుఁడైన త్రిలోచనుఁడు శైలాధిపతికి నమస్కరించెను. శైలగణము ఈశానునిపాదములకుఁ బ్రణామము లొనరించెను. అప్పుడు వృషనికేతనుఁడైన హరుఁడు వ్యాఘ్రచర్ముఁడై సురగణముతోను దక్కినపార్షదగణముతోను శైలాధీశ్వరుని ప్రశస్తపురమును బ్రవేశించెను. నందీశ్వరుఁడు మార్గమును జెప్పుచు ముందు నడచుచుండెను. జీమూతకేతుఁడైన మహాదేవుఁడు వచ్చె నని విని యా పురమునందలి రమణీమణులు తమతమపనులను బరిత్యజించి యాతని దర్శనముకొఱకు సక్తాత్మలైరి. ఒకానొకకామినీమణి యొకచేతితోఁ బూలదండయు రెండవచేతితోఁ కేశపాశమును బట్టుకొని శంకరుని కెదురుఁగాఁ బరువిడఁజొచ్చెను. ఇంకొకతరుణీమణి యొకపాదమునకు మాత్రమే లత్తుక నలందుకొని రెండవపాదమునకు లత్తుక నలంకరించు

కొనకయే వ్యాఘ్రభావముతో శంకరదర్శనోత్సుకయై పరువెత్తఁజొచ్చె
ను. ఇంకొకసుందరి యొకకంటికిఁ గాటుకధరించికొని, యింతలో శంక
రునిరాక విని రెండవకంటి కంజనమిడకయే అంజనశలాకాహస్తము
తోఁ బరుగెత్తెను. మఱియొకభామిని శంకరదర్శనోత్సాహముతోఁ ద
నపరిధానమును దారుమారుగా ధరించుకొని పరువెత్తెను. ఈవిధము
గా శంకరుఁడు పురపురంధ్రీమణులను సంభ్రమసంక్షోభితమానసలను
గావించుచు దివ్యవృషారోహణుఁడై యత్తవారింటికిఁ దరలెను.

శంభుఁ డట్లు శైలరాజేంద్రునిభవనమునఁ బ్రవేశింపఁగానే
యచ్చటియబల లాతనిఁ జూచి యిట్లనిరి, "అంబిక చేసినకఠోరతప
మంతయు సఫలమే యైనది—ఓహో! దేవదేవుఁడైన శంభుఁ డిప్పు
డామెకు భర్త యయ్యెను. కుసుమాయుధుఁడైన కందర్పునిదేహమును
భస్మముగావించిన క్రతుధ్వంసి, దక్షారాతి, భగనేత్రుఁడు, హరుఁడు,
పినాకపాణి యిటే వచ్చియున్నాఁడు! ఓవ్యాఘ్రచర్మాంబర శూలపాణీ!
శంకరా! నీకు మరల మరల నమస్కారములు. నీవు పార్వతీప్రాణవ
ల్లభుఁడవు, నీకు మహాహిరూపములైన హారకుండలాదు లలంకారము
లు, నీకు నమస్కరించుచున్నాము." పురాంగన లిట్లు శంకరుని స్తుతి
ముచేయుచుండఁగా, సురపతి యాతనిమస్తకముపై ఛత్ర
మును బట్టెను. సపక్షసిద్ధగణ మాతని నభివాదనము లొసంగుచు
చుండిరి. అతివిహస్తములైయుండు భుజ[illegible]
నంను సుచారుశస్త్రపదములును [illegible], బ్ర[illegible]
చిత్తముతో నాతపముందును విష్ణు వాతనితోడను నుండిరి. ఆతఁ డ
ప్పుడు మంగళాగ్నులచేఁ బరీతమైన వివాహవేదిక నధిరోహించెను.
త్రిపురహంతయైన మహాదేవుఁడు మహర్షిగణముతోను, పారిషదవర్గము
తోను బరివృతుఁడై గిరిరాజుమందిరము నిట్లలంకరింపఁగానే యచ్చ

టి వారు అందఱు వ్యగ్రచిత్తులై కన్య నలంకరింపఁజొచ్చిరి. శైలగణములు దేవగణములును బూజించువనిలో వ్యగ్రమానసులై యుండిరి. కన్యావివాహకార్యమునందు సముత్సుకులై యున్న సుహృద్వర్గము వా రందఱును నిట్లానందోళితులై యుండిరి. అనంతరము పురస్త్రీలందఱును గన్యయైన కాళిని సదలంకృతలు గావించి శుభ్రవస్త్రధారిణిని జేసి శంకరసన్నిధానమునకుఁ దోడితెచ్చిరి. అప్పు డామెసహోదరుఁడైన సునాభుఁడు వివాహమహోత్సవము సంతను సంసిద్ధము గావించెను. గిరినందిని శంకరునిహస్తమునందు సమర్పింపఁబడియెను. తరువాత సురగణము రమ్యాతిరమ్యాహార్మ్యతలములయందుండి శాంకరీశంకరుల కార్యకలాపముల నవలోకించుచుండిరి. దేవదేవుఁడు గిరిజతో లౌకికాచారములయందు దన్యోన్యానుష్ఠానములకుఁ బ్రారంభించెను. అక్కడఁ గుసుమితతరురాజ క్రీడాకౌతుకోచితమైన విచిత్రశోభను దాల్చియుండెను. నాలుగుదిక్కులను గంధచూర్ణముపై సుగంధవారిబిందువులు ప్రోక్షింపఁబడియెను. అన్నిప్రదేశములయందును నానావర్ణచూర్ణములతో ముగ్గులు చిత్రింపఁబడియెను. హరపార్వతుల క్రీడలయం దజస్రము ముక్తాదామములు విచ్ఛేదము లగుచుండెను. పుంజపుంజములైన సిందూరవిస్తారముచే భూమితలము రక్తవర్ణ మగుచుండెను. హరుఁ డిట్లు గిరినందినితోఁ గ్రీడించి ఋషిసేవితమును సుదృఢమునైన దక్షిణవేదిక కేగెను. అప్పుడు హిమవంతుఁడు శుభ్రవస్త్రములఁ దాల్చి పవిత్రభావముతోఁ బవిత్రహస్తముతో మధుపర్కములను గొని కన్యాసంప్రదానార్థ మచ్చటి కరుదెంచెను. త్రిలోచనుఁ డావేదికపైఁ బూర్వదిగభిముఖుఁడై కూరుచుండెను. గిరిరాజు సుఖాసీనుఁడై సప్తర్షులవంకఁ జూచుచుఁ గృతాంజలిపుటుఁడై సుఖోపవిష్టుఁడై యున్న శంకరుని సంబోధించి నిజధర్మసాధనములగు వాక్యము

లతో నిట్లనియెను, “భగవానుఁడా ! పులహాగ్రజునిపౌత్రియుఁ, బి తృగణదౌహిత్రియు, నాపుత్రియునైన యీకాళిని నీవు పరిగ్రహింపు ము. నే నీమెను నీకు సంప్రదానము సేయుచున్నాను.”

శైలరా జిట్లు చెప్పి కన్యావరుల యన్యోన్యహస్తములను సమ్మే ళనము గావించి “ఓభగవానుఁడా! ప్రతిగ్రహింపుము” అని చెప్పు చుఁ గాళిని గన్యాప్రదానము గావించెను. హరుఁ డిట్లు పలికెను. “నాకుఁ దలిదండ్రులు గాని జ్ఞాతిబాంధవాదులు గాని యెవ్వరును లేరు. నేను నిరాశ్రయుఁడనై సర్వదా గిరిశృంగమునందే వాసముచే యుచుందును. ఓయద్రీశ్వరా! అట్టి నేను భవదీయకన్యను బాణిగ్ర హణముఁ గావించుచున్నాను” అని చెప్పుచు వరప్రదుఁడైన శంకరుఁ డు తనకరముతో గిరికన్యకరమును బట్టుకొనియెను. గిరిజకు శంభుకర స్పర్శలాభముతోఁ బరమప్రీతి ప్రాప్తించెను. ఓదేవర్షీ! దేవదేవుఁడు గిరినందినితో వివాహవేదిక నారోహించి తరువాత మధుపర్కములను ధరించి లాజహోమమున కారంభించెను. హోమావసానమునందు విరించి గిరిసుతను సంబోధించి యిట్లు పలికెను. “కాళీ! దేవదేవుని శశాంకసన్నిభమైన రమ్యవదనమును నిరీక్షింపుము. స్థిరవై సమవర్తిని యీయగ్నికిఁ బ్రదక్షిణ మాచరింపుము”

రవికరసంతప్తమైన వసుధ వారివర్షణముచే నెట్లు శీతలసంపన్న యగుచున్నదో, అట్లే యంబిక హరముఖదర్శనముచేఁ దనయంతరంగ మున శైత్యసుఖము ననుభవించెను. పితామహుఁడు మరల మహాదే వునిముఖము నిరీక్షింపు మని చెప్పఁగాఁ, బార్వతి లజ్జావనతయై మెల్లఁ గా బ్రహ్మతో—“నేను జూచితిని” అని చెప్పెను. అప్పుడు హ రుఁడు గిరిజతోఁగూడ మూఁడుమాఱు లగ్నికిఁ బ్రదక్షిణ మాచరిం చెను. తరువాత ఘృతముతో లాజహోమము గావించెను. ఈసమ

యామునందు పార్వతీసఖియైన మాలిని యనునామె యచ్చటికి వచ్చి పురస్కారపరిత్యాగతో మహాదేవునిపాదములు పట్టుకొనియెను. మహాదేవుఁ డామెను జూచి—"పాదములను వదలుము, నీ కేమికావలయునో చెప్పుము, దానిని నీకొసంగెదను" అని పలికెను. మాలిని యప్పు డిట్లనియెను—"శంకరా! నీవు నాసఖికి స్వగోత్రీయసౌభాగ్యము నొసంగుము; అట్లయిన నీచరణములను విడిచిపుచ్చెదను" మహాదేవుఁ డప్పుడు "మాలినీ! నీ వేది కోరుచుంటివో దానినే యొసంగితిని, పాదములు వదలుము, నీయీసఖికి స్వగోత్రీయసౌభాగ్య మెట్లు కలిగెనో, యది చెప్పెదను వినుము. ఇదిగో శంఖచక్రగదాపద్మధరుఁడును, పీతాంబరవిరాజితుఁడు నగు, నీతనిసౌభాగ్యమును స్వీయగోత్రిమును నీసఖికి నే నొసంగితిని" వృషధ్వజుఁ డిట్లు చెప్పఁగానే, నిజగోత్రిశుభచారిత్రశాలిని యగు మాలిని యాతనిచరణములను విడిచెను. మాలిని హరచరణములను బట్టికొనియున్నప్పుడు గిరికన్యయైన కాళిముఖము శశాంకునికంటెను సుందరమై యుండుట బ్రహ్మ తిలకించెను. అప్పుడు బ్రహ్మ తద్దర్శనముచే మోహపరవశుఁ డయ్యెను, కాని యాతనికి రేతఃపాత మయ్యెను. బ్రహ్మ సంభ్రమశీలుండై దనశుక్రము నిసుకతో ఖిలము గావించెను. అప్పుడు హరుఁడు బ్రహ్మతో "బ్రహ్మా! దీనివలన ద్విజు లుత్పన్న మగుదురు. నీవు దానిని వినష్ట మొనరింపకుము. ఓపితామహా! ఈమహర్షులందఱు వాలఖిల్యులను పేరఁ బ్రసిద్ధులై ప్రశంసార్హులు గాఁగలరు" మహేశ్వరుని యీపలుకులు సాంతము లగునప్పటికి వెంటనే వాలఖిల్యు లనుపేర, అష్టాశీతిసహస్రసంఖ్యగల తపస్వులు, ఉత్థితులైరి. తరువాతఁ గ్రమముగా వివాహవిధి నిర్వహింపఁబడియెను. హరుఁడు పార్వతితోఁ గౌతుకాగారమునఁ బ్రవేశించి మరల రాత్రి తెల్లవాఱఁగానే లేచెను. ఈవిధముగా శంకరుఁడు

గిరినందినిని బొందెను. గిరిరాజు తనని బిలిచి పూజించి పంపివేసెను. శివుడు తనసహచరులైన ప్రమథగణములతో వెంటనే తనమందిరమునc బ్రవేశించెను. తరువాత బ్రహ్మచారి, ఇంద్రుడు మొదలగు దేవత లందఱకు మ్రొక్కి పూజించి యథాయోగ్యములగు మర్యాద లొనరించి యందఱ నంపకములు గావించెను. అష్టమూర్తులైన భూత వర్గముతోc దాను మందరాచలమున వసించుచుండెను.

## —• వినాయకోత్పత్తి •—

పులస్త్యుడు చెప్పుచున్నాడు—"ఓమునీ! తరువాత రుద్రుడు మందరాద్రిపై నివసించి యథేష్టవిహారములు సల్పుచు విశ్వకర్మను బిలిచి యిట్లు పలికెను. నీవు నాకు గృహమును నిర్మింపవలయును" వెంటనే విశ్వకర్మ హరునికొఱకు స్వస్తికలక్షణాన్వితమైన యొకగృహమును నిర్మించెను. ఆగృహము ప్రమాణము చతుఃషష్టియోజనములు, ఆమందిర మంతయు సువర్ణనిర్మితము. దాని తోరణద్వారములు గజదంతమయములు, మధ్యభాగములు ముక్తాజాలఖచితములు, సోపానరాజి శుద్ధస్ఫటికవిరచితము, గృహమునందు విచిత్రము లన్నియు వైడూర్యమణిసంయుతములు. ఆగృహమునకు సువిశాలములగు నేడు కక్ష లుంచెను. అవి యన్నియు నానాగుణమండితములు, గృహము సంసిద్ధమైనతరువాత దేవదేవుడు గార్హిస్థ్యలక్షణ మగు యజ్ఞమును గావించెను. ఓమునీ! ఈయజ్ఞమునం దాతడు పూర్వాచరితమార్గము ననుసరించెను. ఈవిధముగా నాతడు బహుకాలము గడపెను. జగత్పతియైన పశుపతి ధర్మానుసారముగాc బార్వతితో సంసారముచేయుచుండెను. ఒకానొకప్పుడు హరుడు ధర్మాచరణకాలమునc బార్వతిని 'కాళీ' యని సంబోధించెను. అందువలన నామెయంతరంగమునం

డించుక దైన్యము గలిగెను. ఆమె యప్పుడు శంకరునకి ట్లనియెను. కుఠారమువలన విచ్ఛిన్నమైన వనతరువు మరలఁ దలయెత్తుచుండును, కాని కటువాక్యముచే నిందితులైనవారు మరలఁ దలయెత్తుట యసంభవము. వదనమునుండి వాక్యబాణము బహిర్గతమై యెవ్వరి నణఁచి వేయుచున్నదో వారు దివారాత్రములు మనస్తాపము ననుభవింపవలసినదే. వాస్తవముగాఁ బండితులైనవా రెప్పుడును గటువాక్యముల ప్రయోగింపరు; కాని నీవు నేఁడు ధర్మవ్యతిక్రమ మాచరించితివి. అందుచేత నో దేవదేవా! నీవు నన్నిఁకముం దెప్పుడును “ గౌరి ” యను నామముతోఁ బిలువకుండఁగలుగుటకు నే నెప్పుడు మహత్తమైన తప మాచరింపవలయును ”

గిరికుమారి యిట్లు పలికి శంకరునకుఁ బ్రణామము గావించెను. మహేశ్వరుఁ డామెకుఁ దపస్సొనరించుటకు సమ్మతి యొసంగెను. భర్త యనుజ్ఞఁ గొని శంకరునకుఁ బ్రదక్షిణము జేసి దేవి హిమాద్రియందొకానొక మంగళమయశిఖరమునకేఁగి యచ్చట విడిసెను. ఆమె యెచ్చోట దిగెనో యచ్చోటఁ దాను తపస్సొనర్ప నెఱింగి విధాత యంతకుఁబూర్వమే దానిని బ్రియమ్మైపూర్వముగా నిర్మాణముగావించి యుంచెను. అది యటులుండనిమ్ము, హిమాద్రిశృంగమునకు దిగినతరువాత పార్వతి జయా, విజయా, జయంతీ, మహాపుణ్యా, అపరాజితా ప్రభృతి దేవీగణమును స్మరించెను. స్మరించి నంతమాత్రముచేతనే వారందఱుఁ గాళిని దర్శించుట కరుదెంచిరి. తరువాతఁ బార్వతియనుమతిఁ బొంది వారందఱు నామెకుఁ బరిచర్య లొనరించుచు నుండిరి. అనంతరం బా పార్వతి తపస్సునందు నివిష్టురాలైనతరువాత నొకనాఁడు హిమాలయమునందలి యరణ్యమునుండి నఖదంష్ట్రాయుధమైన వ్యాఘ్ర మొక్కటి యక్కడ కరుదెంచెను. దేవి యప్పుడు భూమిపై నొ

ర్కపాదమునే మోపి తపస్సుచేయుచుండెను. ఆవ్యాఘ్రము మత్స్వాను—ఈతపస్విని యభీష్టవరలాభము నెప్పుడు పొందునో, అప్పుడే నేనును వరలాభమును బొందఁగల నని స్థిరపఱచుకొనియెను. ఇట్లు చింతించి మృగశ్రేష్ఠమైన యావ్యాఘ్రము నప్పటినుండియు నాతపశ్చారిణియైన పార్వతిమోమువంకనే యేకదృష్టి నిలిపి నిలుచుండెను. అనంతరము పార్వతి బ్రహ్మపదారాధనముకొఱకు శతవర్షపర్యంతము తప మొనరించెను. అప్పుడు త్రిభువనవిధాతయైన బ్రహ్మ ఆవిర్భూతుం డయ్యెను. పితామహుఁ డిట్లనియెను—“దేవీ! నేను సంప్రీతుండ నైతిని; తపస్సుచే నీపాపము లన్నియు విదూరితము లైనవి. ఓసనాతనీ! నీ వభీష్టవరములను గోరుము” అని వానిఁ గాంచి యిట్లనియెను. ఓకమలోద్భవా! నీవీవ్యాఘ్రమునకు వరము లిమ్ము. అందుచేతనే నేను బరమప్రీతి నొందఁగలను. అదివిని బ్రహ్మ ఆయద్భుతకర్మమైన వ్యాఘ్రమును జూచి యిట్లనియెను—నీవు గాణాపత్యము నొందఁగలవు. భగవంతునియందు నీభక్తి నిలువఁగలదు. నీవు ధార్మికుఁడవై సర్వత్ర యజేయుఁడవు కాఁగలవు. “బ్రహ్మ వ్యాఘ్రమున కిట్లువరము లిచ్చి శివసీమంతిని కిట్లనియె—నేను వ్యాఘ్రమునకు వరము లిచ్చితిని. నీవిప్పు డింక నెయ్యదిగిన్ది వరములఁ బ్రార్థింపుము. నేను నీకు వరము లొసంగెదను.”

గిరిసుత పితామహున కిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. “బ్రహ్మా! నా దేహవర్ణము స్వర్ణకాంతిని ధరించునట్లు నాకు వరమిమ్ము” బ్రహ్మ పార్వతికి “తథాస్తు” అని పలికి యంతర్ధాన మొందెను. పార్వతి యప్పుడు కృష్ణవర్ణదేహకోశమును వదలి కమలకింజల్కకాంతిని ధరించెను. ఆకృష్ణకోశమునుండి మరల ‘కాత్యాయని’ ఆవిర్భవించెను. సహస్రాక్షుఁ డామెను దక్షిణాంబగా గ్రహించెను. దేవరాజైన వా

నప్పు డప్పుడు గిరిజను జూచి యిట్లనియెను—ఈమెను నాకు దానము చేయుము. ఈకౌశికి నాభగిని. కోశమునుండి యుత్పన్న యగుటచే నీకు కౌశికి యనుపేరు గలదయ్యెను. ఈమె నాభగిని, అందుచే నేనును గౌశికనామమును ధరించితిని."

ఇంద్రుం డిట్లు పలుకఁగా విని సురూపయైన కౌశికిని గిరిజ యింద్రునకు సమర్పించెను. సహస్రాక్షుఁ డామెను దీసికొని సత్వరముగా వింధ్యాచలమున కేఁగెను. అక్కడ కేఁగి యాతఁడు కౌశికితో నిట్లనియెను—"దేవీ! నీ వీస్థానమునందు నివసింపుము. ఇచ్చట దేవతలు నిన్నుఁ బూజింపఁగలరు. నీవు "వింధ్యవాసిని" యను పేరితోఁ బ్రసిద్ధ వయ్యెదవు." అని యింద్రుఁ డామె నచ్చటఁ బ్రతిష్ఠచేసి, యామెకు వాహనముగా నొకసింహము నొసంగి "నీవు నాకు శత్రుసంహారిణి గమ్ము" అని చెప్పి పిమ్మట నాతఁడు తనస్వర్గధామమున కేఁగెను. ఇఁక నిచ్చట గిరికుమారి యైన యుమ వరము లొంది మహేశ్వరునకుఁ బ్రణిపాతములు గావించి సవినయయై యాతనిసన్నిధియందు నుండుచుండెను. తరువాత, అవ్యయాత్ముఁడైన శ్రీమద్దేవదేవుఁడు సహస్రవర్షములు పార్వతితోఁ బరిపూర్ణమహామోహమున నిష్టక్రీడారతుఁడై యుండెను. ఓముని! మహాదేవుఁ డీకార్యమునందు నిమగ్నుఁడై యుండుటచేఁ ద్రిలోకములు నుద్ధతభావములుగలవై విచలితములు గాఁజొచ్చెను. సాగరము లన్నియు సంక్షోభితము లయ్యెను. దేవతలు భీతిగ్రస్తులైరి. అప్పుడు సురలు సురేంద్రునితో బ్రహ్మసదనమున కేఁగి యాతనికిఁ బ్రణిపాతములు గావించి యిట్లనిరి—"విధాతా! ఇది యేమి! సమస్తజగములు సంక్షుభితము లగుచున్న వేమి?" అని యడుగఁగా సురలకు బ్రహ్మ యిట్లు చెప్పెను—నిశ్చయముగా భగవానుఁడైన హరుఁడు మహామోహమునఁ బ్రవృత్తుఁ డయ్యెను.

అందుచేఁ ద్రిభువనములు నాక్రాంతములై పరమక్షోభము నొందుచున్నవి." బ్రహ్మ యిట్లు పలికి యూరకుండెను. సురలప్పు డింద్రునిఁ జూచి—శక్రా! రమ్ము, మన మచ్చటి కేఁగి, మహాదేవుని మహామోహవ్యాపార మెంతవఱకు సంపన్నము గాదో, అంతవఱకు నచ్చట నుందము. ఏలన? మహాదేవుని యీమహామోహవ్యాపారము నుసంపన్నమైనచో నందువలన నాతని కుద్భవించుపుత్త్రుఁడు నిశ్చయముగా నిందప్రపదవిని హరింపఁగలఁడు." అని పలికిరి. అప్పుడు దేవతలమాటలవలనిభయముచే నింద్రునిదివ్యజ్ఞానము విలుప్తమయ్యెను. సహస్రాక్షుఁడైన యింద్రుఁడు తనయదృష్టవశమున వహ్నిప్రముఖదేవతలను వెంటఁ బెట్టుకొని మందరగిరిశృంగమున కేఁగెను. ఓసత్తమా! వారక్కడ కేఁగినమాట నిజమే; కాని భవునివాకిలిముందరకైనను జేరలేక పోయిరి. అప్పుడు దేవత లనేకవిధముల నాలోచించిరి; చిట్టచివరకు వా రగ్నిదేవుని నచ్చటకేఁగుటకుఁ బ్రేరేపించిరి. అగ్నియు భవభవనమునఁ బ్రవేశించుటకుఁ బ్రయత్నించెను; కాని నందీశ్వరుఁడు ద్వారపాలకుఁడై యుండుటఁ జూచి యచ్చటఁ బ్రవేశించుట యసంభవమని తెలిసికొనియెను. మఱియు నాతఁ డామందిరప్రవేశముకొఱకనేకవిధములైన యాలోచనము లొనరించుచుండెను. అతఁ డిట్లు చింతాసాగరమగ్నుఁడై యుండఁగా, భవమందిరమునుండి విమలములైన హంసములు బారులు తీరిచి యీవలకు వచ్చుచుండుట కఁబడియెను. అప్పు డగ్నిదేవుఁడు హంసరూపము నవలంబించుటయే కార్యసిద్ధికుపాయ మని స్థిరపఱచుకొని తత్క్షణమే హంసరూపమును ధరించుకొనియెను. అప్పు డాహంసరూపియైన హుతాశనుఁడు ప్రతీహారుని వంచించి భవునిభవనాంగణమునఁ బ్రవేశించెను. అట్లు మందిరములోఁ బ్రవేశించి యాతఁడు సూక్ష్మదేహము దాల్చి శివునిశిరము నెక్కి నవ్వుచు

తరువాత గిరిజను మజ్జన మాడించెను. ఓనారదా ! గిరిబాల మాలిని మోమింపక నవ్వుచుండుటఁ జూచి—ఓభీరుశీలా ! చాలసేపటినుండి మందహాసముచేయుచున్నా వెందులకు ? అనియెను.

మాలిని మరల నిట్లనెను--నేనెందులకు నవ్వుచుంటినో చెప్పనా? భగవానుఁడైన భవుఁడు నందీశ్వరునితోఁ దమ కొకపుత్త్రుఁడు గలుగునని చెప్పుచున్నాఁడు. మాటవినినప్పటినుండియు నా కెంతయో సంతోషము కలుగుచున్నది. ఇది యిటుంచి దేవత లందఱును హరుని బుత్త్రోత్పాదనకార్యమునుండి విరతుని గావించి రనియు వినియున్నాను. ఏమైన నేమి ? దేవీ ! నాసంతోషమునకుఁ గారణ మిదియే." దేవి మాలినిమాటలు వినియెను. విని, విధివిధానముగా స్నాన మైనతరువాత భక్తియుక్తయై శంకరునిఁ బూజించి యింటిలోని కేఁగెను. తరువాత శంకరుఁ డరుదెంచి భద్రాసనమునఁ గూరుచుండి స్నానము గావించెను. పార్వతి నలుగుపిండివలనఁ బుట్టిన యాపురుషుఁడు—గజాననుఁడు, వారుభయులును స్నానముచేసి వెడలిపోయినతరువాత నచ్చటనే యుండెను. ఉమామహేశ్వరులస్వేదజలము స్నానజలముతో గలిసి యేకమయ్యెను. ఆయుభయులస్వేదసంపర్కమువలనను గలిగిన ఝూత్కారధ్వనితో గజాననునిప్రశస్తహస్తము పైకిలేచెను. భువనేశ్వరుఁడు సంప్రీతచిత్తుఁడై యాతఁడు తనపుత్త్రుఁ డని తెలిసికొనియెను. హరుఁ డప్పు డాతని జేరఁదీసికొని నందీశ్వరునితో నీతఁడుమాపుత్త్రుఁ డని చెప్పెను. రుద్రుఁడు స్నానమైనపిదప దేవతలను, అగ్నిని, పితృదేవతలను నర్చించి, సహస్రనామజపము గావించి, పార్వతివద్ద కేఁగెను. శూలపాణియైన శంకరుఁడు దేవితోఁ గూడి నవ్వుచు నామెతో నిట్లనియెను—ఓగిరినందినీ ! గుణసంపన్నుఁడైన యీనీపుత్త్రుని జూడుము. ఈదివ్యగజాననపురుషుఁడు నీనలుగుపిండివలన నుద్భవించెను."

మహాదేవుఁ డిట్లు పలుకఁగానే యాగిరిబాల తనమ్రోల నున్న యా యద్భుతబాలుని జూచి, ప్రీతాత్మయై యాపుత్రు నాలింగనముచేసి కొని శిరము ముద్దాడెను. శంభుఁ డప్పుడు పార్వతిని జూచి,—ఓదేవీ! నేను నీనాయకుఁడను, నాయకవ్యతీతముగా నీకీపుత్రుఁడు గలుగుటచే నీతనికివినాయకుఁ డనునామము కలుఁగఁగలదు. ఈవినాయకుఁడు దేవతలకును మనుష్యులకును వేవేలు విఘ్నములు వినాశము చేయఁగలఁడు. ఓదేవీ! చరాచరలోకము లన్నియు నీతనిఁ బూజింపఁగలవు. ఇట్లు చెప్పుచు మహాదేవుఁడు దేవిహస్తమునం దాపుత్రుని సమర్పించెను. [illegible] నాతనికి సహాయార్థము సుబోదరుఁ డనునొక విఖ్యాత గణశ్రేష్ఠు నాతని కిచ్చెను. అదిగాక మాతృగణమును, ఘోరస్వభావములగు భూతగణమును, విఘ్నకరములగు మఱికొన్ని యితరగణములను నాతని [illegible] నొసఁగెను. దేవి యప్పుడు పుత్రుని జూచి [illegible] శంకరునితోఁగూడ మందరకందరాంచితమైన [illegible] విహరింపఁ జొచ్చెను. [illegible], నారదా! తరువాత దేవి [illegible] శుంభనిశుంభులను మహాదైత్యుల నిరువురను దానే నిహతులనుగావించెను. మృడాని హిమాలయమున నుద్భవించిన సంగతియంతయు నీకడ వివరించి చెప్పితిని. గిరినందినీజన్మవృత్తాంతమైన యీపవిత్రాఖ్యానము స్వర్గసాధనమును, యశస్కరమును, సర్వపాపహరమును, బరమతేజస్కరమును నగును.

## ◆ చండముండవధ ◆

పులస్త్యుఁడు చెప్పుచున్నాఁడు—ఓద్విజసత్తమా! కశ్యపునకు, దను నామమైన భార్యయొకతె గలదు. ఆమెగర్భమున ముగ్గురుపుత్రు లుద్భవించిరి. వారు సహస్రాక్షునికంటె నధికబలశాలురు. వారి

లో జ్యేష్ఠుఁడు శుంభుఁడు ద్వితీయుఁడు నిశుంభుఁడు, తృతీయుఁడు నముచి. ఈనముచిని దేవేంద్రుఁడు తనవజ్రాయుధముచేఁ గడతేర్పవలయునని తలఁచుకొనెను. అట్లుత్సహించి యింద్రుఁడు వజ్రాయుధముచేతఁ బట్టుకొని పరుగెత్తి తనవంకకు వచ్చుచుండుటఁ జూచి నముచి యను దనుజుఁడు భయపడి సూర్యరథములో దాఁగికొనెను. అప్పుడు దేవరాజాతని సంహరింపఁజాలకపోయెను. ఓనారదా! మహాత్ముఁడైన యింద్రుఁ డానమయమునందు నముచితో నొకవిధముగా సంధి చేసికొనియెను. అది యేదన? నముచి యెప్పుడు నస్త్రశస్త్రములచే వధ్యుఁడు గాకుండునట్లుగా నింద్రుఁడు వరమీయవలసినవాఁ డయ్యెను. ఓనారదా! తాను శస్త్రాస్త్రములచే వధ్యుఁడను గానని తెలిసికొనినవెంటనే సూర్యరథమును వదలివచ్చి నముచి పాతాళము నాశ్రయించెను. ఆతఁ డట్లు పాతాళములో నుత్తమసముద్రజలములం జొచ్చి జలఫేనముపై నీదుచు జలఫేనమును జేతఁ బట్టుకొని యిట్లనియెను— "దేవరాజైన వాసవుఁ డేమి చెప్పెనో యట్లే యగుఁగాక. ఈఫేనము నన్ను స్పృశించుఁగాక" ఇట్లు చెప్పుచు నాతఁ డాఫేనమును జేతులతో నెత్తికొని తనముఖమును, నాశికను, గర్ణపుటములను నిండించుకొనియెను. అప్పు డింద్రుఁ డాఫేనమధ్యమునుండి రహస్యముగా వజ్రాయుధమును సృష్టిగావించెను. వజ్రాయుధ మప్పుడు నురుగులోఁ జొట్టి నముచినాసికను గొంతుకను నష్టముపడియెను. ఆతఁడును మృత్యుముఖమునఁబడియెను. ఇంద్రుఁ డీహత్యగావించుటయందుఁ దాను మొట్టమొదట నిచ్చినవాగ్దానమును మీఱెను. అందుచే నాతనికి బ్రహ్మహత్యాదోషము సంభవించెను. తరువాత నింద్రుఁడు పుణ్యతీర్థస్నానములచేఁ బాపమునుండి నిర్ముక్తి నొందెను.

అప్పుడు నముచిసోదరులగు శుంభనిశుంభు లను వీరవరు లిరు

పురును, మహాయుద్ధసన్నద్ధులై సురలను యాతనలపాలు గావించుటకు బయలుదేఱిరి. అప్పుడు దేవతలును దేవేంద్రుని యధినాయకత్వముక్రింద యుద్ధమున కారంభించిరి. అచిరకాలములోనే ఘోరయుద్ధ మారంభ మయ్యెను. యుద్ధమునం దాదైత్యవరు లిరువురచేతిలోను వాహన సమేతులై దేవతలు సంపూర్ణపరాజితు లైరి. ఈయుద్ధమున నింద్రుని యైరావతమును, యమునిమహిషమును, వరుణునిమణియును, మాధవుని ఘనత్రిమును గదయును, అపహృతము లయ్యెను. శంఖపద్మాదినిధు లన్నియు దానవులస్వాధీనము చేసికొనిరి. ఓనారదా! ఈయుద్ధమునకు ఫల మేమనఁగా, త్రిలోకములలోని సమస్తమును శుంభనిశుంభులకు వశీభూతము లయ్యెను. ఏనరకు దైత్యులైన శుంభనిశుంభులు భూలోకమునకు దిగి రక్తబీజుఁడనుమహాసురుని జూచి—"నీ వెవ్వఁడవు?" అని యడిగిరి.

రక్తబీజుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నేనొక దైత్యుఁడను. నేను పూర్వము మహిషాసురునకు మంత్రిగా నుండెడివాఁడను. నాపేరు రక్తబీజుఁడు. నేను మహావీర్యశాలి ననియు, మహాభుజశాలి ననియు విఖ్యాతి గాంచితిని. చండముండులను పేరుగల యిద్దరు వీరులు రమ్యాకారములు గలవారు మహిషాసురునకు సమాత్యులుగా నుండిరి. కాని యామహాభుజులైన వీరు లిరువును దేవికి భయమంది జలనిమగ్నులై యుండిరి. మాకుఁ బ్రభువుగా నుండెడి మహిషాసురుఁడు మహాదేవిచే వింధ్యాచలమునందు నిహతుఁ డయ్యెను. ఇఁక మీరుభయులు నెవ్వరితనయులో మీనామము లెవ్వియో, మఱియు మహాశయు లైన మీమీవీర్యప్రభావము లెట్టివో సమస్తమును మా కెఱింగింపుఁడు."

శుంభుఁ డిట్లనియెను. "నేను "దను" గర్భజాతుఁడను. శుం

భుఁడను ప్రసిద్ధనామము గలవాఁడను. ఇఁక నీతఁడు నాకనిష్ఠభ్రాత. ఈతనిపేరు నిశుంభుఁడు. ఈనిశుంభునిచేతిలో నిందుద్రునిదర్ప మణఁగి పోయెను. యుద్ధభూమియం దిందుద్రుఁడు, రుద్రుఁడు, నాదిత్యుఁడుమొదలగు యుద్ధార్థులైన దేవత లందఱు నీతనిచేతిలోఁ బలుమాఱులు పరాజితులైరి. వీరుగాక మరియు నెందఱువీరశ్రేష్ఠులు యుద్ధమున వీనిచే నవనతులైనారో చెప్పశక్యమే గాదు. సరియే దానికేమిగాని, మహిషాసురుఁ డెట్లు నిహతుఁ డయ్యెనో చెప్పుము? మే మిరువురమును ససైన్యముగా నామహిషహంతను వినాశమొనరింపఁగలము."

వారిరుపక్షములవారును నర్మదానదీతీరమున నుండి యీవిధముగా సంభాషించుకొనుచుండిరి. తరువాతఁ జండముండులనుదానవు లిరువురు జలములనుండి లేచివచ్చి రక్తబీజుని గలిసికొనిరి. వారప్పుడు రక్తబీజుని జూచి "వీరెవ్వరు నీముందు నిలుచున్నారు?" అని యడిగిరి. రక్తబీజుఁ డప్పుడు "ఈయన సురమర్దనుఁడైన శుంభుఁడు. ఈ రెండవవీరుఁ డీతనికి సోదరుఁడు నిశుంభుఁడు. ఈవీరుల నిరువురి నాశ్రయించినచో నిశ్చయముగా నాత్రిభువనరత్నభూతమైన మహిషమర్దినిని మనము మర్దింపఁగలము." అని చండముండులకుఁ జెప్పెను. చండుఁ డిట్లనియెను. "నిపిల్లి జన్నాటి న్యాయము గాదు. ఏమన! నీ విప్పుడు రత్నమును బొందుటకుఁ దగవు. రాజైనవాఁ డెవ్వఁడో యాతఁడే రత్నభోగమునకు యోగ్యుఁడు. నిజముగా శుంభునకే ఆస్త్రీరత్నము నొసగఁదగును." ఇట్లు స్థిరపఱచుకొని శుంభనిశుంభులవద్ద, రూపయౌవనవతియుఁ గౌశికి యై పునరుద్భావము నొందినదియు నైన యాదేవివృత్తాంతము వివరించి చెప్పిరి. అప్పుడు శుంభుఁడు తనదూతయైన సుగ్రీవుఁడను దానవుని వింధ్యవాసినియైన కౌశికవద్దకుఁ బుత్తెంచెను. శుంభునియాజ్ఞచే మహాసురుఁడైన సుగ్రీవుఁడు దేవిసన్నిధి కేఁగి

యామెతో సంభాషించి క్రోధాన్వితుండై తిరిగి వచ్చి శుంభనింభుల
తో నిట్లనెను. “ఓ దైత్యరాజులారా! మీయాజ్ఞానుసారముగా నివ్వ
డు నేను దేవి సమీపమున కేఁగి యిట్లు చెప్పితిని. “ఓ భాగ్యవతీ!
దానవు లందఱిలోను విఖ్యాతుఁడైన శుంభుఁడు శ్రేష్ఠుఁడు. ఆతఁడు
మమ్ము నీవద్దకుఁ బంపినాఁడు. ఏలన? ఆతఁడు చెప్పిన యీమాటలు
వినుము. “ఓ సుందరీ! నేను త్రిలోకములకుఁ బ్రభుఁడను. స్వర్గ,
పాతాళ, భూతలములలో నే శ్రేష్ఠపదార్థ మున్నను, నేయుత్తమరత్న ము
న్నను, అవి యన్నియు నిత్యము నాయింట విరాజిల్లుచున్నవి. ఓకృ
శోదరీ! చండముండులు నాయెదుట నిన్ను రత్నస్వరూప వని వర్ణించి
యున్నారు. అందుచే నీవు నన్నుఁగాని నాభ్రాతయైన నిశుంభునిగాని
భజింపుము.” అని చెప్పితిని. దేవి నామాటలు విని నవ్వుచు నిట్లు
త్తర మిచ్చెను. “ఓ సుగ్రీవా! నాసంగతి వినుము. శుంభుఁడే త్రిలోక
పతి యగుటయు, నాతఁడే జగములలోని సమస్తరత్నముల ననుభవించు
టకు యోగ్యుఁ డనియు నీవు చెప్పినమాటలు సత్యమే. కాని నేనం
తయు దుర్వినీతురాలను. అందుచేత బహుకాలమునుండి లోలోన
నొకసంకల్పమును బెంపొందించుకొనుచు వచ్చుచుంటిని. నాసంకల్ప
ము వినుము. ఎవ్వరు నాతో యుద్ధముచేసి నన్ను జయింపఁగలుగు
చున్నారో వారినే నేను వరియింపవలయు నని యుంటిని. కనుక నా
తెం[illegible] నాభర్త కాఁగలఁడు” దేవి చెప్పిన యీగర్వితవాక్యముల నా
లకించి నే నిట్లంటిని. “దేవీ! నీవు దర్పితురాలవై యుంటివి. ఎవ్వఁ
డు సకలసురాసురులను జయించెనో అది నీవు వినియే యుంటివి. అట్టి
వాఁడు నిన్ను జయింపఁజాలఁడా? అందుచే నివేమియు నాలోచింపక
లెమ్ము. నావెంట రమ్ము.” అని నేను బలుకఁగా విని దేవి యిట్లని
యెను. “నేనేదేని సంకల్పమును జేసికొనినపుడు దానినిగూర్చి ముం

దుగనే చక్కఁగా నాలోచించుకొని యప్పుడు స్థిరపఱుకొందును గాని, తరువాత నిఁక దానినిగూర్చి యోచింపను. కావున నీవు మాటాడక వెడలుము. శుంభునివద్ద కేఁగి యీవృత్తాంత మంతయు నెఱింగింపుము." అని ఓమహాసురా! ఆమె యిట్లు చెప్పఁగా విని నేనింక నామె కేమియుఁ బ్రత్యుత్తర మీయక తిన్నగా నీసన్నిధికే తెంచితిని. ఆదేవి కోటికోటియగ్నులతోఁ దుల్యమైన తేజముగల దని నీవు గ్రహింపుము. కర్తవ్య మేమొ నిశ్చయించుకొనుము."

శుంభుఁ డీమాటలు విని ధూమ్రలోచనుఁ డనునొక రాక్షసుని బిలిచి "ఓధూమ్రాక్షా! నీవు శీఘ్రముగా నేఁగి దుష్టదర్పితురాలైన యాదేవిని జుట్టు పట్టుకొని యపరాధినియైన దాసినివలె నిచ్చట కీడ్చుకొనిరమ్ము. ఆమెపక్షమున మహాబలుఁడైనవాఁ డెవ్వఁడైన నీ కడ్డము రాఁజూచినచో వాఁడు పితామహుఁ డగుబ్రహ్మయైనను సరియే నిర్విచారముగా వాని నామెపక్షమునఁ దక్షణమే ఖండించివేయుము." అని యాజ్ఞాపించెను. తేజస్వియైన ధూమ్రాక్షుఁడు శుంభునియాజ్ఞ యైనంతమాత్రనే ఆఱునూటులయక్షౌహిణుల దైత్యసేనలను వెంటఁబెట్టుకొని వింధ్యాచలమునకు బయలుదేఱెను. అక్కడ కేఁగి దుర్గాదేవిని జూచి వెంటనే ఘూర్ణితనేత్రుఁడై యిట్లనియెను. "ఓమూఢకౌశికీ! శీఘ్రముగా లేచివచ్చి భర్తను సేవింపుము. అది నీకిష్టము లేదా? అట్లయినచో బలవంతముగాఁ జుట్టుపట్టుకొని నీచశిక్షలతో నిన్నీడ్చుకొని పోఁగలను." అప్పుడు దేవి యిట్లనియెను. "నీవు నన్ను బలాత్కరించి తీసికొనిపోవుటకు శుంభునివద్దనుండి వచ్చితివి. ఇట్టియెడల నబలనైన నే నింకేమి చేయఁగలను? కావున నీయిష్ట మెట్లో అట్లేచేయుము."

పులస్త్యుఁడు చెప్పుచున్నాఁడు—అంబికాదేవి ధూమ్రలోచను

నితో నిట్లుచెప్పి భయంకరమైన హుంకారముఁజేయుచుఁ దుర్గ ణమే యాధూమ్రాక్షుని భస్మీభూతము గావించెను. ధూమ్రులోచనుఁడు వాహనబలసమేతముగాఁ గౌశికిచే భస్మమైపోయెను. అప్పుడు సకల జగములనుండియు భయంకరములైన హాహాకారధ్వనులు బయలుదేఱెను. ఆయుద్ధితమహాధ్వని శుంభునికర్ణములలోఁ బ్రవేశించెను. అప్పుడు శుంభుఁడు మహాసురులైన చండముండులను, బలిశ్రేష్ఠుఁడైన రురుని యుద్ధయాత్రకు సన్నద్ధులఁ గావించెను. వారును హార్ద్రాతిహార్ష ములతో యుద్ధార్థులై బయలుదేఱి వింధ్యాచలమునకు వచ్చిరి. ఈ ముగ్గురుమహాసురులయాధిపత్యముక్రిందను అసంఖ్యగజాశ్వరథసంకుల మైన భయంకరచతురంగవాహిని యాకస్మికముగాఁ గౌశికిని ముట్టడించుటకు వింధ్యాచలమునఁ బ్రవేశించెను. అప్పుడా యసంఖ్యాకముగా వచ్చుచున్న రిపుబలమునుజూచి దేవీవాహనమైన సింహము తనకేసర చ్ఛటలను గంపింపఁజేయుచు రణరంగమున దానవబలమును జీల్చుట కారంభించెను. దానవసేనలో ననేకులు గిరికందరచారియైన యాకేసరి కరప్రహారములచేతను, మఱికొందఱు దాని ముఖగ్రాసముచేతను, నింకఁ గొందఱు దాని దంతవిదారణములచేతను, వేఱొక కొందఱు దాని నఖ రములచేతను, గొందఱు దాని వక్షోవితాడనములచేతను విధ్వస్తులు గాఁజొచ్చిరి. ఈవిధముగా నసంఖ్యదానవులు సింహముచేతిలోనే నిహతులైపోయిరి. ఈసమయములో దేవి కనుచరమైన భూతవర్గము బహుదానవుల జీవసంహార మొనరించెను. తమ సైన్యబలమంతయు విపన్నముగుటఁ జూచి క్రోధాన్వితు లగుచున్న చండముండులయుధర పాత్రంతము లదరిపోఁజొచ్చెను. వారప్పుడు పతంగములు పావకాభిము ఖములైనట్లు మహావేగముతో దుర్గ కభిముఖులు గాఁజొచ్చిరి. దేవి యైన పరమేశ్వరి వారట్లు తన్నెదిరించుటఁ జూచి క్రోధభరముచేఁ గ

సుభోమలు మూఁకుమ్మడితలు పడునట్లుగా మోడుచుకొనియెను. భ్రూకుటీకుటిలమైన యా దేవిలలాటఫలకమునుండి యప్పుడు కరాళవదనయు యోగినియు నైన కాళి యావిర్భవించెను. ఆమె హస్తములయందు ఖట్వాంగములును, కాలాగ్నులు, చటిప్రచండములు నైన యొర దీసినకత్తులును ధరించి యుండెను. నిహతులైన నృపతుల మస్తకము లన్నియు మాలలుగా నామెగళదేశమున వ్రేలాడుచుండెను. ఆమె రణక్షేత్రమునందు దుటికి యసంఖ్యదానవులను ఖడ్గఘాతములచేతను, ఖట్వాంగములచేతను విదారితులను గావించుచు, నత్యధికక్రోధాక్రాంతయై గజాశ్వరథసహితముగా శత్రువర్గమును సంహరించివేసెను. తరువాత నంబికాదేవి చర్మాంకుశముద్గరఘంటికాదియంత్రములతో శత్రుపక్షకుంజరవదనములను గ్రుచ్చుచు, చక్రకూబరరథాశ్వనారసులతో యోధుల వదనవివరములను గ్రుచ్చుచుఁ బ్రాణ మొసంగించుచుండెను. అప్పు డామె కొందఱిని నేలపాలుచేసెను, మఱికొందఱిని గ్రీవాభేదనము చేసెను, ఇఁక గొందఱిని శాపవ్యయముచేతను నాక్రమించి కృతాంతమందిరమునకు పంపులను చేయుచుండెను.

రురుదానవుఁ డప్పుడు సేనాపతులతో సేనాదళమును దేవి భక్షించివేయుటఁ జూచి మహాక్రోధముతో దేవి కెదురుగాఁ బరువెత్తి వచ్చెను. చండముండు లిద్దఱు వ్యాకారి మంతయు నీక్షించుచుండెను. అప్పుడు దేవి యూపసూనుకన్న రురునిమస్తకమును ఖట్వాంగముచేఁ గొట్టెను. విచ్ఛిన్నమూలమైన పాదపమువలె నప్పు డారురుదైత్యుని శిరము వేగి యాకసము భూతలమునఁ బడిపోయెను. అట్లు పడిపోయిన యాతనిని జూచి యప్పుడు దేవి పశువునుంబోలె యాతనిదేహచర్మమంతయు నొలిచివేసి యాతని దనజటలకు వ్రేలాడఁగట్టుకొనియెను, కాని వానిలో నొకజటమాత్రము బంధింపఁబడలేదు. అప్పు డామె

యాఁవ్రేలాడుచున్నజట నూడఁబెఱికి భూమిపై విసరెను. ముహూర్త కాలములోనే యాజటభయంకరమూర్తిగాఁ బరిణమించెను. ఆమూర్తి సగము శుక్లవర్ణమును, సగముకృష్ణవర్ణమును ధరించి యుండెను. ఆమె కేశపాశము తైలాభ్యక్తమై యుండెను. ఆమూర్తి యావిర్భవింపఁగానే 'నేనొకమహాసురుని వినాశమొనరించెదను.' అని కేకలువేయుచు బయలుదేరెను. దేవి యామెకుఁ 'జండమారి' యని పేరుంచెను. క్రమముగా నామె చండమారి యనుపేరునఁ బ్రఖ్యాత యయ్యెను. దేవి యప్పుడామెను జూచి "ఓసుభగురాలా! నమస్తును. చండముండుల నిచ్చటికిఁ దీసికొని రమ్ము. నేను వారిని స్వహస్తములతోనే నిహతుని గావింపవలెను, అందుచే వారి నిటకుఁ దెచ్చుటమాత్రమె నీకుఁ గర్తవ్యము." అని యాజ్ఞాపించెను. దేవియనుజ్ఞచేఁ జండమారి చండముండాసురులవంకకుఁ బరువెత్తుకొచ్చెను. అప్పుడు చండముండులు భయార్తులై దక్షిణదిశకుఁ బాఱిపోయిరి. చండమారి గరుత్మంతునితోఁ దుల్యమైన వేగముగల గర్దభము నెక్కి విస్రస్తవసనయై యాయసురుల నిరువురను వెన్నంటి పరువెత్తుకొచ్చెను. అసురద్వయమెచ్చటెచ్చటికిఁ బరుగులెత్తుచుండెనో యచ్చటచ్చటకెల్ల నాశివాదేవియుఁ బరువులెత్తుకొచ్చెను. అట్లు పరుగెత్తునప్పుడామె యమవాహనమైన పుండరీకమహిషముకొమ్ము నూడఁబెఱికి భుజంగనిభమైన యాకొమ్మును చేతఁ బట్టుకొని దానవసేనతోఁ బరుగెత్తుచుండెను. అప్పుడు చండముండులు భూతలమును వదలి యాకాశమార్గమునఁ బరుగెత్తఁ జొచ్చిరి. ఆమహేశ్వరియు రాసభారోహణమున నతివేగముగా వారిని వెంబడించెను. మార్గమధ్యమునందు గరుడుఁడు పన్నగపతియైన కర్కోటకునితో నామె కెదురయ్యెను. అది చూచి యామెదేహమంతయు హర్షరోమాంచిత మయ్యెను. గరుడుఁ డప్పుడు భయా

ర్తుఁడై మాంసపిండమువలె ముడుచుకొనిపోయెను. భయంకరమునైన యాతనితెక్కలప్పుడు వాలిపోయెను. దేవి యాగరుడుని పతితపక్షముల నూడదీసికొని కర్కోటకుని జేతఁ బట్టుకొని యత్యంతవేగముతో నాభయాతురులునైన చండముండుల ననుసరించి పరుగెత్తెను. అప్పుడామె చండముండాసురులను బట్టుకొని కర్కోటకునిచే బంధించి వింధ్యపర్వతమునకుఁ బరుగెత్తెను. అట్లేఁగి యామె కౌశికివద్ద సమస్తవృత్తాంతము నెఱింగించి, భయంకరకోశమును గ్రహించి, దానవేంద్రుల మస్తకశ్రేణులను, సుందరమునైన గరుడపక్షములచే రచింపఁబడిన నిరుపమాలలను మృగేంద్రచర్మధృక్కరమైన చండికకు సమర్పించెను. తరువాతఁ దాను గరుడపక్షరచితమైన యింకొకమాలను మస్తకమునకుఁ జుట్టుకొని దానవరుధిరమును పేయునును బానముచేయుట కారంభించెను. ఇఁక నిక్కడ దుర్గాదేవి యసురనేతలైన చండముండులను బట్టి రోషభరముతో వారిమస్తకములను విచ్ఛేదన మొనరించెను. అప్పు డసురమస్తకముచే దేవి కొకశిఖరము సిద్ధముచేయఁబడినది. తరువాత నామె శర్వనితోఁగూడఁ గౌశికివద్ద కేతెంచెను. అప్పుడు కౌశికిని జూచి యామె యిట్లనెను. దేవీ! ఈయుత్తమశిఖరమును స్వీకరింపుము. ఇది దైత్యద్వయమస్తకములచే సిద్ధముచేయఁబడినదియును, నాగరాజుచేఁ బరివేష్టితమైనదియును నై యున్నది." చాముండ యాశేఖరమును గ్రహించి తలపై ధరించి యామె కిట్లనెను—"నీమాలమున దుష్కటకార్యము నెఱవేర్పఁబడినది. నీవు చండముండుల మస్తకములచే నేర్పఱుపఁబడిన శేఖరమును ధరించితివి. ఈకారణమున నీవు జగత్తులలో 'చాముండ' యను నామముచేఁ బ్రసిద్ధురాల వయ్యెదవు." ఆమె యిట్లు చండముండుల ముండమాలను ధరించిన యాత్రిలోచనకుఁ జెప్పి ప్రీతిభాజనురాలైన యాదిగంబరురాలి కిట్లనెను—

"నీవీశత్రుసైన్యమును సమగ్రముగా సంహారింపుము." అని యిట్లామె పలుకఁగా నాదేవి వెంటనే శరాసనమును, విషాణకోటియుఁ బట్టుకొని ప్రచండరిపుబలమును సంహరించుచు నందందుఁ దిరుగుచు మిగిలిన యసురుల మూఁకలను ఖండించుచుండెను.

## —♦ శుంభనిశుంభవధ. ♦—

పులస్త్యుఁడు చెప్పుచున్నాఁడు—చండముండులు నిహతులు గాఁగానే దైత్యసైన్యము కొంతభాగము భంగి నొంది పలాయనమొందెను. దీని యాది చూచి శుంభుఁడు మహాసురుఁడైన రక్తబీజుని యుద్ధమునకు పంపెను. రక్తబీజుఁడును యుద్ధమునకేగి యుత్సాహించె నతో యుద్ధము చేయుచుండెను. అప్పుడు మహేశ్వరి యైనచండిక యాపదను గాంచి కొంచెము గూడ నొక భీషణసింహనాదము చేయుచుండెను. ఆనాదము గావించు నప్పు డామెముఖవివరమునుండి 'బ్రహ్మాణి' యావిర్భవించెను. ఆమె అక్షసూత్రముతోను, కమండలుకరముతోను, హంసవిమానారోహయై యుండెను. క్షణకాలములోనే త్రిశూలినియుఁ, ద్రినయనయు, వృషభారూఢయు, మహాభుజంగభూషిణియు, ఘోరదంష్ట్రినియుఁ, గుండలినియు నైన మహేశ్వరి ప్రాదుర్భావము నొందెను. తరువాత మయూరపింఛధారిణియు శక్తిశాలినియు నైన కౌమారి యావిర్భవించెను. ఓ దేవర్షీ! ఈకౌమారీశక్తి మయూరవరవాహనముపై విరాజిల్లుచుండెను. తరువాత దేవి బాహుయుగళమునుండి శంఖచక్రగదాసిధారిణియు, గరుడారూఢయు, శార్ఙ్గబాణధారిణియు నైన వైష్ణవీశక్తి సముద్భవించెను. తరువాత నామె దంష్ట్రములనుండి భూతలవిదారిణియు, మహోగ్రమునలహస్తయు నైన భీకర పుట్టెను. ఆమెపృష్ఠదేశమునుండి నాగవసిని యైన వారాహి

యుద్భవించెను. ఆమె కేసరములు విక్షేపముచేసి గ్రహనక్షత్రములను దారకారాజిని జెదరఁగొట్టుచుండెను. నఖరశాలినియు, దారుణస్వభావయు నైన నారసింహి యామెహృదయమునుండి యావిర్భవించెను. ఈశక్తు లన్నియు నసురసంహారమున కుత్సహింపఁగా చండిక నిర్భయముగా మరల శత్రుసైన్యము నుద్దేశించి మాటిమాటికి సింహనాదము చేయఁజొచ్చెను. ఈభయావహమైననాదమునుండి భువనమంతయుఁ బరిపూరితమైపోయెను. తరువాత దేవదేవుఁడైనశూలపాణి—త్రిలోచనుఁ డచ్చటకు విచ్చేసెను. అతఁ డచ్చటకు వచ్చి యంబిక కభివాదనపూర్వకముగా నిట్లనియెను—ఓయంబికా! నేను వచ్చియున్నాను. ఓదుర్గా! నే నేమిచేయవలయునో యాజ్ఞాపింపుము. దేవదేవుఁ డిట్లనుచుండఁగా, దేవిదేహమునుండి యుద్భవించి శివశక్తి యచ్చటకువచ్చి యిట్లనియెను.

శంకరా! నీవు దూతకార్యము గైకొని శుంభనిశుంభులకడ కేఁగి యిట్లు చెప్పుము—“మీరు బ్రతుకునం దాశయున్నచో, నో దురాచారులారా! వేగముగా మీరు సప్తమరసాతలమునకుఁ బారిపొండు వాసవుఁడు మరల స్వర్గరాజ్యమును బొందును, దేవతలు వ్యథాహీను లగుదురు. బ్రహ్మణాదివర్ణములు మరల యజ్ఞానుష్ఠానముల నిర్భయముగా సాగింతురు. లేక మీరు బలగర్వితులై యుద్ధక్రియ కేయభిలషించినచో వ్యగ్రచిత్తులగై యుద్ధమునకు రండు. నేను (శివ) తప్పక మిమ్ము నిహతులను గావించెదను.” ఓనారదా! శివ శివున కిట్లు దౌత్యకార్యము నియోగించెనుగాన నాటనుండియు నాతఁడు శివదూతినామమునఁ బ్రఖ్యాతుఁ డయ్యెను. తరువాత శుంభుఁడు మొదలగు దానవులందఱును ఆగర్వితశంకరునిమాటలు విని హుంకారములుచేయుచుఁ గాత్యాయనియున్నచోటి కేతెంచిరి. తరువాత శత

శతశరములును, శక్తి, అంకుశము, పరశ్వధము, శూలము, భిండివాలము, పట్టిశము, పరిఘ, అనునాయుధములను వారు దేవియెడలఁ బ్రయోగింపఁ జొచ్చిరి. అప్పుడు దేవియైన యంబికయు శ్రేష్ఠశరాసననిర్ముక్తమునైన శరసమూహములను బ్రయోగించి వారిబాహువులతోఁ గూడ వారిహస్తములను విచ్ఛేదనము గావించుచుండెను. మఱియు రణచండవిక్రమురాలైన యామహాదేవి శతశతములుగా బాణములు ప్రయోగించుచు నసంఖ్యాకులగు మహాసురులను కృతాంతమందిరమున కంపుచుండెను. చండమారి త్రిశూలాఘాతములచేఁ గొందఱు దానవులు నిహతులగుచుండిరి. కౌశికి స్వయముగాఁ గట్వాంగాఘాతములచేఁ గొందఱు దానవులను శమనాగారమున కంపుచుండెను. దేవి బ్రాహ్మి ప్రబలబలమును వినియోగపఱచి ముఖ్యులైన బహుదానవుల ప్రభావగౌరవమును భంగపఱచుచుండెను. దానవసేనలోఁ గొందఱుకొందఱు శూలాఘాతములచే విదారితులగుచుండిరి. మఱియుఁ గొందఱుకొందరు వైష్ణవీశరజ్వాలలలో దగ్ధులై భస్మీభూతుల లగుచుండిరి. అప్పుడు కౌమారి శక్తిప్రయోగములచేతను, చండీకులిశవిక్షేపములచేతను, వారాహీచక్రాఘాతములచేతను దానవసేనవిదారితమైపోవుచుండెను. నారసింహీ నఖాఘాతములచే బహుదానవుల వక్షోభాగములు చీల్పఁబడుచుండెను. రుద్రదూతి యట్టహాసములచే ననేకదానవుల భవలీలలు సాంగము అగుచుండెను. అప్పుడు రుద్రుఁడు త్రిశూలముచే బహుదానవులను దుద ముట్టించెను. గజాననుని పరశ్వధ ప్రహారములచేతఁగూడ ననేకదానవులు యమాలయమున కంపఁబడిరి. దేవి యీవిధముగా వివిధరూపములను ధరించి ముఖ్యముఖ్యదానవులను జీల్చుచుండెను. ఎందరెందరుదానవులు భూతలమునఁ బడిపోవుచుండిరో యంపరంపఱను, ఘాతవర్గములు తక్షణమే భక్షించి వేయు

చుండెను. వారును భూతభక్షితులై యెడతెగక యమాలయమునకుఁ బ్రయాణములు సేయుచుండిరి. బ్రహ్మి ప్రభృతిమాతృదేవతలు మహాసురులను సంహరించుట కుద్యతలుగాఁగానే వారు విపదాకులులై వీడివడిన కేశకలాపములతో, భీతిచంచలములైన నేత్రములతో బరువిడి రక్తబీజుని శరణుచొచ్చిరి. రక్తబీజుఁడును రోషపూరితుఁడై పెనుపులదర హుంకరించుచు నొకప్రశస్తమైన యస్త్రమును జేతఁబట్టుకొని మాతృగణమును, భూతగణమును, నలుదెసలనుండి బాధింపఁజొచ్చెను. వాఁడట్లు వచ్చుచుండుటఁ జూచి మాతృగణము సుతీక్ష్ణ దనికరముచే వర్షమును గురియింపఁజొచ్చెను. అప్పుడు రక్తబీజునిరక్తము బిందుబిందువులుగా భూమిపైఁ బడఁజొచ్చెను. అప్పుడారక్తబిందువులనుండి వెంటనే బిందువుల కొక్కొక్కఁడుగా రక్కసు లనేకు లుద్భవిల్లెరి. అది చూచి చండమారియు నంబికయు నిట్లాలోచించుకొనిరి—ముందుగా వీనిని నంహరించుట కర్తవ్యము. ఓచండీ! నీవు బాడబాగ్నిసన్నిభమైన నీముఖవివరమును దెఱచికొని యీమహాసురుని రుధిరప్రవాహముఁ బానముచేయుట కారంభింపుము"

అదివిని యాచర్మముండ, యావరదాదేవి తనకరాళవదనమును విశాలము గావించి యొకపెదవిచే నాకాశమును రెండవపెదవిచే భూమిని నాక్రమించి నిలుచుండెను. అప్పు డంబిక తనశత్రువైన రక్తబీజునిజుట్టు పట్టుకొని తనవదనగహ్వరములోని కీడ్చి శూలముచే వానివక్షమును జీల్చెను. అప్పుడు శత్రువక్షమునుండి నిర్గతమగుచున్నరక్తమంతయు దేవివదనవివరమునందే పడఁజొచ్చెను. ఈవిధముగా రక్తబీజుని రక్తమంతయు విశోషితము కాఁగానే యాతఁడు హీనబలుఁడై పడిపోయెను. తరువాత దేవి జామీకరమయమైన చక్రముచే హీనబలుఁడైన యాశత్రువును శతఖండములుగా విభాగించి పారవేసెను.

ఈవిధముగా దానవసేనాని నిహతుఁడు కాఁగానే యసురులందఱుఁ గ రుణభావములతోఁ జీత్కారములు చేయఁజొచ్చిరి. అప్పుడు దానవ సేనలోనుండి— "హా తాతా! హా భ్రాతా! యెక్కడ కేఁగితివి? ఒక్కనిముస మాఁగుము" అను నాలాపములతో రోదనములు జయిలు దేఱెను. మృడానిహస్తమునం దింకను బహుదానవులు నిహతులై నగ్నావస్థయందు భూతలమునఁ బడి పొరలుచుండిరి. వారి కేశకలాపములు భూరజముచే బ్రుంగుడుపడియుండెను. వారిదేహచర్మములు విశీర్ణములై యుండెను. అట్టివారిని జూచి తక్కినరక్కసులు గిరివరము నెక్కి పారిపోయిరి. దానవేంద్రుఁడైన నిశుంభుఁ డప్పుడు తనసైన్య బలముయొక్క చర్మవర్మములును, భూమణాయుధములును విశీర్ణములై యుండుటఁ జూచి విపులచక్రికయుక్తమైన రథము నారోహించి, క్రోధభరముచే శిరఃకంపనము సేయుచు మృడానికభిముఖముగాఁ బరు గెత్తఁజొచ్చెను. ఆనిశుంభదానవుని కరమునందు ఖడ్గమును, దేహమునందు భాస్వరవర్మము నుండెను. అతఁ డప్పుడు దేవీరూపమును జూచి మోహితుఁడై కామజ్వరపీడితుఁడై చిత్రించినబొమ్మవలెఁ గద లక మెదలక నిలిచిపోఁజొచ్చెను. సురశత్రుఁడైన యాదానవుఁ డట్లు స్తంభితుఁ డగుటఁ జూచి దేవి హాస్యపూర్వకముగా నిట్లనియెను.

"ఓహో! నీవిట్టితేజముతోడనేనా దేవతలను జయించితివి! మఱియు నిట్టిబలప్రభావముతోడనేనా నన్ను బ్రార్థించుచున్నావు?" ఆమాటలు విని వాగ్మివరుఁడైన దానవుఁ డప్పుడు కౌశికి నీక్షించుచు నించుకసేపు నిలువఁబడి యాలోచించి యిట్లు పలికెను. "ఓభీరులా లా! నీదేహ మతికోమలమైనది. సలిలమునకు ఆమపత్రమువలె నా బాణవర్షమునకు శతధాభిన్నములై పోఁగలదు. ఓసుందరీ! యీచింత చేతనే నీపై బాణప్రయోగము చేయుటకు నామన సొప్పకున్నది.

ఓవిశాలనయనా ! నిజముగా నీవు నన్ను భజింపుము. నాఖడ్గాఘాతములు సహించుట కింద్రుఁడుగూడ స్వయముగా సమర్థుఁడు గాఁడని తెలిసికొనుము. అందుచే యుద్ధవ్యాపారమునుండి మనసును మరలింపు. ఆలస్యముచేయక నాకు భార్యవు గమ్ము."

ఓమునీంద్రా ! యోగేశ్వరి నిశుంభుఁడు పలికిన యీపలుకులు విని హాస్యపూర్వకముగా భావగంభీరవాక్యములతో నాతనికి మరల నిట్లనియెను. "ఓవీరా ! నేను యుద్ధమునందుఁ బరాజితురాలను గానిదే యెవ్వనికిని భార్యను గాఁజాలను. నీవు నన్ను భార్యగాఁ బరిగ్రహింపఁగోరుచున్నచో, సంగ్రామమున నన్ను జయింపుము."

ఓనారదా ! కౌశికి యిట్లు పలుకఁగానే నిశుంభదానవుఁడు ఖడ్గమును ద్రిప్పుచు నత్యంతవేగముగా నామెపై విసరెను. దేవి యప్పుడు దానవప్రేరితమైన యాయస్త్రము నారుబాణములచేఁ జర్మసహితముగా విచ్ఛేదన మొనరించెను. అప్పు డక్కడ నొక యద్భుతవ్యాపారము జరిగినది. చర్మసహితముగా ఖడ్గము విచ్ఛేదము కాఁగానే వాయువేగిమైన మహాసురుఁడు గదను జేఁబూని కౌశికపైఁ బడెను. దానవుఁడు దేవిని సమీపించియు సమీపింపనంతలోనే దేవి యాతని యాలింగితదృఢబాహువులను ముసలమును నస్త్రముచేఁ దునియలుగావించెను. అప్పు డాభయంకరసురశత్రుమైన ప్రచండదానవుఁడు భూపతితుఁడు కాఁగానే చండీప్రముఖమాతృగణము హర్షముతోఁ గిలకిలారావము లొనరింపఁజొచ్చిరి. శత్రుపయముచే సంతుష్టులై యింద్రాదిదేవత లాకాశపథమునుండి యుచ్చస్వరముతో నిట్లు పలికిరి. "దేవీ ! విజయీ ! నీవు జయముత్తవు గమ్ము." భూతగణ మప్పుడు నాల్గుదెసలనుండియుఁ బూర్యఘోషను లొనరింపఁజొచ్చెను. దేవతలు కాత్యాయనిపైఁ బుష్పవృష్టి గురిపింపఁజొచ్చిరి.

ఓ మహామునీ ! నిశుంభుఁడు నిపతితుఁడుగాఁగానే జ్యేష్ఠుఁడైన శుంభుఁడు క్రోధపూరితుఁడై బృందారక మను గజమెక్కి పాశమను నాయుధమును జేతఁబూని రణాంగణమునఁ బ్రవేశించెను. దానవపతి యిట్లు గజారోహకుఁడై వచ్చుటఁజూచి దేవియర్ధచంద్రాకారబాణముల నాలుగింటిని గైకొని, లీలాహాసము గావించుచు క్షురప్రబాణముచే దనుజవాహనమైన ద్విపేంద్రమును పాదద్వయము ఖండించెను. మఱి రెండుబాణములచే దానికుంభస్థలములుఁజీల్చి పడఁజేసెను. పాదద్వయముఖండితముగాఁగానే వాసవవజ్రహతమైన శైలశృంగమువలె గజము గతజీవముకాఁగానే శుంభుఁడు దానిపైనుండి పడిపోయెను. తత్క్షణమే శివాదేవి బాణాఘాతముచే నాతని కుండలమండితమస్తకమును ఖండించివేసెను. మస్తకము విచ్ఛిన్నముగాఁగానే దైత్యుఁ డప్పుడు కుంజరముతోఁగూడ మృతినొందెను. సురాసురశత్రులైన శుంభనిశుంభులు దేవిచే నిహతులైరని విని యింద్రసూర్యవాయు ప్రముఖులైన దేవతలందఱు నప్పు డచ్చట కరుదెంచి వినయవినమ్రులై దేవినుద్దేశించి శ్రుతిమధురమైన స్తోత్రపాఠమును గావింపఁజొచ్చిరి—" ఓపాపనాశినీ! భగవతీ ! నీకు మేము నమస్కరించుచున్నాము. ఓసురశత్రుదర్పఘాతినీ, హరిహయరాజ్యదాయినీ, మఖభంగకారిణీ ! నీకు మేము నమస్కరించుచున్నాము. ఓసురారిభయంకరీ, ఇంద్రవందితా, మహిషమర్దినీ, హరిహరాదిస్తుతా ! నీకు మేము పలుమాఱు నమస్కరించుచున్నాము. ఓయష్టాదశబాహుశాలిని, శుంభనిశుంభనిషూదనీ, ఆర్తినాశినీ, త్రిశూలినీ, నారాయణీ, చక్రధారిణీ ! నీకు నమస్కరించుచున్నాము. ఓవారాహీ, ధరాధరా, నారసింహీ ! నీకు సర్వదా ప్రణామము లొనరించుచున్నాము. ఓకౌమారీ, మయూరవాహినీ, వజ్రధరా ! నీకొఱకు మేము పునఃపునఃప్రణామము లొనరించుచున్నాము.

ఓపైతామహీ, హంసవాహనా, మాలావికటా, సుకేశినీ, వానవపృష్ఠచారిణీ, జగన్మాయే! నీకు మాయాశేష నమస్కారములు. ఓవిశ్వేశ్వరీ, నీకు నమస్కారములు. నీవు రక్షింపుము, మఱియు దేవద్విజశత్రువులను సంహారింపుము. ఓసర్వమయివైనత్రినేత్రా! నీకుఁ బునఃపునఃప్రణామములు. ఓవరదా! నీవు ప్రసన్నురాలవు గమ్మ. నీవు బ్రహ్మాణివి, ఖశ్రేష్ఠవాహనారోహణకారిణివి! నీవు సుందరవదనశాలినీ వారాహివి, గరుడవాహినివి, శార్ఙ్గధారిణివైష్ణవివి, అతిదుర్నిరీక్ష్యనారసింహివి, ఘుర్ఘురితశబ్దకారిణివి, కులిశశాలినివి, ఐంద్రివి, నీవు చండముండామారీ శవవాహినీ యోగినీ యోగసిద్ధవు. ఓత్రినయనే, భగవతీ! నీకు నమస్కారము. అహరహమునానతమస్తకులై యెవ్వరు నీచరణయుగళము నాశ్రయించుచున్నారో, బలికుసుమహస్తులై యెవ్వరు నీస్తుతిపరాయణులగుచున్నారో వారి కెప్పుడును నశుభములు సంభవింపవు."

సురశ్రేష్ఠు లిట్లుస్తవమొనరింపఁగా, సురశత్రువినాశినియైనదేవి మందహాస మొనరించుచు సురసిద్ధమహర్షివర్గమున కిట్లనియెను—నేను మీప్రసాదమువలన సంగరక్షేత్రమందు సురశత్రువుల నద్భుతరీతిని బరాజితులఁ గావించితిని. ఇప్పుడు మీ రందఱును నాకొఱకుఁగావించిన యీస్తోత్రపాఠమును ముందుముందు నరశ్రేష్ఠులెవ్వరైన భక్తియుక్తులై పఠించినచో వారికెప్పుడును దుస్స్వప్నభయము గలుగదు. అదియటుంచి నన్ను మీరు మఱియొకవరముఁ గోరుఁడు" అని దేవి పలుకఁగా దేవతలు మరల నిట్లనిరి—దేవీ! నీవు మాకు వరదానముచేయఁదలఁచినచో, ఓహుతాశనతుల్యశరీరా! దేవద్విజగోశిశుసమూహమునకు హితవుచేయుటకొఱకు నీవు మరల నొకమాఱు దేవరిపులందఱను దగ్ధముచేయవలెను. దేవి మరల నిట్లనియెను—నేను నందగృ

హామన యశోదగర్భమునఁబుట్టి మరల నొకమాఱు సురశత్రువులన సంహరింపఁగలను. తరువాత దశనప్రహారములచే శుంభనిశుంభ, లవణులు నావలన నిహతులగుదురు. ఓసురవరులారా ! మరలఁ గలియుగమందు లోకు లనశనులగుట చూచి నేను శతక్రతువను వానిగృహమున మారీరూపమునఁ బుట్టి శాకసంకరమూలమున సురసమూహము ను భరింపఁగలను. ఓసురలారా ! విపక్షులగువారిని విక్షతులను గావించి ఋషులపరిరక్షార్థము వింధ్యాచలమునం దావిర్భవించెదను. దుష్టబుద్ధులైన దైత్యులను వినష్టులుగావించి మరల జయమొందెదను, ఓదేవతలారా ! మహాసురుఁడైన యరుణాఖ్యుఁ డెప్పు డుద్భవించునో, అప్పుడు సర్వదేవతలహితముకొఱకు నే నావిర్భవింపఁగలను. అట్లావిర్భవించి మహారిరూపమున వానిప్రాణములను హరించి మరల స్వర్గమున కేఁగఁగలను ”

పులస్త్యుఁడు మరలఁ జెప్పుచున్నాఁడు—వరదాయినియైన కాత్యాయిని సురగణమున కిట్లు చెప్పి ద్విజులకుఁ బ్రణామములు గావించెను. తరువాత భూతసమూహమునకు సెలవొసంగి తానాకాశమార్గమున వెడలిపోయెను. సిద్ధగణము నామెను వెంబడించెను. దేవియొక్క యీపరమపవిత్రమైన పౌరాణికాఖ్యానము పురుషులకు మంగళజనకము. ఈజయాఖ్యానము రాక్షసవినాశన సమర్థమైనదని భగవానుఁడు స్వయముగాఁ జెప్పియున్నాఁడు. నిజముగా సంయతచిత్తులై యందఱు నీకథ వినుట కర్తవ్యము.

## —♦ కార్తికేయోత్పత్తి ♦—

నారదుఁ డడుగుచున్నాఁడు—ఓసువ్రతా ! సుప్రసిద్ధ మహిష క్రౌంచులను స్కందుఁ డెట్లు విదారణ మొనరించెను ? ఓయనుపమద్యుతీ ! బ్రాహ్మణా ! నాకావృత్తాంతమంతయు వివరించి చెప్పుము. పుల

స్త్యుఁడు చెప్పుచున్నాఁడు— "నారదా! ఆకర్ణింపుము. నేను కుమా రకార్తికేయుని యశోవర్ధనమైన పురాతనపుణ్యకథను నీకు వివరించి చెప్పెదను. హుతాశనుఁడు పినాకిశుక్రమును పానముచేసెను. కాని ఓబ్రహ్మర్షీ! ఆశుక్రమాతని నాక్రమించుటచే నాతఁడు మందతేజుఁ డై పోయెను. తరువాత ననుపమదీప్తిశాలి యగు ననలుఁడు దేవతల సమీపమున కేఁగెను. తరువాత నక్కడనుండి దేవతలప్రేరణచే బ్రహ్మభవనమున కేఁగెను. అతఁడు వచ్చుచున్నపుడు మార్గమధ్యమమునం దాతనికిఁ "కుటిల" కనఁబడియెను. ఆకుటిలను జూచి యాతఁడు "ఓకుటిలా! మహేశ్వరుఁడు సుదుర్ధరమైన ఈతేజమును విడిచి యు న్నాఁడు. ఈతేజఃప్రభావముచే నిఖిలభువనములు ననాయాసముగా దగ్ధములు కాఁగలవు. అందుచే నీవు దీనిని ధరింపుము. ఇందుచే నీ కొక సర్వజనస్తోత్రపాత్రుఁడైన పుత్త్రుఁడు జన్మింపఁగలఁడు."

అగ్నిదేవుని యీమాటలవలనఁ గుటిలకుఁ దనపూర్వసంకల్ప మొకటి తనమనసులో జ్ఞప్తికి వచ్చెను. ఆమె యప్పుడు విస్తారమైన జలమయమూర్తిని ధరించి విరాజిల్లుచు వహ్నికిట్లనియెను. "నాజల ములయం దాతేజము నుంచుము." తరువాత నాశైవతేజము జలము నం దుంచఁబడఁగా దేవియైన కుటిల దానిని ధరించెను. భగవానుఁ డైన హుతాశనుఁ డప్పుడు కామచారియై యథేచ్ఛముగా సంచరింపఁ జొచ్చెను. హవ్యవాహనుఁడు మొట్టమొదటఁ బంచసహస్రవర్షము లాశైవతేజమును ధరించియుండెను. అట్లు ధరించియున్నకాలమునం దాయగ్నిదేవుని కాతేజఃప్రభావముచే మాంస, అస్థి, రుధిర, మేదో, మజ్జా, రోమ, శ్మశ్రు, నేత్రప్రభృతు లన్నియు హిరణ్మయాకారము లు ధరించెను. అందుచే నాతఁడు లోకములో హిరణ్యరేతుఁ డనుపే రఁ బ్రసిద్ధుఁ డయ్యెను. తరువాతఁ గుటిల పంచసహస్రవర్షము లా

తేజమును ధరించి, యొక యనలాకారమైన గర్భమును దాల్చెను. అట్లుండి యామె బ్రహ్మలోకమున కేఁగెను. బ్రహ్మ యామహాపగయైన కుటిల తృప్తిమతియై యుండుట చూచి "నీకు గర్భ మెట్లు గలిగె" నని యడిగెను. కుటిల యిట్లనియెను. "ఓసత్తమా! పూర్వము వహ్ని శివతేజమును పానము చేసెనుగదా! తరువాత నాతఁ డాతేజమును ధరించుటకు సమర్థుఁడుగాక నాయందు దాని నుంచివేసెను. ఓపితామహా! అప్పటినుండియు నేను నేఁటివఱకుఁ బంచసహస్రవర్షములుగా దానిని భరించుచుంటిని. కాని దాని కిప్పుడు కాలము వచ్చినది. అయినను అది వెడలఁబడకున్నది." అని కుటిల చెప్పఁగా విని బ్రహ్మ—ఓసుశ్రోణీ! నీవు ఉదయాచలమున కేఁగుము. అక్కడ శతయోజనవైశాల్యముగల యొకభయంకరశరవణ మున్నది. నీవావనమున కేఁగి విశాలగిరిసానువునందుఁ బ్రసవింపుము. తరువాత దశసహస్రవర్షములకుఁ బైని దానివలన నొకపుత్రుఁ డుత్పన్నమగును." అని చెప్పెను.

గిరినందినియైన కుటిల యక్కడనుండి బయలుదేఱి బ్రహ్మ చెప్పిన ట్లేఁగి యచ్చట ముఖద్వారమున గర్భపరిత్యాగముఁ గావించెను. అట్లు ప్రసవించినతరువాత నామె వెంటనే సురల బ్రహ్మభవనమున కరుదెంచి యప్పుడు మంత్రబలముచేఁ దిరిగి జలమూర్తిని ధరించెను. ఇక్కడ శైవతేజఃప్రభావముచే నావిశాలశరవణమునందలి వృక్షములుఁ, బక్షులు, మృగములు మొదలగు నన్నియు స్వర్ణమయములై ప్రకాశించుచుండెను. అనంతరము పదివందలసంవత్సరములు నిండఁగానే కమలనేత్రుఁడును బాలార్కదీప్తుఁడు నగునొక బాలకుఁ డుత్పన్నమయ్యెను. సర్వైశ్వర్యముల కాధారుఁడైన యాబాలకుఁ డాదివ్యశరవణమునం దుత్తానశాయియై యంగుష్ఠము నోటఁ బెట్టుకొని ఘన

రాజగంభీరమైన నినాదముతో రోదనముచేయఁజొచ్చెను. ఈసమయమునందు దివ్యతేజస్వినులగు నాఱుగురు కాంతలు—కృత్తికలనువారు స్వేచ్ఛానుసారముగాఁ దిరుగుచుఁ దిరుగుచు శరవణమునందున్న బాలకుని జూచిరి. చూచినంతనే వారు కృపాకులస్వాంతులై యాస్కందుఁ డున్నచోటి కరిగిరి. అట్లేఁగి వా రాకుమారునకు «నేను ముందుగాఁ బాలిచ్చెద, నేను ముందుగాఁ బాలిచ్చెద" నని పరస్పరచీత్కారములు చేయఁజొచ్చిరి. బాలకుఁడైన స్కందుఁ డప్పుడు వారట్లు వివాదపడుచుండుటఁ జూచి వెంటనే షణ్ముఖములను ధరించెను. అంతటఁ గృత్తికలందఱును స్నేహవశులై యార్గురు నాఱుముఖములఁ బాలిచ్చుచు నాతని బెంచుచుండిరి. వారిభరణపోషణములచే బాలకుఁడు వర్ధిల్లుచుండెను. అప్పటినుండియు నాబలిష్ఠబాలుఁడు కార్తికేయుఁ డనుపేర విఖ్యాతుఁడగుచుండెను. ఓబ్రహ్మర్షీ! ఈసమయమునఁ గమలయోని పావకు నిట్లని ప్రశ్నించెను.

«పావకా! నీపుత్రుఁడైన గుహుఁ డిప్పు డెట్టియాకారమున వర్ధిల్లుచున్నాఁడు?" అని అగ్నిదేవుఁ డప్పుడు బ్రహ్మదేవుని మాటవలనఁ దనపుత్రవృత్తాంతముఁ దెలిసికొనియు నాతనితో «గుహుఁ డెవ్వరో నే నెఱుఁగను." అని పలికెను. అప్పుడు భగవానుఁడైన బ్రహ్మ ప్రీతితో నిట్లనియెను. «మొట్టమొదట నీవు శాంభవతేజమును పానముచేసి యుంటివి. ఆతేజమునుండి త్రిలోకపతియైన యొకకుమారుఁడు శరవణమునందు జన్మించియున్నాఁడు." అని పితామహుఁడు పలుకగానే యగ్నిదేవుఁ డతిత్వరితముగా నేఁగి వేగవంతమైన మేషము నొకదాని నారోహించి బయలుదేఱి వెడలిపోయెను. అతఁ డట్లేఁగుచుండఁగా మార్గములోఁ గుటిల యాతనిని జూచి «కవీ! నీవింత త్వరితముగా నేఁగుచున్నా వెక్కడకు?" అని ప్రశ్నించెను. అందుల

కాతఁడు — “శరవణమునందు శిశువు జన్మించెను. నే నాపుత్త్రుని జూచుటకై వెడలుచున్నాను.” అని చెప్పెను. కుటిల “ఆపుత్త్రుఁడు నాపుత్త్రుఁడే గదా!” అనియెను. పావకుఁడు “కాదు. ఆపుత్త్రుఁడు నాపుత్త్రుఁడే” అనియెను. ఇట్లిద్దఱకును వివాదము సంభవించెను. ఆసమయమందు స్వేచ్ఛావిహారియైన జనార్దనుఁడు వారిద్దఱు నట్లువివాదపడుచుండుటఁ జూచి “ఏల మీరిట్లు వివాదముఁ జెందుచుంటిరి?” అని యడిగెను. అప్పుడు వారుభయులు “శైవశుక్రసంభూతుఁడైన శిశువుకొఱకు వివాదపడుచుంటి” మని చెప్పిరి. జనార్దనుఁ డప్పుడు వారివివాదమును బరిష్కరించుట కిట్లు చెప్పెను. “మీరు త్రిపురహారునిదగ్గఱ కేఁగుఁడు. ఆతఁ డెట్లు చెప్పునో నిస్సందేహముగా నట్లు చేయుఁడు.” ఓనారదా! వాసుదేవుఁడును వారితో హరాంతికమున కేఁగి యాపుత్త్రుఁ డెవరికిఁ జెందుట న్యాయమగునో చెప్పు మని కోరిరి. రుద్రుఁడు వారిమాటలు విని యత్యంతప్రముదితాంతరంగుఁడై పూర్ణపులకాంకురితగాత్రుఁడై గిరినందిని వీక్షించి “ఓహో! ఎంతటి భాగ్య మెంతటిభాగ్యము!” అని పలికెను. అప్పు డంబిక శివు వీక్షించుచు “దేవా! రండు. మన మాశిశువువద్ద కేఁగుదము. ఆతనినే ప్రశ్నింతము. తరువాత నాబాలకుఁ డెవ్వని నాశ్రయించునో వారికే పుత్త్రుఁ డగునని స్థిరపఱుపవచ్చును.” అనియెను. వృషధ్వజుఁడు పార్వతి పలుకులకు సమ్మతించెను. తరువాత నుమాదేవిని, కుటిలాదేవిని, పావకుని వెంటఁబెట్టుకొని యాశరవణమున కేఁగెను. వారచ్చటి కేఁగునప్పటి కాశిశువు కృత్తికలయొడిలో శయనించి యుండెను.

పిమ్మట వారివారిస్నేహపూర్వకాభిప్రాయములను దెలిసికొని, యోగబలముచే నాషడాననుఁడు చతుర్మూర్తియయ్యెను. అందుఁ గుమారమూర్తితో శంకరుని, విశాఖమూర్తితోఁ బార్వతిని, శాఖమూ

ముతోఁ గుటిలను, నైగమేషరూపముతో నగ్నిదేవుని నాశ్రయించెను. అప్పుడు రుద్రుఁడు, పార్వతియు, గుటిలయు, నగ్నియుగూడఁ బరమ ప్రీతియుతులైరి. అప్పుడు కృత్తికలు—'ఈషడాననుఁడు హరనందనుఁడా?' అని యడిగిరి. హరుఁ డప్పుడు హర్షచిత్తముతోఁ గృత్తికలను జూచి—ఓకృత్తికలారా! ఈశిశువు కార్తికేయుఁ డనునామముతో మీపుత్రుఁడే యగును. ఇది గాక కుటిలకుఁ గుమారుఁ డనియు, గౌరికి స్కందుఁ డనియు, నాకు గుహుఁ డనియు, హుతాశనునకు మహాసేనుఁ డనియు నామములతో నీపుత్రుఁడు ప్రఖ్యాతుఁ డగుటకు నిర్దేశింపఁబడెను. ఈశరవణమునకు సారస్వతాఖ్యతోఁ బుత్రుఁడై ప్రసిద్ధి నొందఁగలఁడు. మహాయోగియైన యీపుత్రుఁ డీవిధముగా లోకప్రసిద్ధుఁడై షడంశత్వహేతువుచే షడాననుఁ డని విఖ్యాతిఁ గాంచును." అని శూలపాణియైన భగవంతుఁడు వారి కెఱింగించి యప్పుడు పితామహుని దేవతలను స్మరించెను. తత్క్షణమే దేవతలందఱు నతిత్వరితముగా నచ్చటి కరుదెంచి హరపార్వతులకుఁ బ్రణిపాతములొనరించి సంప్రీతభావములతోఁ గుటిలను, హుతాశనుని, కృత్తికలను దిలకించిరి. తరువాత నాషణ్ముఖకుమారుని జూచిరి. ఆబాలకుఁడు మగ్నిరీక్ష్యతేజముతోను, సూర్యసన్నిభమైన దేహప్రభలతో డను వారి కగపడియెను. అతఁడు తనతేజఃప్రభలచే దేవత లందఱికన్నులను మిఱుమిట్లుగొలుపుచుండెను. దేవతలందఱు నప్పుడు కౌతుకాక్రాంతులై యిట్లు పలుకఁజొచ్చిరి—ఓయగ్నిదేవా! నీవు దేవకార్యమును నెఱవేర్చితివి. ఇఁక మన మిప్పుడే, మాహాత్మ్యమండితమును నవ్యయమునగు కురుక్షేత్రమునకును, సరస్వతీతీర్థమునకును వెడలి షడాననున కభిషేక మొనరింపవలయును. ఓదేవగంధర్వకిన్నరులారా! ఈతఁడే మనకు సేనాపతియై దారుణస్వభావులగు మహిషాసురతారకాసురులను నిహతులను గావింపఁ

గలఁడు." అని దేవతలు పలుకఁగా దేవదేవుఁడు వారి ప్రస్తావమునకు సమ్మతించెను.

అప్పుడు సురలందఱు లేచి కుమారస్వామిని వెంటఁబెట్టుకొని మహాఫలజనకమైన కురుక్షేత్రమునకు బయలుదేఱిరి. అక్కడి కేఁగి మునిబృందముతో నింద్రుఁడు, రుద్రుఁడు, బ్రహ్మ, జనార్దనుఁడు మొదలగు సమస్తదేవతలును గుహస్వామి కభిషేకము గావించుటకు సకలప్రయత్నముల నాసక్తితోఁ జేయఁజొచ్చిరి. తరువాత హరుఁడు నచ్యుతుఁడు మొదలగు దేవతాశ్రేష్ఠులు సప్తసాగరజలములచేతను, నదీజలములచేతను, బహువిధౌషధులవలన సహస్రసహస్రవిశేషముల నాతనికభిషేకము గావించిరి. దివ్యరూపధారియైన దేవసేనాని కభిషేకముగావించుట పూర్తియయ్యెను. గంధర్వులును ఋషులును గానము లొనరింపఁజొచ్చిరి. అప్సరోనికరములు నృత్యములు సేయఁజొచ్చెను. అభిషిక్తుఁడైన కుమారునిఁ జూచి గిరిబాల స్నేహాభరముచే స్కందునొడిలోఁ జేర్చుకొని పలుమాఱు ముద్దులాడఁజొచ్చెను. పూర్వకాలమునందు దేవమాతయైన యదితి యింద్రునిమోమును ముద్దాడుచున్నప్పు డెట్లుండెనో, అట్లే కార్తికేయుని యభిషిక్తవదనము నాఘ్రాణించుచున్న యాగిరీంద్రనందిని విరాజిల్లఁజొచ్చెను. అభిషిక్తుఁడైన తనపుత్రునిజూచి మహాదేవుఁ డప్పుడు పరమప్రీతుఁ డయ్యెను. పావకుఁడును, కృత్తికలును, కీర్తిమతియైన కుటిలయుఁగూడఁ దమయంతరంగములయందు హర్షాతిశయము నొందిరి.

తరువాత మహాదేవుఁడు సేనాధిపతిగా నభిషిక్తుఁడైన గుహునిఁ జూచి, శక్రసమానపరాక్రమవంతులగు నల్వురుప్రముఖుల నాతనికి సాహాయ్యముగా నియోగించెను. ఈప్రముఖుల నల్వురను గ్రమముగా ఘంటాకర్ణుఁడు, లోహితాక్షుఁడు, నందిషేణుఁడు, కుముదమాలి యను

నామములు గలవు. వీరునల్వురును సుప్రసిద్ధులు, నతిభయంకరులు నైనవారు. ఓనారదా! స్కందునకు సాహాయ్యముగా హరుఁడు ప్రమథగణము నొసంగుట చూచి బ్రహ్మమొదలగు దేవతలందఱును దమతమగణములనుగూడఁ గుమారస్వామి కొసంగిరి. వానిలో బ్రహ్మయొసంగినది స్థాణుగణమని ప్రసిద్ధిగలది. విష్ణువొసంగినవి—విక్రమ, సంక్రమ, పరాక్రమములనుపేరులుగల మూఁడుగణములు. ఇవిగాక శక్రుఁడు—ఉత్క్రోశము పంకజము, రవి—దండము కపింజలము; చంద్రుఁడు—మణి వసుమణి; అశ్వినీకుమారులు—వత్స నంది; హుతాశనుఁడు—జ్యోతి జ్వలజ్జిహ్వుఁడు; విధాత—కుంద ముకుంద కుసుమ; నామకగణములను గార్తికేయునకు ననుచరులుగా నొసంగిరి. తరువాత త్వష్ట—చక్ర, అనుచక్రులను, వేధ—స్థిర సుస్థిరులను; పూష—మహాబల పాణిత్యజ కాళికులను; హిమవంతుఁడు—ప్రమథోత్తముఁడైన స్వర్ణచూల్య ఘనాహ్వులను, ఉన్నతవింధ్యగిరి—అతికృష్ణ పార్శ్వములను, వరుణుఁడు—సువర్చస, అతివర్చసులను, నాగగణము—సంగ్రహ విగ్రహ జయ పరాజయులను, అంబిక—ఉన్మాద శంకుకర్ణ పుష్పదంతులను, వాయువు—ఘస, అతిఘసులను, సూర్యుఁడు—పరిఘ వటక భీమ దాహ, అతిదాహములను, యముఁడు—ప్రమథ ఉన్మాథ కాలసేన మహాముఖ తాలపత్ర కాలజంఘులను, ధాత—సుపత్ర శుభకర్మలను గణేశ్వరద్వయమును, షడాననునకనుచరులుగా నర్పించిరి. ఓద్విజోత్తమా! తరువాత యక్షులు—అనంత శంకుపీర నికుంభ కుముద అంబుజ ఏకాక్ష కునటీ చక్షు కిరీటీ కలశోదర సూచీవక్త్ర కోకనద ప్రహాస ప్రియక అచ్యుతనామములుగల పంచదశగణమును గుహునిసాహాయ్యార్థ మర్పించిరి. తరువాతఁ గాళింది కలకందను సమరించెను. నర్మద రణోత్కటు నర్పించెను. ఈవిధముగా గోదా

లంసింధు కూరోర్మియు, తమస అద్రి కంపకులను, శీత సహస్రగా హుని, వంజుల స్మితోదరుని, మందాకిని గంధుని, విపాశ ప్రియంకరుని, ఐరావతి చతుర్దంష్ట్రుని, వితండ షోడశుని, కౌశికి మాజరిని, గౌతమి క్రియక్రౌంచులను, బాహుద శతశీర్షుని, బాహ గోనందనందకులను, భీమరథి భీముని, సరయువు వేగారిని, కాళి అష్టబాహుని, గండకి సుబాహుని, మహానది చిత్రదేవుని, శిప్ర చిత్రరథుని, కుహువు కువలయుని, మధూదిక మధువర్ణుని, ధృతపాప జంబుకుని, వేత్ర శ్వేతానను, వేణ స్తుతుని, రేవ సాగరవేగిని, ప్రభావ అర్ధసహుని, కాంచన కనకేక్షణుని, విమల గృధ్రవక్త్రుని, మనోహర చారుపాత్రుని, ధృతపాప మహారావుని, కర్ణ విద్రుమసన్నిభుని, ఓఘవతి సుప్రసాదుని, సువేణుని, జిష్ణుని; విశాల యజ్ఞబాహుని, ఈవిధముగా సకలసరోవరములును దమతమగణములను గార్తికేయున కనుచరులుగా నొసంగెను. కుటిల ఇంద్రతుల్యపరాక్రముమైన తంతనయులను ముప్పదిగణముల వారి నొసంగెను. జటాధర—కరాళ సితకేశ, కృష్ణకేశ, మేఘనాద, చతుర్దంష్ట్ర, విద్యుజ్జిహ్వ, దశానన, సోమాప్యాయన, ఉగ్ర, దేవ దేవయాజి, నామకగణములను సమర్పించెను. హంసాస్య, కుండజఠర, ముద్గగ్రీవ, హయానన, కర్మగ్రీవ లను నీపంచగణమును కృత్తికలు పుత్రునకు నొసంగిరి. ఋషులు స్కందునకు—స్థానుజంఘు, కుంభవక్త్ర, లోహజంఘు, మహానన, పిండాక నామకపంచగణము నొసంగిరి. పృథూదకతీర్థము—నాగజిహ్వ, చంద్రభాస, పాణికూర్మ, అశికుక, చాపవక్త్ర, జంబుకనామకులను గుమారునకు ననుచరులుగా నొసంగెను. చక్రతీర్థము—సుచక్రాఖ్యుని, గయాశిరుని మకరాఖ్యుని నొసంగెను. కనఖలము—పంచశివనామకగణము నొసంగెను. ఇవిగాక బ్రహ్మదత్తము—అజశిరుని, పుష్కరము—బాహుశాలకుని,

మానసతీర్థము—సౌర్వాజసుని, మహిషికుని, పింగలకుని నొసంగెను. శౌశవసతీర్థము రుమ్రి నొసంగెను. మాతృగణము కొన్ని ముఖ్యగణముల నొసంగెను. సోమతీర్థము—వసుదామకుని, ప్రభాసతీర్థము—నందినిని, ఇంద్రతీర్థము—విశోకకుని, ఉదపానతీర్థము—ఘనస్వనను, సప్తసారస్వతము—అద్భుతాకారమాతృగణమును నొసంగెను. నాగతీర్థము—గిరితప్రియమైన మాధవిని, తీర్థనేమిని, స్మితాననను, ఏకచూడను నొసంగెను. కురుక్షేత్రము—కలాస్పదను,—బ్రహ్మయోని—మండసితను; భద్రకాళి—త్రివిష్టపను; ద్వారదపావన—కొండిని, సేంతిని, పోషభోంతిని సమర్పించెను. మానసహ్రదము—శాలికను, శతనంద—శతఘంటోలూఖమేఖలలను; బదరికాశ్రమము—పద్మావతి, మాధవీద్వయమును, దేవి—ఏకచూడా, సుమహా, ధమధమలను,—ఉత్క్రాంతిని—వేదమంత్రిను; కేదారము—మాతృగణమును నొసంగెను. రౌద్రమహాలయము— సునక్షత్రను, కలూలను, సుప్రభాతను, సుమంగళను, దేవమిత్రను, చిత్రసేనను నొసంగెను. ప్రయాగ—కోటరను, ఊర్ధ్వవేణిని, శ్రీమతిని నొసంగెను. బాహువుత్రిక—పలితను, కమలాక్షినినొసంగెను. సర్వపావవిమోచన—సుపమను, మధుసింగను, క్షాంతిని, దహదహను, ఖేటకరను, సంతానికను, వికలను, క్రముకను, వరవాసినిని, జలేశ్వరిని, కుక్కుటికను నొసంగెను. సుదామను, లోహమేఖలను, వపుష్మతిని, ఉల్ముఖాక్షిని, కోకనామను, మహాసనిని, రౌద్రిను, కర్కటికను, తుండను, శ్వేతతీర్థము దానమొసంగెను. ఈసకలగణానుచరులను, మాతృకానుచరులను జూచి గరుడుడు తనసుతులైన—మహావేగ, మయూరకులను, అరుణుడు తనతనయుడైన తామ్రచూడుని నొసంగిరి. ఈవిధముగ హుతాశనుడు—శక్తిని, అద్రిసుత—అస్త్రములను, బృహస్పతి—దండమును, మ

టిల—కమండలువును, హరి—మాలను, శూలధరుఁడైన హరుఁడు—పతాకను, ఇంద్రుఁడు—కంఠహారమును నర్పించిరి. అప్పు డామహాబలశాలి యైనషడాననుని గణసమూహమును, ముఖ్యమైన మాతృగణములు బరివేష్టించి యనుసరింపఁగా నాతఁడు మయూరవాహనము నధిరోహించి మహాశక్తిధారియై, మహాదేవునిచే దేవసేనాపతిగా పూజితుఁడై సూర్యునివలె విరాజిల్లఁజొచ్చెను.

## మహిషాసురతారకాసురుల యుపాఖ్యాన ప్రసంగమునందు క్రౌంచభేదవర్ణనము

పులస్త్యుఁడు చెప్పందొడంగెను—కుమారస్వామి సేనాధిపతిగా దేవతలచే నభిషేకింపఁబడి, భవునికి, పార్వతికి, పావకునికి, కుటిలకు, కృత్తికలకు బ్రహ్మకును భక్తితో వేర్లు నమస్కరించి పలికెను—"దేవియైన భగవతికి నేను నమస్కరించుచున్నాను. ఓ [illegible]! మీకును నానమస్కారములు. నేను దేవశత్రువులైన మహిషతారకాసురులను మీప్రసాదముచే జయింపఁగలను. ఓ సురవరులారా! నేను బాలుఁడను, మీకొఱ కేమిచేయవలయునో యది చక్కఁగా నెఱుంగనివాఁడను. మీరును బ్రహ్మయు నేకీభవించి యిప్పుడు నే నేమి చేయవలయునో నా కనుజ్ఞ ననుగ్రహింపుఁడు." అని కుమారస్వామి పలుకఁగా దేవత లందఱును కుమారునిమోము వీక్షించుచు భయరహితులైరి. ఇఁక నీవంక శంకరుఁడును బుత్రస్నేహావిష్టుఁడై లేచి ప్రజాపతిని వెంటఁబెట్టుకొని యాతనిదక్షిణహస్తమును బట్టుకొని స్కందుని దగ్గఱ కేతెంచెను. తరువాత నుమాదేవి తన సుతునిఁ జూచి—ఓ పుత్రా! శత్రుసంహారకుఁడవైన నాకుమారా! ఇదిగో, నీ వీవిష్ణుని జగద్వంద్యపాదద్వంద్వమునకుఁ బ్రణిపాతము లొనరింపుము" అని పలి

కెను. కార్త్తికేయుఁ డప్పుడు నవ్వుచుఁ దల్లిని జూచి « అమ్మా ! ఏ ఎల్లాదరణపూర్వకముగా నాయట్టివానిని నమస్కరింపు మని యనుజ్ఞ యిచ్చుచుంటివిగదా, యీయన యెవ్వరు ?" అని యడిగెను. ఆతల్లి యప్పు డిట్లనియెను. « వత్సా ! నీకర్త్తవ్యకార్యము పరిసమాప్తమైన తరువాత మహాత్ముఁడైన యీగరుడధ్వజుని వృత్తాంతమును భగవానుఁడైన పద్మజుఁడు నీకడఁ గీర్త్తింపఁగలఁడు. నాయనా ! ఈవిష్ణునికంటెఁ దామగాని యేయితరదేహధారులు గాని పవిత్రతములు గా రని మహాశ్రీమ మీతండ్రిగారు నా కెఱింగించియున్నారు." అని తల్లి తెలుపఁగాఁ గుమారుఁ డప్పుడు జనార్దనునకుఁ బ్రణిపాతము లొనరించి కృతాంజలిపుటుఁడై యెట్టయెదుట నిలిచి యచ్యుతునియనుజ్ఞఁ గోరెను. స్కందుఁ డట్లంజలిపుటుఁడై నిలిచియుండుటఁ జూచి భూతభావనుఁడైన భగవంతుఁ డాతనికి మంగళ మగుకొఱకు స్వస్త్యయనము గావించి యనుజ్ఞ నొసంగెను. అని పులస్త్యుఁడు చెప్పఁగా నారదుఁ డు మరల—నోవిప్రోత్తమా ! గరుడధ్వజుఁడు శిఖిధ్వజునికొఱకుఁ గావించిన యాపవిత్రమైన స్వస్త్యయనమును గూర్చి నాకు విశదముగా నెఱింగింపు" మని కోరెను. అంతటఁ బులస్త్యుఁ డిట్లు పలికెను.

భగవానుఁడైన హరి స్కందునకు జయమును మహిషాసురునకు వధయుఁ గలుగునిమిత్తమై యెట్టిపుణ్యస్వస్త్యయనము నిర్దేశించెనో దానిని జెప్పెద నాకర్ణింపుము. స్వస్తి ! రజోగుణావలంబియుఁ బద్మయోనియు నైన బ్రహ్మ నీకు శుభము నొసంగుఁగాక. చక్రాంకితకరుఁడు ననాదినిధనుఁడు నైన విష్ణువు నీకు స్వస్తివిధానము చేయుఁగాక. వృషధ్వజుఁడైన శంకరుఁడు శాంకరితోఁగూడ నీకు శుభము నాచరించుఁగాక. శిఖివాహనా ! పావకుఁడు నీకు శుభముఁ జేయుఁగాక. దివాకరుఁడు నీకు మంగళకరుఁ డగుఁగాక. సోముఁడు, భౌముఁడు,

బుధుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శనైశ్చరుఁడు, వీరందఱుఁ బ్రత్యే కప్రత్యేకముగా సర్వదా నీకు మంగళవిధానకరు లగుదురుగాక. మరీచి, అత్రి, పులహుఁడు, పులస్త్యుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు, భృగుఁడు, అంగిరుఁడు, స్వర్గమునందున్న సప్తఋషులును నీమంగళవిధానమునకే ప్రయత్నము లొనరింతురుగాక. విశ్వదేవగణము, అశ్వనీకుమారద్వయము, సాధ్యగణము, మరుద్గణము, అగ్నిత్రయము, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, మఱియు యక్షగణము, పిశాచగణము, వసువర్గము, కిన్నరనిచయము, నాగగణము, సుపర్ణగణము, సరిద్గణము, సరసీగణము, సకలపుణ్యతీర్థములు, హ్రదగణము, సముద్రగణము, మహాబలభూతగణము, గణాధిపగణమును బ్రత్యేకప్రత్యేకముగా నీకు శుభ మొనఁగూర్చుటయందు నిరంతరమును గృషిచేయుచుందురుగాక. మఱియు ద్విపాద, చతుష్పాద, బహుపాద, అపాదశత్రుసంకటమునుండి నీవు నిరాపదుఁడ వగుదువుగాక. వజ్రి నీకుఁ దూర్పుదెసను రక్షకుఁడగుగాక. దండనాయకుఁడు దక్షిణదిశను, వరుణుఁడు ప్రతీచీదిశను, యక్షాధిపతి యుత్తరదిశను, వహ్ని దక్షిణపూర్వదిక్కునను, కుబేరుఁడు దక్షిణపశ్చిమదిక్కునను, వాయువు ప్రతీచ్యుత్తరదిశను, శివుఁడు పూర్వోత్తరదిశను నీకు రక్షకులుగా నుందురుగాక. ధ్రువుఁ డూర్ధ్వదిశయందును, ధరాధరము అధోదిశయందును, ముసలియు, వజ్రియు, లాంగలియు, ధనుర్ధారియు మధ్యభాగమునందును నీకు రక్షకులుగా నుందురుగాక. ఇదిగాక సాగరమునందు వరాహమూర్తి, దుర్గమునందు నరకేసరియు రక్షకులుగా నుందురుగాక. సామవేదధ్వనిమైన శ్రీమన్మాధవుఁడు సర్వదిక్కులయందును సర్వత్ర నిన్ను రక్షించుచుండును గాక." అని శ్రీహరియిట్లు స్వస్త్యయనము గావించినతరువాత శక్తిధరుఁడైనకుమారుఁ డగ్రేసరుఁ డయ్యెను. అతఁడప్పుడు సురవర్గము

నకుఁ బ్రణిపాతము లాచరించి భూతలమునుండి యాకాశమార్గమునకు లేచెను. వెంటనే సమస్తప్రమథగణములును, దేవగణములును, దేవర్షిగణములును, కామరూపులైన విహంగమగణములును, సకలమును గుహస్వామి ననుసరించెను. ఈసమయమునందు మాతృగణము లన్నియును బలవంతుఁడైన స్కందునితో మహాసురులను నిహతులను గావించుకొఱకు నభోమార్గమున బయలుదేఱెను. తరువాత సుదీర్ఘమార్గమునఁ బర్యటనముచేయుచు స్కందుఁడు తనవెంటవచ్చుచున్న యనుచరులను జూచి—ఓమహావీరులారా! మీ రందఱు నిప్పుడు భూతలమునకు దిగుఁడు." అని చెప్పెను. అది వినియందఱును భూమికి దిగి చేరువగా నున్న యొకపర్వతము నారోహించి భయంకరమైన సింహనాదము గావించిరి. ఆసింహనాదము సమగ్రభూతలమును, నభస్స్థలమును బరిపూరితములఁ గావించి సాగరమార్గమునుండి దానవాలయమైన పాతాళములోఁ బ్రవేశించెను. అప్పుడు మహిషుఁడు, తారకుఁడు, విరోచనుఁడు, కుంభనికుంభులు మొదలగు దానవు లందఱు వజ్రపాతోపమమైన యాభీకరగంభీరసింహనాదము నాలించి "ఏమిది!" యని యాలోచించుచు వెంటనే యంధకాసురునివద్ద కేఁగిరి. ఓనారదా! ఈదానవపుంగవు లందఱు నంధకునితోఁగూడి యుద్వేగమానసులై యాభీషణశబ్దమునుగూర్చి యాలోచింపఁదొడంగిరి. వారు రహస్యాలోచనయందుఁ బ్రవేశింపఁగానే పాతాళకేతుఁ డనుపేరు గల శూరశానముఁ డగు దైత్యశ్రేష్ఠుఁ డొకఁడు రసాతలమునుండి వారందఱవద్దకు నేతెంచెను. పాతాళకేతుని శరీరమంతయు బాణవిద్ధమైయుండెను, అతఁడు మిక్కిలి బాధపడుచుండెను. అతఁడు నిమిషనిమిషమునకు వణఁకుచు నంధకాసురుని సమీపించి యతిదీనస్వరముతో నిట్లనియెను—"ఓదైత్యేంద్రా! నేను గాలవమునియాశ్రమమున కేఁగితిని.

అచ్చట కేఁగి నా బలమంతయుఁ జూపుచు నాతని యాశ్రమము ధ్వంసము సేయుటకుఁ బ్రయత్నించితిని, నేను సూకరాకారముతో నా యాశ్రమమునం దెప్పుడు ప్రవేశించితినో యప్పుడే యెవ్వరోగాని యాశ్చర్యముగా నా కెఱుకపడకుండఁగనే నా వెనుకనుండి నా దేహమున శరనిక్షేపము గావించిరి. ఓరాజా! ఆశరములు నాకొంకులలో గుచ్చుకొనిపోయెను. నేను భయార్తుఁడనై మహావేగమున నయ్యాశ్రమము నుండి పలాయన మొనరించితిని. కాని యాబాణవిక్షేపకారిమాత్రము నన్ను వెంబడించియే పరుగెత్తఁజొచ్చెను. నేను నా వెనుకదిక్కునందు గుఱ్ఱపుగొరిసెలచప్పుడును వినుచునే యుంటిని, అతఁడు నా వెనుకనుండి "నిలువు నిలువు" మని కేకలు వేయఁజొచ్చెను. కాని నే నాతనికి భయపడి వక్షిణార్ణవములోఁ బ్రవేశించితిని. అప్పు డాసముద్రతీరము నందు వివిధాకారులును నానావేషధారులు నగు నరులు నాకుఁ గనఁబడిరి. వారిలోఁ గొందఱు మేఘగర్జనములు చేయుచుండిరి, కొందఱు వారిధ్వనికిఁ బ్రతిధ్వనులు చేయుచుండిరి. మఱికొందఱుజనులు—మేము నిశ్చయముగా మహిషాసురుని నిహతునిఁ గావించెదము" అనుచుండిరి. మఱికొందఱు తేజస్వులు—మేము తారకాసురునిఁ దప్పక వినాశ మొనరింతుము" అని యుఱచుచుండిరి. ఓయసురేశ్వరా! ఈ మాట లన్నియు వినుటచే నాకు మఱియు నత్యధికమైనభయము కల్గినది. నేను భయాతురుఁడనై మహార్ణవమును విడిచి యొకభూవివరములోఁ జొచ్చితిని. అక్కడఁగూడ నా బలవంతుఁడైన పురుషుఁడు నన్ననుసరించెను. నే నాతనివలనిభయముచే నా హిరణ్యపురమును వదలి యిప్పుడు నీసమక్షమునకు వచ్చి చేరితిని. నిజముగా నీవు నాయెడల ననుగ్రహముఁ జూపవలయును." అని పాతాళకేతుఁడు పలుకఁగా విని యంధకాసురుఁడు మేఘగంభీరనినాదముతో నిట్లు పలికెను.—నీ

హంసాస్య మనుపేరుగల యొకగణము మహిషాసురు నప్పుడు పట్టి ఘాతములచే నొప్పింపఁజొచ్చెను. ఇట్లే షోడశాస్య మనుగణము త్రిశూలముచేతను, శతశీర్ష మను అసిశ్రేష్ఠములచేతను, శ్రుతాయువు గదలచేతను, విశోకగణము ముసలాయుధములచేతను, బంధుదత్తము శూలములచేతను మహిషాసురునిమస్తకము మర్దింపఁజొచ్చెను. వీరుగాక షడాననుని తక్కినపరిషద్గణములును శూల, శక్తి, ఋష్టి, పట్టిసములచే నాతనిని యుద్ధములోఁ బొడుచుచుండిరి. కాని మహిషాసురుఁడు మైనాకపర్వతమువలె నించుకయుఁ జలించుటమాత్రము లేదు. భద్రకాళి, ఉలూఖల, అనేకచూడ—వీరందఱు సుతీక్ష్ణాస్త్రములచేఁ దారకాసురునిఁ దాడితునిఁ గావించుచుండిరి. ప్రమథగణముచేతను, మాతృగణముచేతను ఈ మహాసురులుభయులుఁ దాడితులగుచున్న మాట నిజమే కాని వారుభయులు నించుకంతయు బాధితులగుట లేదు. మహిషాసురుఁడు ప్రమథగణములనుగదాప్రహారములచేఁ బరాజితులనుగావించియస్త్రధారియై వేగముగాఁ గుమారుని కభిముఖముగాఁ బరుగెత్తఁజొచ్చెను. దైత్యుఁడైన మహిషుఁ డట్లురుదెంచుచుండుటఁ జూచి స్కందునిపక్షమువాఁడైన సుచక్రాక్షుఁడు క్రోధభరుఁడై చక్రాయుధమును ద్రిప్పుచు నాతనిరాకకడ్డుదగిలెను. అప్పు డామహారథులైన గణాధిపతులును, అసురులును బలపడి గదాయుధములతోను జక్రాయుధములతోను సుందరమైన సమరవ్యాపారమును జేయఁజొచ్చిరి. మహిషాసురుఁడు గణాధిపులమస్తకములపై గదాఘాతము లొనరించెను. సుచక్రాక్షుఁడు తనచక్రమును దానవపతిపై విసరెను. తీక్ష్ణాగ్రయుతమైన యాచక్రము మహిషునిగదను విచ్ఛేద మొనరించి యాతని కెదురుగాఁ బరుగెత్తుచు నాతని సమీపింపఁగానే దానవగణము "మహిషాసురుఁడు నిహతుఁ డయ్యె" నని చీత్కారములు గావింపఁజొచ్చె

ను. అది విని బాణాసురుఁడు పాశమును బట్టుకొని యతివేగముగాఁ బరుగిడఁజొచ్చెను. అట్లాఁగి బాణాసురుఁడు పంచముష్టిశతముచేఁ జక్రాయుధము నాహతము గావించి పంచబాహుశతముచే సుచక్రాక్షుని బంధించెను. బాణాసురుఁడు సుచక్రసంపన్నుండైన సుచక్రుని బంధించుటఁ జూచి మహాబలుఁడైన మకరాక్షుఁడు గదాహస్తుఁడై యాతని కెదురుగాఁ బరుగెత్తి యాతనితలపైఁ బెద్ద గదాఘాతముఁ గావించెను. మహామతియైన బాణాసురుఁడీ ట్లాఘాతము నొంది లజ్జించినవాఁడై వెంటనే రణక్షేత్రమును వదలి శాలిగ్రామమున కేఁగెను. ఈవిధముగా మకరాక్షునిచేఁ గొట్టఁబడి బాణాసురుఁడు పరాఙ్ముఖుఁ డయ్యెను. ఓసురతాపసా! ఆసమయమునందు దైత్యబల మంతయు విమర్దితముగాఁ జొచ్చెను. గణేశగణము దైత్యబలము నంతను విధ్వస్తముఁ జేసి యతిక్రోధముతో యుద్ధమున శత్రుసైన్యమును వితాడిత మొనరింపఁజొచ్చెను. అప్పుడు మహాబలుఁడైన తారకాసురుఁడు తనసైన్య మంతయు రణరంగమున భగ్న మగుటఁ జూచి చేతితో ఖడ్గమును ద్రిప్పుచు గణేశ్వరులను జెండాడుట కారంభించెను. తరువాత నయ్యప్రతిమమైన ఖడ్గప్రహారముచే హంసవక్త్రప్రముఖగణేశగణమును, మాతృగణమును, రణమునందుఁ బరాజితములై భయవిహ్వలచిత్తములతో స్కందునిశరణు చొచ్చెను. మహేశ్వరనందనుఁడైన స్కందుఁ డప్పుడు గణము లన్నియు భగ్నము లగుటయుఁ దారకాసురుఁడు బాణహస్తుఁడై పరుగెత్తి వచ్చుచుండుటయుఁ జూచి శక్తిప్రహారములచే నాతనిహృదయమును విదగ్ధముగావించెను. అందుచేఁ దారకాసురుఁడు మర్మాంతికమైన బాధ నొందుచు భూమిపైఁ బడిపోయెను.

ఓమహర్షీ! తనసోదరుఁడైన తారకాసురుఁ డట్లు భగ్నగర్వు

నీ వెల తిరస్కరించుచున్నావు! విశేషించి జగత్తులలో నీవొక్కఁడవే బుద్ధిమంతుఁడవా యేమి?" ఇట్లు కుమారుఁడు పలుకఁగా సహస్రాక్షుఁడు మరల నిట్లనియెను—ఓగుహా! నేను స్వతస్సిద్ధముగా బలవంతుఁడను." అని యింద్రుఁ డనఁగా గుహుఁడు మరల నిట్లనియెను—మంచిది, నీవే బలవంతుఁడవైనచో నిటు రమ్ము, నాతో యుద్ధము గావింపుము. ఈమాటలు విని యింద్రుఁడు—"ఓకార్త్తికేయా! మనయిద్దరిలో నెవ్వరీక్రౌంచపర్వతమున కతిశీఘ్రముగాఁ బ్రదక్షిణముచేసి రాఁగల్గుచున్నారో వారే బలాధికు లని నిశ్చయింతము." అని పలికెను. స్కందుఁడామాటలు విని వెంటనే మయూరవాహనమును డిగి పాదచారియై క్రౌంచపర్వతప్రదక్షిణమునకు బయలుదేఱెను. ఇంద్రుఁడును నగేంద్రమును దిగి కాలినడకచే నించుకదూర మేఁగి మరల నెప్పటిచోటునకు వచ్చి కూరుచుండెను. ఈలోపున స్కందుఁడు ప్రదక్షిణముగావించి వచ్చి యాతనిని జూచి యిట్లనియెను—"మూఢుఁడా! ఏమి నీ వింకను నిచ్చటనే యున్నావు?" అని కుమారుఁడు పలుకఁగా నప్పు డింద్రుఁడు కౌటిల్యమును జూపుచు నిట్లుత్తర మిచ్చెను—"నేను మొదటనే ప్రదక్షిణముచేసి వచ్చితిని, నీవు తరువాతఁ బ్రదక్షిణము చేసితివి." అని యింద్రుఁ డనఁగాఁ గుమారుఁడు—"నేను ముందుగాఁ బ్రదక్షిణము గావించితిని, నీవు ప్రదక్షిణమే చేయలేదు" అని గద్దించిపలికెను. అప్పుడు వా రిరువురు నేను ముందుగాఁ జేసితిని, నేను ముందుగాఁ జేసితి నని పరస్పరవివాదమున కారంభించిరి. చివరకు వారు తమవివాదము బరిష్కరించుటకు హరిహరబ్రహ్మలవద్ద కేతెంచి వారితో వృత్తాంత మంతయుఁ జెప్పికొనిరి. తరువాత హరి స్కందున కిట్లనియెను—"నీవు క్రౌంచపర్వతమువద్ద కేఁగి యీవిషయమై యాపర్వతమును బ్రశ్నింపుము. అది యేమి చెప్పునో దానినిబట్టి

ముందుగా నెవరు ప్రదక్షిణ మొనరించిరో స్థిరబుద్ధివై చెప్పుము, మీలో నెవరు బలవంతులో యదియుఁ దెలిసికొన నగును" ఇట్లు మాధవుఁడు పలుకఁగా బావకనందనుఁడు విని, క్రౌంచసమీపమున కేఁగి— "క్రౌంచ! నీవు చెప్పుము, మాలో ముందుగాఁ బ్రదక్షిణ మాచరించినవా రెవ్వరు?" అని యడిగెను. క్రౌంచ మప్పుడు—"మహామతియైన యుపేంద్రుఁడు నాకు మొదటఁ బ్రదక్షిణ మొనరించెను, తరువాత నీవు ప్రదక్షిణము గావించితివి" అని సమాధానము చెప్పెను. క్రౌంచపర్వత మిట్లు చెప్పఁగాఁ గార్తికేయునికిఁ గ్రోధముచే నధరము ప్రకంపింపఁజొచ్చెను; అతఁ డపుడు క్రౌంచమొనరించిన యీకపటవ్యాపారమునకుఁ గోపించి తత్క్షణమే శక్తిప్రహారముచే మహిషునితోఁగూడఁ గ్రౌంచపర్వతమును సంహారముచేసెను. పుత్రుఁడు నిహతుఁడు కాఁగానే గిరిరాజనందనుఁడును, బలవంతుఁడునైన సుబాహుఁడు తత్క్షణమే వేగముగాఁ బలాయితుఁడయ్యెను. ఇఁక నిక్కడ బ్రహ్మ, ఇంద్రుఁడు, రుద్రుఁడు, మరుత్తులు, అశ్వినీకుమారులు మొదలగు దేవతలందఱు గుహునిచే మహిషుఁడు నిహతుఁ డగుటఁ జూచి నిశ్చింతగా స్వర్గధామమున కేఁగిరి. తరువాత బలవంతుఁడైన కుమారస్వామి తనమాతులునిఁ జూచి యాతని వధించుటకు శక్తి యను నస్త్రమును బైకెత్తెను. కాని విష్ణు వాతనిని బాహువులతోఁ గౌఁగిలించుకొని "గురుహత్యచేయకుము" అని చెప్పుచు నివారించెను. ఈసమయమునందు హిమాలయము నచ్చటి కరుదెంచి సునాభునిచేతిని బట్టుకొని వెడలిపోయెను. భగవానుఁడైన హరియు శిఖిధ్వజుఁడైన కుమారుని సత్వరముగా స్వర్గమునకుఁ గొనిపోయెను. తరువాత గుహుఁడు సురపతియైన హరిని జూచి—భగవానుఁడా! మోహగ్రస్తుఁడ నగుటచే నావివేకము వినష్టమైపోయెను, అందుచే నేను మాతులేయభ్రాతను సంహరిం

చుకొంటిని. ఏమైనను సరియే, యీయపకార్యమునకుఁ బ్రాయశ్చిత్తముగా నే నిప్పుడు నా దేహమును శోషిల్లఁజేసెదను." అని విజ్ఞాపించెను. విష్ణు వప్పుడు—"ఓహో కుమారా! నీ విప్పుడు పాపవిదారణమును, దీర్ఘవరమును నగు పృథూదకమునకు వెడలుము, అచ్చటి కేఁగి యోఘవతీనదీజలములో స్నానముచేసి యక్కడ భక్తిపూర్వకముగా మహేశ్వరదర్శనము గావించుకొనినచో నీవు సూర్యసమాన ప్రభాశాలివి గాఁగలవు." అని పలికెను. కుమారుఁ డప్పుడు విష్ణుని యాజ్ఞచొప్పునఁ బృథూదకమున కేఁగి మహాదేవుని సందర్శించి యక్కడ స్నానము దేవగణార్చనము గావించి సూర్యసమప్రభాసంపన్నుఁడై మహాదేవనికేతనమైన కైలాసధామమునకు వెడలెను. అప్పుడు సుచక్రుఁ డనుగణేశుఁడు మహాశ్రమమునం దుండి వాయుమాత్రభోజనుఁడై తపస్సుచేయుచు మహాదేవునారాధించుచుండెను. మహాదేవుఁడు సంతుష్టుఁడై యాతనికి వరము లొసంగుట కుద్యతుఁ డయ్యెను. అప్పుడు సుచక్రుఁడు మహాదేవునివద్ద నస్త్రములు పొందఁగోరి యాతని నిట్లు ప్రార్థించెను—"దేవా! క్రౌంచధ్వంసకారియు, తపతుల్యహస్తసంపన్నుఁడు నైన కార్త్తికేయుఁడు, బాణాసురుని బాహువు లన్నియు నెట్లు ఛేదింపఁగలఁడో యట్లుగా నాతనికి నీవు వరమొసంగుము." అని సుచక్రుఁడు ప్రార్థింపఁగా మహాదేవుఁ డాతనిని జూచి—"మంచిది నీ వేఁగుము, నీవు కోరినవరమునే నే నొసగింతిని. ఈ చక్రాయుధముచేతనే బాణాసురుని యతిప్రవృద్ధమైన యా బాహువనము విచ్ఛేదము కాఁగలదు; ఈవిషయములో నిఁక నాలోచింపవలసిన దేమియు లేదు." అని చెప్పెను. త్రిపురహరుఁ డిట్లు వరము నొసంగఁగానే గణేశుఁడు స్కందునిసమీపమున కేఁగెను. అట్లేఁగి యాతఁ డాతనిపాదద్వంద్వమునకు వందనము లొనరించి సంతుష్టహృ

దయముతో మహాదేవుఁ డనుగ్రహించినవిషయమునుగూర్చి నివేదించెను. త్రిలోచనసుతుఁడైన స్కందుఁడు తనశక్తిప్రహారముచే మహిషాసురునిఁ గ్రౌంచుని విదారితులఁ గావించి యెట్లు నిహతులఁ జేసెనో, అది మీకడఁ గీర్తింపఁబడెనది, ఈవృత్తాంతము నెవ్వరు పఠింతురో వారిపాపములు వినష్టములై వారిపుణ్యములు వర్ధిల్లఁగలవు.

## —♦ అంధరాసురపరాజయము ♦—

నారదుఁ డడుగుచున్నాఁడు—"అప్పుడు దైత్యులు రసాతలమునఁ బ్రవిష్టులై యుండఁగా వారిసమీపమున కొకయసురవరుఁడు శరాహతుఁడై వచ్చెనుగదా! అతని నట్లు బాణవిద్ధునిఁ గావించినవా రెవ్వరు?" అని నారదుఁ డడుగఁగాఁ బులస్త్యుఁడు మరలఁ జెప్పందొడంగెను—"ఓమహాత్మా! రఘువంశమున రిపుజిత్తను పేరుగలయొకరాజుగలఁడు, ఆతనిపుత్త్రునిపేరు ఋతధ్వజుఁడు. ఋతధ్వజుఁడు మహాత్ముఁడు, శూరుఁడు, శత్రుఘ్నుఁడు, బలవంతుఁడు, నిత్యసంతుష్టచిత్తుఁడు నై యుండెను. ఆతఁడు విప్రులయు, దీనులయు, బంధులయు, అనాథులయు సుఖములు గలిగించుటకు నిరంతరాసక్తుఁడై యుండువాఁడు. ఆమహారాజైన ఋతధ్వజుఁడు గాలవునికార్యసిద్ధికొఱకు అశ్వారోహణ మొనరించి యస్త్రసంధిబాణముచే పాతాళకేతుని వెన్నుఁబొడిచెను." అని పులస్త్యుఁడు చెప్పఁగా, నారదుఁడు—"ఓసత్తమా! ఆమహారా జెందుకొఱకు గాలవునికార్యము సాధించెను, ఎందుకొఱకు వెంటనే దైత్యుని శరాహతుని జేసెను?" అని యడిగెను.

పులస్త్యుఁడు మరలఁ జెప్పఁదొడంగెను. "పూర్వకాలమునందు గాలవుఁడు తనప్రసిద్ధాశ్రమమునుండి తప మొనరించుకొనుచుండెను. అప్పుడు పాతాళకేతుఁడు మూర్ఖత్వముచే నాతనికిఁ దపోవిఘ్నమును,

సమాధిభంగము నుగావించుచుండెను. మహాత్ముఁడైన గాలవుఁడు వా నిని భస్మీపటలముచేయఁగలడు; కాని యాతఁడట్లు తనతపస్సును వ్యయ మొనరించుట కిష్టపడఁడాయెను. అప్పుడామహర్షి యాకాశము వంకకుఁ జూచుచు దీర్ఘమైన యొకవేఁడినిట్టూర్పును విడిచెను. వెంటనే యంబరతలమునుండి యొకయశ్వరాజము దిగివచ్చెను, దానివెనుకనే యశరీరవాణి—"ఈబలవత్తురంగ మొక్కదినముగా సహస్రయోజనములు పఱుగెత్తఁగలదు" అని పలికెను. గాలవుఁడావలుకు విని తు రంగమమును స్వీకరించి, శస్త్రధారియైయున్న ఋతధ్వజునకు వ్యవహా రార్థము దాని నొసంగెను. తరువాత నాతఁడు మరలఁ దపస్సునఁ బ్ర వేశించెను. తరువాత రాజు దైత్యునిసమీపించి వానిని సమాహితు నిఁగావించెను." పులస్త్యుఁడు చెప్పఁగా నారదుఁడు—"ఓసువ్రతా! ఆకాశపథమునందుండి యెవ్వరాయశ్వమును బంపినారు, ఆకాశ వాణి యట్లేల యావిర్భవించెను?" అని యడిగెను. పులస్త్యుఁడు మరలఁ జెప్పుచున్నాఁడు—"మహేంద్రునిగాయకుఁడు విశ్వావసుఁ డనుగంధర్వరాజు విలక్షణబలశాలియు, యశస్వియు నై యుండెను. ఆతఁడు తనకన్యనిమిత్తమై ఋతధ్వజునిపనికొఱకుఁ దురంగమును భూత లమునకుఁ బంపెను." అని పులస్త్యుఁడు చెప్పఁగా నారదుఁడు— గంధర్వరాజైన విశ్వావసునిచేఁ బంపఁబడిన మహావేగశాలియైన యా యశ్వమువలన నెట్టికార్యము సాధింపఁబడెను. నృపాత్మజుఁడైన కువ లయాశ్వునకుఁ దానిచే నేయుద్దేశముసిద్ధించెను?" అని యడిగెను. అప్పుడు పులస్త్యుఁడు మరల నిట్లు చెప్పఁదొడంగెను—

విశ్వావసువకు మదాలస యను పేరుగలయొకకుమార్తె గలదు. ఈకన్య స్వాభావికముగానే మదాలస. మదాలస త్రైలోక్యదుర్లభము లగుగుణశీలములకును, సౌభాగ్యలావణ్యలీలలకును ఖనియై శశికాంతి

వంటి సుందరాకృతి గలిగియుండెను. ఇట్టిమదాలస యొకదినమున నందనోద్యానమునందు విహారముసేయుచుండెను. ఇట్లుండఁగా దేవరిపు_____న పాతాళకేతుఁ డాతన్విని జూచి తత్క్షణమే యపహరించుకొనిపోయెను. ఆమదాలస నుద్ధరించుకొనుటకే యాయశ్వము ఋతధ్వజుని కొసఁగఁబడెను. నృపనందనుఁడైన ఋతధ్వజుఁడు దేవశత్రువైన పాతాళకేతుని నిహతునిఁ జేసి యవ్వరారోహయైన వరవర్ణినిని బొందెను. తరువాత శచీసహవాసమున నింద్రుడుంబోలె నృపనందనుఁ డామృగనేత్రిసంసర్గమునఁ గాలము సుఖముగాఁ బుచ్చుచుండెను.” అని పులస్త్యుఁడు చెప్పఁగా నారదుఁడు మరల—“ మహాసురులైన మహిషతారకు లిట్లు నిరస్తులు గాఁగానే హిరణ్యాక్షనందనుఁడును, ధీమంతుఁడునగు నంధకుఁడు మరల నేవిధముగాఁ గార్యానుష్ఠానమునకుఁ గడంగెను ?” అని యడిగెను. పులస్త్యుఁ డిట్లు చెప్పఁదొడంగెను—రణరంగమునఁ దారకమహిషాసురులు నిహతులగుటఁ జూచి దేవసైన్యహాంతయైన యంధకాసురుఁడు దుర్బుద్ధివశమునఁ గ్రుద్ధుఁడై పోయెను. తరువాత నాతఁ డల్పసంఖ్యాకులగు ననుచరులను, సహచరులను వెంటఁబెట్టుకొని పరిఘాయుధహస్తుఁడై పాతాళమునుండిబయలుదేఱి భూతలమునకు వచ్చెను. అట్లు వచ్చి యాతఁడు సుందరకందరమండితమైన మందరభూధరమునకేఁగి యచ్చట సభామధ్యసమాసీనయైయున్న గిరికుమారి గౌరిని గాంచెను. ఆసర్వాంగసుందరియైన గిరినందని నయ్యరణ్యములోఁ జూచి యాకస్మికముగా వాఁడు కామబాణజర్జరితుఁడైపోయెను. కామాంధముగ్ధుఁడైన యాయసురుఁ డప్పుడు తనలో నిట్లనుకొనియెను—“ ఓహో ! ఎవ్వరిలలనయో, సర్వాంగమనోహారిణియైన యీసుందరీమణి యిట్లు వనవిహారముసేయుచున్నది? ఈసుందరి నాయంతఃపురమున విహరింపకున్నచో, నేను నిష్ఫలజీవనము గలవాఁడ

నగుచున్నాను. నే నీతనుమధ్య నాలింగనము గావించుకొనకున్న నాజన్మము వ్యర్థము, ఇట్టి నాస్త్రీజీవనమువలనఁ బ్రయోజన మేమున్నది? ఈకృష్ణవేణియైన స్త్రీరత్నమును నా కెవ్వఁడు జతగూర్పఁగలఁడో, వాఁడే నాబాంధవుఁడు, వాఁడే నాయాప్తుఁడు, వాఁడే నాసోదరుఁడు, వాఁడే నాసాంపరాయికుఁడు." అని ప్రత్యేకముగ నయ్యంధకుఁడనుకొనుచుండఁగా బుద్ధిసాగరుఁడైన ప్రహ్లాదుఁడు తనరెండుకర్ణములును కరములతో మూసికొని శిరఃకంపన మొనరించుచు నాతనిఁ జూచి——ఓదైత్యవరా! అట్టిచింతమాత్రము తలంపకుము, ఏలన? నీజనని సాక్షాత్త్రిజగన్మాత, శూలపాణియైన శంకరునికి నిజధర్మపత్ని. నీ వెప్పుడు నిట్టిదుర్బుద్ధి కలిగి మెలఁగకుము. దీనివలన వెంటనే వంశనాశము సంభవింపఁగలదు. ఇది యంతయుఁగాక, యీమె నీకుఁ బరదార. పరదారస్పర్శవలన రసాతలమున మగ్నుఁడవు గాకుము. సజ్జనులకైనను, దుర్జనులకైనను సరియే. పరదారాపేక్ష యందఱకును నిందనీయమైన దుష్కార్యము. నీశత్రువులుగూడ నిట్టికుత్సితకార్యములయందు లిప్తులగుదురుగదా! ఓదైత్యరాజా! ఈవిషయమున గాధిరాజు మున్ను గీర్తించినశ్లోకమును నీవు వినలేదా? ఆతఁడొకప్పుడు తనసైన్యములు శత్రువులతోడ రణరంగమునుండి పలాయితము లగుచుండఁగాఁ దనసైన్యమును జూచి, పథ్యమును, తథ్యమును, లోకహితకరమునగు నీక్రింది వాక్యశకలము నుపదేశించెను. వత్సా! వినుము——ప్రాణత్యాగమైన సేయవచ్చును, గాని పరహింసలోమాత్రము ప్రవేశింపరాదు. మౌనియై యుండిన నుండవచ్చునుగాని, యసత్యవాక్యముమాత్రము ప్రయోగింపరాదు. పురుషత్వహీనుఁడై యుండుటయైన మంచిదిగాని, పరస్త్రీగమన మెంతమాత్రము సేయరాదు; భిక్షాజీవనముసేయుట యైనను శ్రేష్ఠముగాని, పరధనహరణమున కె

ప్పుడును బ్రిమ్మింపరాదు." అని ప్రహ్లాదుఁ డుపదేశించెను. కాని కామార్తుఁడును, క్రోధాంధుఁడు నగు నంధకాసురుఁడు మాత్రము మా యుపదేశమువలన నివృత్తుఁడుగా లేకపోయెను, అతఁ డప్పుడు—"ఈ మెయ్యే, ఆశత్రుజనని ?" అని యనుకొనుచు నామె కెదురుగాఁ బరుగెత్తఁజొచ్చెను. అప్పుడు తక్కిన దైత్యులుగూడ యంత్రనిర్ముక్తములగు నుపలఖండములవలె నాతని వెనుకనే పరువెత్తఁజొచ్చిరి. తరువాత నందీశ్వరుఁడు వజ్రాయుధమును జేతఁబట్టుకొని దైత్యుల నెఱుకమాడఁజొచ్చెను. మయుఁడు, తారకుఁడు మొదలగు దైత్యులు నందీశ్వరునిచే నివారితులై, తాపితులై యాతని వజ్రతుల్యప్రహారములచే నాహతులై సభయులై సత్వరముగా దశదిశలకుఁ బలాయితులైరి. అంధకాసురుఁ డప్పు డీవిధముగా దైత్యముఖ్యులు నందీశ్వరునిచే విదారితులగుచుండుటఁ జూచి పరిఘు చేకొని యాతని పృష్ఠదేశమున నాఘాత మొనరించెను. నందీశ్వరుఁ డప్పుడు భూమిపైఁ బడిపోవుటయు, నంధకాసురుఁడు తనవంకకుఁ బరుగెత్తివచ్చుచుండుటయుఁ జూచి యాగిరిబాల యాదుర్వృత్తునివలనిభయముచే నప్పుడు తాను శతరూప యయ్యెను. అంధకాసురుఁ డప్పు డాదేవీగణములోఁ బడి నలుదెసలఁ బరిభ్రమించుచుండెను. అరణ్యములో నాఁడేనుఁగులగుంపునఁ బడి భ్రమించెడు మదలోలుపుఁడైన కరీంద్రుఁ డెట్లుండునో, యట్టియవస్థయే యప్పు డంధకాసురునకును సంభవించెను. ఈదేవీగణములో గిరిబాల యెవ్వరో యాతఁడు తెలిసికొనఁజాలకపోవుచుండెను. ఈవిషయమున నాశ్చర్య మేమియును లేదు. ఏమన, జాత్యంధుఁడు, రాగాంధుఁడు, మదోన్మత్తుఁడు, లోభాక్రాంతుఁడు, ఈనలువ్వురకును నించుకయు యథార్థధర్మశక్తి యుండదు. నిజముగా నంధకాసురుఁ డప్పుడు గిరిబాలను గనుఁగొనుట కెంతప్రయత్నించియు నాతఁ డామెను దెలిసికొ

నలేకపోయెను. అప్పు డాదేవీసమూహ మంతయు యువతీసమూహ మనియే భావించుకొని యాతఁడు పరువెత్తఁజొచ్చెను. కాని యాతఁడు వారిని బట్టుకొనఁ జాలకపోయెను. తరువాత దేవీరూపశతమువలన నాయంధకదురాత్ముఁడు పరాభూతుఁడయ్యెను. దేవి యప్పు డత్యుత్తమాస్త్రమును బట్టుకొని యంధకుని మర్దించెను. అంధకుఁ డస్త్రాఘాతముచే భూపతితుఁ డయ్యెను. అది చూచి శతరూప యైనదేవి యచ్చటనుండి నిష్క్రమించి యంతర్హితురా లయ్యెను. ఇఁక నిక్కడ దైత్యులును, దానవసేనాపతులును నంధకుఁడు నేలఁగూలుటఁ జూచి గంభీర సింహనాదముఁ జేయుచు రణాభిలాషులై పరువిడఁజొచ్చిరి. ఆపరుగెత్తుచున్న దానవులకోలాహలమును విని గణేశ్వరుఁడు యుద్ధమును గోరి బయలుదేఱెను. ఆతఁడు వజ్రాయుధమును ధరించిన కుపితవాసవుని వలెఁ జూపుమాత్రముననే దానవులను బరాజితులను గావించి యంబికకడకుఁ దిరిగివచ్చి యామెమంగళమయపాదద్వంద్వమునకు వందన మాచరించెను. అంబికాదేవి యప్పుడు తనమూర్తు లన్నిఁటిని జూచి—"మీరు మీయిచ్ఛానుసారముగా వెడలిపోవచ్చును, మీరు మర్త్యులచేఁ బూజ్యమాన లగుచు భూమిపై నివసింపుఁడు. ఉద్యానములు, వనములు, వనస్పతులు, సకలజాతులవృక్షములును మీకు వసతులు గాఁగలవు. మీరు నిశ్చింతచిత్తములతో నాయాస్థానముల కేఁగుఁడు." అని గిరిబాలయైన యంబిక వారితోఁ బలుకఁగా వారు ను గిరిజకు సాష్టాంగనమస్కారములు గావించి నానాదిక్కులకు వెడలిపోయిరి. కిన్నరు లప్పుడు వారిని స్తవమొనరించిరి. తరువాత నంధకునకు స్పృహ కలుగఁగా నచ్చట నద్రినందినిగాని నందికేశ్వరుఁడుగాని నాని కగపడలేదు సరిగదా తనసైన్యదళములు నిర్జితములై యుండుట యాతని కగపడియెను. వెంటనే యాతఁడు పాతాళమునకుఁ బలాయ

నమొనరించెను. అంధకుఁ డట్లు పాతాళమునఁ బ్రవేశించి దివసము యం దాహారమును వర్జించెను. కామబాణజర్జరితుఁ డగుచుండుటచే రాత్రులయం దాతనికి నిద్రపట్టకుండెను. ఆతఁడు నిరంతరముఁ గామశరభిన్నుఁ డగుచు గౌరిని స్మరించుచుండెను.

## —♦ మురదానవచరిత్రము ♦—

పిమ్మట నారదుఁడు—మహర్షీ! అంబికాదేవి నందీశ్వరుని వెంటఁ బెట్టుకొని యంధకాసురునితో రణమొనరించునప్పుడు శంకరుఁ డెచ్చోట నుండెను? ఈవృత్తాంతము నాకెఱింగింపుము" అని యడుగఁగాఁ, బులస్త్యుఁడు మరలఁ జెప్పఁదొడంగెను—

భగవానుఁడైన భవుఁడు సహస్రవర్షపర్యంతము నట్లు మహామోహనిరతుఁడై యుండుటచే, నప్పటినుండియు నాతఁడు నిస్తేజుఁడై, హీనవీర్యుఁడై, లజ్జితుఁ డయ్యెను. అందుచే మహేశ్వరుఁడు తపస్సుఁ గావించుట కుద్యుక్తుఁడయ్యెను. మహాబుద్ధిశాలియైన భగవానుఁ డప్పుడు మహావ్రతము నొకదాని ననుసరింపు మని చెప్పి యంబిక నోదార్చి శైలప్రభృతుల నామెకు రక్షకులుగా నియోగించి మహీతలమున విహరింపఁజొచ్చెను. ఆతనిగ్రీవము మహాముద్రార్పితమై మహానాగములచేఁ జుట్టుకొనఁబడియుండెను. ఆతఁడు కటిప్రదేశమున మహాశంఖమేఖలను ధరించెను. ఆతనిదక్షిణహస్తమునందుఁ గపాలమును, నాతనివామహస్తమునఁ గమండలువు నుండెను. ఆతఁడు వృక్షములందుఁ, బర్వతములందుఁ, బర్వతసానువులయందు, నదనదీప్రభృతులయందు నొక్కొక్కదినము నివసించుచుండెను. త్రైలోక్యములును సమగ్రములుగా నాతనికి విహారస్థానము లయ్యెను. ఆతఁడు ఫల, మూల, జల, వాయుమాత్రాహారుఁడై క్రమముగా శతవర్షములు

గడపెను. ఒకప్పుడు, విశాలహిమాలయమునందలి రమణీయశిలాతల మున వసించుచు మహేశ్వరుఁ డొక బిరడను ముఖవివరమునం దుం చుకొని యొక్కమాఱుగా నిశుచ్ఛ్వాసుఁ డయ్యెను. తరువాత నాబి రడ పరమేష్ఠియైన శంకరుని కపాలమును విదారించుకొని యుజ్జ్వలాకా రము అగు నాతనిజడలనడుమనుండి భూతలమునం బడియెను. అప్పు డాబిటాపతనమువలనఁ బర్వతము విదారితమై భూసమాన మయ్యెను. ఆస్థలము తీర్థశ్రేష్ఠ మనియుఁ బవిత్రకేదార మనియుఁ బ్రఖ్యాతి గల దయ్యెను. తరువాత వృషధ్వజుండైన హరుఁడు కేదారతీర్థమున కిట్లు పుణ్యవర్ధనకరంబులును, పాపహరంబులును, మోక్షసాధకములునగు వరంబుల నొసంగెను—ఓపుణ్యకేదారమా! సకలమానవులు నీతీర్థము లయందుండు జలపానముచేసి, సంయతులై, మధుమాంసనివృత్తులు ను బ్రహ్మచారులును, పరాన్నపరాఙ్ముఖులును నై యాఱుమాసము లిట్లు వ్రతధారణచేసిరేని, వారికి నిశ్చయముగా హృదయపంకజమం దాశివలింగము విరాజితము కాఁగలదు. ఎవ్వరిహృదయకమలమునం దెప్పుడును శివలింగము విరాజమాన మగుచుండునో, వా రెప్పుడును పాపకార్యముల నుత్సహింపరు. వారు తమపితృపురుషుల నుద్దేశించి యనుష్ఠించినశ్రాద్ధము నిశ్చయముగా నక్షయము కాఁగలదు. ఈకేదా రతీర్థమునందు స్నానము, దానము, తపము, హోమము, జపము మొ దలగునే సత్క్రియ లాచరించినను, అవి యన్నియు నక్షయములు గాఁ గలవు. ఇచ్చట మరణించినవారి కిఁకఁ బునర్జన్మభయము లేదు.” అని త్రిలోచనుఁ డిట్లు వరముల నొసంగెను. సాక్షాద్భగవద్వాక్యాను సారముగా కేదారతీర్థము మానవుల కాయాపవిత్రఫలముల నొసంగు చుండెను. హరుఁడు కేదారమున కిట్లు వరముల నొసంగి యచ్చటనుం డ బయలుదేఱి, పాపనాశినియు, భానునందనియు నైనకాళిందీనదికి

స్నానార్థమై వెడలెను. అతఁడు కాళిందీమహాజలమునందు దిగి మునిఁగి జలములోనుండియే "ద్రుపదాది" గాయత్రీమంత్రములను జపించుచుండెను. మహేశ్వరుఁడైన శంకరుఁడు దివ్యసరస్వతీజలములయందు నిమగ్నుఁడైనతరువాత నర్ధసంవత్సరము గడచిపోయినది. అయినను నాతఁడుజలములనుండి పైకి రాలేదు. కాని యాసమయమునందు బ్రహ్మాయు, చతుర్దశభువనములును, సప్తసాగరములును విచలితములై పోయెను. నక్షత్రము లన్నియుఁ దారకారాజితో వసుమతి పైఁ బడఁజొచ్చెను. ఇంద్రప్రముఖదేవబృందము తమతమసీరముల నుండి చలించిపోఁజొచ్చిరి. జగన్మంగళము గలుగుఁగాక యని మహర్షులు జపపరాయణులు గాఁజొచ్చిరి. దేవత లందఱును నంతరంగములయందుఁ గోపము గల్గినవారై యిందులకుఁ గారణమేమో బ్రహ్మ నడిగి తెలిసికొనవలయు నని నిశ్చయించుకొని యందఱు నేకమై బ్రహ్మసన్నిధి కేఁగి—"దేవా! లోకము లన్నియు సంక్షోభితములై పోవుచున్న వేమి? ఇవి నిలుచునా లేదా యని సంశయము కలుగుచున్నది." అని విన్నవించుకొనిరి. పద్మగర్భుఁ డప్పుడు దేవతలను జూచి యిట్లు చెప్పెను—"ఇందులకుఁ గారణ మేమో నే నరయఁజాలకున్నాను, లెండు, మనమందఱము చక్రపాణిసన్నిధి కేఁగి యీ సంగతి నడిగి తెలిసికొందము." అని పితామహుఁడు పలుకఁగానే యింద్రాదిదేవత లందఱు బ్రహ్మ నగ్రవర్తిగాఁ జేసికొని మురారిసదనమునకుఁ బ్రయాణమైరి.

పులస్త్యుఁ డిట్లు చెప్పఁగా నారదుఁడు—"ఓ దేవర్షీ! నీ విప్పుడు చెప్పినమురారి యెవ్వఁడు? దేవ, యక్ష, కిన్నర, దైత్య, రాక్షస, పార్థివప్రభృతు లందఱిలో నాతఁ డెవ్వరో నా కెఱింగింపుము" అని యడిగెను. పులస్త్యుఁడు మరలఁ జెప్పందొడంగెను—"సత్త్వ, రజ,

స్త్రములను మూఁడుగుణములకు నాధారభూతుఁడైనవాఁడును, మతి యు, గుణవంతుఁడయ్యు నిర్గుణుఁడైనవాఁడును నెవ్వఁడో, ఆసర్వగా మియు, సర్వవ్యాపియు, మధుసూదనుఁడునే మురారి." అని పుల స్త్యుఁడు చెప్పఁగా నారదుఁడు—“మురుఁ డను పేరుగల ప్రసిద్ధాసు రుఁ డెవ్వఁడు? అతఁ డెవ్వనిపుత్త్రుఁడు? విష్ణుఁ డాతని నేకారణముచే రణమున నిహతునిఁ జేసెను? ఇవి యన్నియు నా కెఱిఁగింపుము!" అని యడుగఁగాఁ బులస్త్యుఁడు మరల నిట్లు చెప్పుచున్నాఁడు—“ఆ లకింపుము, నేను సురాసురులయుద్ధవ్యాపారమును వర్ణించెదను. నీవు దేనినిగూర్చి యడుగుచున్నావో, ఆవృత్తాంతము మిక్కిలి విచిత్రమైన దియుఁ, బుణ్యప్రదమైనదియుఁ, బాపహరమైనదియును. పూర్వకాల మునఁ గశ్యపునికుమారుఁడుగా మురుఁ డనుదైత్యుఁ డుద్భవించెను. అప్పుడు యుద్ధములలో దితినందనులు సురశ్రేష్ఠులచే నోడింపఁబడిరి. మురాసురుఁ డప్పుడు మరణమునకు భయపడి విభుఁడైన బ్రహ్మ నా రాధింపఁదొడంగెను. తరువాత బ్రహ్మ సంతుష్టుఁడై యాతనికి వర మొసంగఁదలఁచి—“వత్సా! వరమును గోరుము" అనియెను. అప్పుడు మురదైత్యుఁడు పితామహునివద్ద నిలిచి—“ఓవిభూ! యుద్ధక్షేత్ర మునందు నే నెవ్వరెవ్వరినిఁ జేతితోఁ దాఁకుదునో, వారందఱును నమ రులైనను సరియే తత్క్షణము మరణమునొందవలయును." అని వరమ డిగెను. లోకపితామహుఁడైన బ్రహ్మ యాతనియభీష్టవరము నొసం గెను. మహాతేజుఁడును, మహాబలుఁడు నైన మురాసురుఁ డప్పుడు వరముల నొంది సురశైలమున కరుదెంచెను. అచ్చటి కేతెంచిమురాసురుఁ డవరము నొందినవృత్తాంతమును దేవ, యక్ష, కిన్నర, గంధర్వులకు వి శదపఱచెను. అందుచే నిఁక నెవ్వరును వానితో యుద్ధమునకు సన్న ద్ధులు గాఁజాలకుండిరి. అప్పుడు మురాసురుఁడు క్రోధమునఁ బ్ర అమ

రావతీపట్టనము నాక్రమించుకొని యింద్రుని యుద్ధమునకు రమ్మని యాహ్వానించెను. కాని పురందరుఁ డాతనితోఁ యుద్ధముచేయుటకు సమ్మతింపఁడాయెను. తరువాత మురుఁడు, అమరావతిలోఁ బ్రవేశిం చెను. ఆతఁ డట్లు ప్రవేశించునప్పు డెవ్వరుగాని యాతని నివారించు టకు సాహసింపఁజాలరైరి. మురాసురుఁడు తిన్నఁగా నింద్రునిభవన మున కేఁగి యింద్రు నీక్షించి—"ఓసహస్రాక్షా! నాతో యుద్ధము నకు రమ్ము, రాఁజాలనిచో స్వర్గమును వదలిపొమ్ము." అని పలికెను.

ఓనారదా! దైత్యుఁ డట్లు పలుకుచున్నప్పుడే సహస్రాక్షుఁడు స్వర్గరాజ్యమును బరిత్యజించి తత్క్షణమే భూతలమునకు వెడలిపోయెను. ఇంద్రునివజ్రమును, ఐరావతమును శత్రుహస్తమునఁ బడిపోయెను. ఇంద్రునిపుత్రికళత్రాదులును దేవతలతోఁ గాళిందిదక్షిణతీరమున నొకపురమును నిర్మించికొనిరి. మురదైత్యుఁడు స్వర్గాధికారము ను జేయుచు విపులభోగరాశి ననుభోగించుచుండెను. మయుఁడు, దారుకుఁడు మొదలగు ప్రచండస్వభావులగు ముఖ్యదానవులు, ఈసమయమునందు మురాసురు నాశ్రయించి స్వర్గవాసులగు యక్షగంధర్వులవలె నానాప్రకారములగు నామోదప్రమోదములతోఁ గాలముఁగడుపుచుండిరి. ఒక ప్పుడు మురమహాసురుఁడు మహాబలమునఁ గరుడించి సరయూనదీసమీపమున కేనుఁగు నెక్కివచ్చెను. ఆదినములయందు సూర్యవంశసంభవుఁడును వీర్యవంతుఁడు నగు రఘుమహారాజు యజ్ఞదీక్షితుఁడై యుండెను. అది చూచి మురదైత్యుఁ డచ్చటకేఁగి—"రాజా! నాతో యుద్ధముచేయుము. యుద్ధమునకు నాతోసరిగా నిలువఁగలవాఁ డెవ్వఁడును, చేయుటకు నర్హుఁడగువాఁ డెవ్వఁడును లోకమునఁ గాన్పింపఁడు లేఁడు." అని పలికెను.

అప్పుడు మహామతియు మహాతేజస్వియు తపోనిధియు మిత్రా

వరుణపుత్త్రుఁడు నైన వసిష్ఠుఁడు దైత్యసమీపమున కేతెంచి—ఓదై
త్యశ్రేష్ఠా! మానవు లందఱును నీకుఁ బరాజితులైయే యున్నవారు.
వారిని మరల జయింపవలసినయావశ్యక మెంతమాత్రమును లేదుగ
దా! నీవద్దఁ బరాజయము నొందితి మని యంగీకరింపనివా రెవ్వరో
వారిని ముందుగా జయింపుము. యుద్ధమునందు నీకిచ్ఛపొడమినచో
యమునితో రణమొనరించి యాతనిఁ బరాజితుని గావింపుము. ఓమ
హాసురా! ఆయముఁ డతిబలవంతుఁడు, ఆతఁడు నీశాసనమును మీఱి
నడచువాఁడు. ఆతని నీవు జయింపఁగల్గినచో సకలభూతలమును నీకు
వశీభూతమగుచున్నది.” అని పలికెను. ఆదనుజశ్రేష్ఠుఁ డప్పు డావసి
ష్ఠవాక్యములను విని దండధరుఁడైన ధర్మరాజును జయించుటకై బ
యలుదేఱెను. యముఁ డప్పు డాతఁ డరుదెంచుచుండుట విని సమర
మునం దాతఁ డసాధ్యుఁ డని తెలిసికొని మహిషవాహనము నధిరో
హించి కేశవునిసన్నిధి కేఁగెను. అట్లేఁగి యాతఁడు కేశవునకు వంద
నాదికము లాచరించి మురదైత్యునికార్యకలాప మంతయు నివేదించె
ను. కేశవుఁ డప్పు డాతనిఁ గని—“నీ విప్పుడు వెడలిపోయి, యాత
ని నెట్లయిన నిచ్చటికిఁ బంపివేయుము.” అని చెప్పెను. యమరాజు
వాసుదేవునియనుజ్ఞ విని త్వరపడఁజొచ్చెను. మురదైత్యుఁడును నింత
లో నగభేదినగరమునఁ బ్రవేశించెను. ఆతఁడు వచ్చుటఁ జూచి య
ముఁడు—“ఓదానవేశ్వరా! మురా! నీ కేమికావలయునో చెప్పు
ము. నేను నీకు దాని నొసంగెదను” అని పలికెను. మురదైత్యుఁ
డు—“ఓయమా! నీవు ప్రజాసంహారకార్యమును వదలికొనుము.
నీవు నాయాదేశము ననుసరించి వర్తింపవేని యుచితకాలములోనే నీమ
స్తకమును దెగవ్రేసి భూమిలోఁ బాఁతించెదను.” అని చెప్పెను. ధర్మ
రాజు—“నీవు సంహారకర్తవై నన్ను రక్షింపఁగల్గినచో నేను దప్పక

నీయా దేశమును బాలించెదను." అని పలికెను. మురాసురుఁ డప్పుడు —" నీకంటెను ముఖ్యుఁడైనవాఁ డెవ్వఁడున్నాఁడో చెప్పుము; నేను నిశ్చయముగాఁ బరాజయము నొందింపఁగలను." అని పలికెను. యముఁ డప్పుడు —" శంఖచక్రగదాధరుఁడైన విష్ణుఁడు నాకంటెఁ బ్రధానుఁడు. ఆతని నివాసస్థలము శ్వేతద్వీపము. ఆతఁడే నన్ను సంయామితునిఁ జేయుచుండువాఁడు." అని పలికెను. దైత్యవరుఁడైన మురుఁ డప్పుడు యమునిఁ జూచి —" ఆతఁ డిప్పు డెక్కడ నున్నవాఁడో చెప్పుము. నేను స్వయముగా నచ్చటి కేఁగి స్వహస్తములతో నాతని నిగ్రహించెదను." అని చెప్పెను. యముఁడు మురునిఁ జూచి —" నీవు క్షీరోదసాగరమున కేఁగుము, భగవంతుఁడైన విష్ణు వచ్చట నుండును." అని చెప్పఁగా విని మురుఁడు —" యమా! సరియే, నేను కేశవునివద్ద కేఁగుచున్నాను. కాని, నేను వచ్చునంతదాక నీవు ధర్మపరాయణులైన మానవులను నిగ్రహింపకుము." అని చెప్పి మురాసురుఁ డప్పుడు శేషపర్యంకశాయియుఁ జతుర్మూర్తియు నైన జనార్దనుఁ డెక్కడ విరాజిల్లుచున్నాఁడో, ఆక్షీరాబ్ధి కత్యుత్సుకముగాఁ బ్రయాణమై వెడలెను. అని పులస్త్యుఁడు చెప్పఁగా నారదుఁడు పులస్త్యునిఁ జూచి —" ఒక్కఁడును, సర్వవ్యాపియు, నవ్యయమూర్తియు నైన విష్ణుఁడు మరలఁ జతుర్మూర్తి యని చెప్పితి వేల? అది యేమో నాకెఱింగింపుము." అని యడిగెను. పులస్త్యుఁడు మరలఁ జెప్పఁదొడంగెను —

ఓమునీ! విష్ణువు సర్వవ్యాపియు, నవ్యక్తమూర్తియు, నవ్యయుఁడు నయ్యు నేకారణముచే నాతఁడు చతుర్మూర్తిగా నిర్దేశింపఁబడెనో, చెప్పెద నాకర్ణింపుము. వాసుదేవాఖ్యుఁడు పరమపద మనియు, నవ్యక్తుఁ డనియు, అప్రతర్క్యుఁ డనియు, అనిర్దేశ్యుఁ డనియు, శుక్లుఁ డనియు, శాంతుఁ డనియు, ద్వాదశపత్రకుఁ డనియుఁ బ్రసిద్ధి కలదు."

అనఁగా నారదుఁడు మరల—"ఓ మహామునీ! శుక్ల, శాంత, అపరితర్క్య, అనిర్దిష్టప్రభృతు లెట్లయ్యెను. విష్ణునిసంబంధమున ద్వాదశపత్రము లేమేమి? నా కెఱింగింపుము" అని యడిగెను. అప్పుడు పులస్త్యుఁడు మరలఁ జెప్పఁదొడంగెను—"పరమేష్ఠిచేఁ జెప్పఁబడిన రహస్యకథ నాకర్ణింపుము. ఇది మొట్టమొదట సనత్కుమారుఁడు వినియెను. తరువాత నాతఁడే నా కెఱింగించెను." అని పులస్త్యుఁడు చెప్పఁగా విని నారదుఁడు—"బ్రహ్మానలస విలసిత్కీర్తియు, సిరుపమునుంచి నట్టియు నా సనత్కుమారుఁ డెవ్వరు?" అని యడిగెను. పులస్త్యుఁడు నారదునితో మరల నిట్లనియెను—ధర్మునకు భార్య యను 'అహింస' ఆ యహింసకు నల్వురు పుత్రు లుద్భవించిరి. ఓ మునిసత్తమా! ఆ పుత్రు లందఱును యోగవిద్యాభిరతులై యుండిరి. వారందఱిలోఁ బెద్దవాఁడు సనత్కుమారుఁడు, రెండవపుత్రుఁడు సనాతనుఁడు, మూఁడవవాఁడు సనకుఁడు, నాలవవాఁడు సనందనుఁడు. కపిలుఁ డనునాతఁడు సాంఖ్యయుక్తుఁడును తపస్సునకు నాధారభూతుఁడు నై యుండెను. ఆతని శ్రేష్ఠత్వముఁ జూచి, సనత్కుమారుఁడు తాను జ్యేష్ఠుఁ డయ్యుఁ గనిష్ఠునకుఁ దగియున్న శాసనము నొసంగెను. ఆతఁడు కపిలాదులకు మానసబ్రహ్మ మహాయోగము నొసంగెను. ఒకప్పుడు సనత్కుమారుఁడు బ్రహ్మసన్నిధి కేఁగి యోగజ్ఞానవిషయమై జిజ్ఞాస గావింపఁగాఁ బ్రజాపతియైన పద్మజన్ముఁడు సనత్కుమారున కిట్లు చెప్పెను—"ఓసాధూ! నీవు సాంఖ్యయోగి వైతివి. నావద్దఁ బుత్రునివలె జ్ఞానతత్త్వమును వినవలయును, అందుచే నేను చెప్పినట్లు చేయుము. నేను నీకు దాని నుపదేశించెదను." అని చెప్పఁగా సనత్కుమారుఁ డిట్లనియెను—ఓవిభో! నేను నీకు శిష్యుఁడ నెప్పుడైతినో, అప్పుడే పుత్రుఁడ నైతిని. ఏమన? ఓపితామహా! శిష్యునకును బుత్రునకును నడుమ విశేషత్వ మేమి

యును లేదు." మరల బ్రహ్మ యిట్లనియెను—"ఓ ధర్మసుతా! ధర్మకర్మసంఘటనభేదముచే శిష్యునకును బుత్రునకును విశేషత్వము గలదు. దానిని నీ కెఱింగించెద నాకర్ణింపుము.

పున్నామనరకమునుండి రక్షించువాఁడగుటచే నాతనిఁ బుత్రుఁడనియు; శేషమును—అనఁగాఁ బాపమును హరించువాఁడు గనుక శిష్యుఁ డనియు వా రిరువురుఁ జెప్పఁబడిరి. వేదము లిట్లే వచించుచున్నవి." అని బ్రహ్మ పలుకఁగా నారదుఁడు—"ఓదేవా! పుత్రుఁడు తండ్రిని బున్నామనరకమునుండి పరిత్రాణ మొనరించుచున్నాఁ డంటివి, ఆపున్నామనరక మనునది యేమి? శిష్యునిచే హరింపఁబడెడి యాశేషము—అనఁగాఁ బాప మన నేమి? ఇది యంతయును సవిస్తరముగా నా కెఱింగింపఁగోరుచున్నాను." అని యడిగెను. బ్రహ్మ యప్పుడు మరల నిట్లు చెప్పెను—మహర్షీ! నేను నీయొద్దఁ బరమపవిత్రమును, ప్రాచీనము నైన యాఖ్యానమును గీర్తించుచున్నాను. అది యోగాంగసంపన్నము, మృత్యుభయవినాశకము నైనది. దానివలనఁ బాపము శాంతించును.

## — ◆ ము ర దా న వ వ ధ ◆ —

బ్రహ్మ చెప్పుచున్నాఁడు—"పరస్త్రీగమనము, పాపాత్ముల సహవాసము, ఎల్లవారియెడలను బరుషస్వభావము గల్గియుండుట, ఈ మూఁడును మొదటినరకము. ఫలములనుదొంగిలించుట,నిష్ఫలముగాఁ దిరుగుట, వృక్షజాతులను ఛేదించుట, యనునది రెండవనరకము. హేయద్రవ్యమును స్వీకరించుట, అవధ్యులను వధించుట—బంధించుట, బాంధవులతో వివాదపడుట, ఇవి యన్నియు మూఁడవనరక మని ప్రసిద్ధి. సంసారసుఖవిచ్ఛేదకరమును, సర్వభూతభయప్రదమును నగు స్వ

ధర్మాభిచ్యుతి-చతుర్థనరకము. హింస, మిత్రులయెడలఁ గుటిలభావము చూపుట, అసత్యవాక్యప్రయోగము, ప్రత్యేకమిష్టాశనము, ననునవి పంచమనరకము. ఫలాదుల నపహరించుట, పరులను నిగ్రహించుట, యోగమునందు విఘ్నమును గలిగించుట, యానయుగ్మమును హరించుట, అనునవి షష్ఠనరకము. మోహావశమున రాజభోగమును హరించుట, రాజపత్నీగమనము సేయుట, రాజున కహితముగా సంచరించుట, అనునవి సప్తమనరకము. లుబ్ధత్వము, లోలుపత్వము, లభించిన ధర్మార్థములను నాశముచేయుట, అనునవి యష్టమనరకము. బ్రహ్మస్వమును హరించుట, బ్రాహ్మణులను నిందించుట, బాంధవులతో విరోధము పెట్టుకొనుట, అనునవి నవమనరకము. శిష్టాచారవిలోపము, శిష్టజనవిద్వేషము, శిశువధము, శాస్త్రచౌర్యము, ధర్మచౌర్యము, అనునవి దశమనరకము. షడంగసంహారము, షాడ్గుణ్యప్రతిషేధము, ననురెంటను ఏకాదశనరకమని సాధువు లందురు. సాధుజననిందయు, నిరంతరచౌర్యాచరణమును, అకార్యకరణమును, సంసారపరివర్జనమును, అనునవి యన్నియు ద్వాదశనరక మని చెప్పఁబడెను. ధర్మము, నర్థముఁ, గామమును దుంచివేయుట, అపవర్గమును దుర్వినియోగముచేయుట, సంవిదులను సంవేదన మొందించుట, మొదలగునవి త్రయోదశనరకము. ధర్మహీనులైన కృపణులను వర్జింపకుండుట, అగ్నినిచ్చుట మొదలగునవి చతుర్దశనరకము. ఈనరక మత్యంతగర్హితమైనది. అజ్ఞానము, అసూయాప్రకాశము, అశుభము, అశౌచము, అసత్యవాక్ప్రయోగము ననునవి పంచదశనరకము. ఆలస్యము, క్రోధము, ఆతతాయిత్వము, పరగృహమునకు నిప్పుముట్టించుట, పరస్త్రీలను గోరుట, శాస్త్రములయం దీర్ష్యాభావము, శాస్త్రము తెలియుననుగర్వము, నవి షోడశనరకము. ఈనరకము విశేషనిందితమైనది. ఈ చెప్పఁబడిన

పున్నామాది పాపసమూహములయందు మగ్నుఁడై మానవుఁడు పుత్రోత్పాదనముచే జగత్పతియైన జనార్దనుని ప్రీతినొందింపఁగల్గినచో, నాతఁడు సంతుష్టుఁడై శుభదృష్టులఁ బరపి పుత్రరూపమున వానిఘోరతరపున్నామనరకమును వినాశ మొనరించుచున్నాఁడు. ఓధర్మసుతా! ఈకారముచేతనే పుత్రనామము నిరూపితమైనది. ఆతరువాత శేషపాపలక్షణములు వినుము. దేవ, ఋషి, భూత, నర, పితృదేవతల నుద్దేశించి యొసఁగఁబడిన ధనమును గాంక్షించుట, పరధనాసక్తి, సర్వవర్ణములయందు నేకత్వము, ఓంకారమునుండి నివృత్తి, పాపాత్ములను స్మరించుట, గురుజననింద, అగమ్యాగమనము, ఘృతాదివిక్రయము, చండాలాదిపరిగ్రహము, తనదోషమును గప్పిపుచ్చుకొని పరదోషమును బయలుపుచ్చుట, మాత్సర్యము, వాగ్దుష్టత్వము, నిష్ఠురత, అధర్మపరులైనవారి నామగ్రహణము, దారుణత్వము, అధర్మసేవ, మొదలగునవన్నియు నరకావహములైనవి. ఈపాపపరంపరలయందుఁ దగులుకొని జ్ఞానగురుఁడైన శంకరుని సంప్రీతినొందింపఁగల్గినచో శేషపాపములు సమూలముగా నిరస్తము లగుచున్నవి. ఇవిగాక కాయిక, వాచిక, మానసికపాపములును, పితృమాతృభ్రాతృకృతదోషములును, బాంధవాశ్రితకృతదోషములును, ఇహజన్మకృతములైన సకలదోషములును విలయము నొందుచున్నవి. పుత్ర, శిష్యధర్మము లివియే. ఇందులకు విపరీతము నుత్పన్నమైనచో, పదక్రమమును విపరీతమై యుండును. నిజముగ విజ్ఞుఁడైన పుత్రుఁడు శిష్యవిధానమునుగూడఁ జేయఁగలఁడు. శిష్యులప్రయోజనమునుగూడ స్వీకరింపఁగల్గిన పుత్రుఁడు శిష్యునికంటె శ్రేష్ఠతరుఁ డగుచున్నాఁడు. శిష్యుఁడు శేషపాపమునుండియే యుద్ధరింపఁగలఁడుగాని, పుత్రుఁడు సకలపాపములకును బరిత్రాత.

అని బ్రహ్మ చెప్పఁగాఁ దపోధనుఁడైన సనత్కుమారుఁ డిట్లనె

విని మరల—"దేవా! ముమ్మాటికి సత్యము జెప్పుచున్నాను. నేను నీపుత్రుఁడను. అందుచే నాకు యోగవిషయమై యుపదేశము నొసంగుము." అని ప్రార్థించెను. మహాయోగసంపన్నుఁడైన బ్రహ్మ యప్పు డిట్లనియెను—నీతల్లిదండ్రులు నిన్ను నాచేతిలో నుంచినచో నేను నీకు యోగోపదేశము చేయఁగలను. ఏమన? అప్పుడే నీవు నాకు నిజముగా దాయాదివి కాఁగలవు. సనత్కుమారుఁడు మరల బ్రహ్మను జూచి—అది యెట్లో దాయాది నెట్లగుదునో విశదముగాఁ జెప్పు" మని యడిగెను. సాధుశ్రేష్ఠుఁడైన సనత్కుమారుఁ డిట్లు పలుకఁగా విని భగవానుఁడైన పితామహుఁడు మందహాసవదనుఁడై యిట్లనియెను. "వత్సా! వినుము. దాయాదు లాఱువిధము లని చెప్పఁబడినది. ఎట్లన—ఔరసుఁడు, క్షేత్రజుఁడు, దత్తుఁడు, కృత్రిముఁడు, గూఢోత్పన్నుఁడు, అపవిద్ధుఁడు నని. ఋణ, పిండ, ధన, క్రియా, గోత్రసామ్య, కులవృత్తి, శాశ్వతప్రతిష్ఠ లన్నియుఁ బైని జెప్పఁబడిన యార్గురుపుత్రులపై నిర్దిష్టము లయ్యెను. వీరుగాక మఱియు నాఱువిధములైన పుత్రులు చెప్పఁబడియున్నారు. ఎట్లన? కానీనుఁడు, సహోఢుఁడు, క్రీతుఁడు, పౌనర్భవుఁడు, స్వయందత్తుఁడు, పారశవుఁడు నని వీరిమొదల ఋణ, పిండప్రభృతులైన ప్రసంగము లేమియుఁ జెప్పఁబడలేదు. వీరు గోత్రనామధారులుఁ గలసమ్మతులుమాత్ర మగుదురు." అని బ్రహ్మ చెప్పఁగా విని సనత్కుమారుఁడు మరల నిట్లనియెను. "బ్రహ్మా! ఈపుత్రులవిషయమైన విశేషములు వివరణముగా నా కెఱింగింపుము" అని యడుగఁగా సురేశ్వరుఁడైన బ్రహ్మ యిట్లనియెను—ఓపుత్రా! విశేషములు వివరించెద నాకర్ణింపుము. తనకుఁ బ్రతిబింబరూపమున స్వయముగా నుత్పన్నుఁడైన పుత్రుఁ డెవఁడో వాఁడే ఔరసుఁడు పతి క్లీబుఁడుగాని, ఉన్మత్తుఁడుగాని, వ్యసనాసక్తుఁడుగాని యైనప్పుడు

పత్ని యాతనియనుజ్ఞచే నితరు లెవ్వరివలననైనఁ గనినపుత్రుఁడు. క్షేత్రజుఁ డని పిలువఁబడుచున్నాఁడు. తల్లిదండ్రు లనుమతిచే నితరులకు దత్తముచేయఁబడిన పుత్రుఁడు దత్తపుత్రుఁ డని ప్రసిద్ధి నొందుచున్నాఁడు. మిత్రునిచే నీయఁబడిన మిత్రునిపుత్రుఁడు కృత్రిమపుత్రుఁ డని చెప్పఁబడును. ఏగృహమునం దైన నాతనితండ్రి యెవ్వరో యెవ్వరికిఁ దెలియఁబడకుండఁ బుట్టినపుత్రుఁడు గూఢోత్పన్నుఁడు. ఇవి యేవియుఁగాక బయట నుండి తాను దెచ్చుకొనినపుత్రుఁడు, అపవిద్ధుఁ డనఁబడును. కన్యగా నున్నస్త్రీకిఁ గలిగినపుత్రుఁడు కానీనుఁ డనఁబడును. గర్భవతిగా నుండి వివాహితురాలైన స్త్రీకిఁ బుట్టినపుత్రుఁడు సహోఢుఁ డని చెప్పఁబడును. ధన మిచ్చి కొనితెచ్చుకొనినపుత్రుఁడు క్రీతుఁ డనఁబడును. ఒకని కిచ్చి వివాహముచేసిన స్త్రీని, మరల నింకొకని కీయఁగా నామె కప్పుడు కలిగినపుత్రుఁడు పౌనర్భవుఁ డనిపించుకొనును. దుర్భిక్షకాలమునందుఁగాని, వ్యసనకాలమునందుఁగాని, మఱియు నితరకారణముచేఁగాని యేవ్యక్తి తన్నుఁ దా నర్పించుకొనుచున్నాఁడో యాతఁడు స్వయందత్తుఁ డని చెప్పఁబడును. వివాహితగాని, అవివాహిత గానియైన శూద్రస్త్రీగర్భమందు బ్రాహ్మణునివలన నుత్పన్నుఁడైనపుత్రుఁడు పారశవుఁ డని పిలువబడుచున్నాఁడు. ఓవత్సా! ఈకారణములచే నీవు స్వయముగా నాత్మదానమున కధికారివి గావు. అందుచే శీఘ్రముగా నేఁగి నీతల్లిదండ్రులను పిలిచికొనిరమ్ము." అని బ్రహ్మ చెప్పఁగా ననంతరము సనత్కుమారుఁడు నిజతల్లిదండ్రులను సంస్మరించెను. ఆతఁడు స్మరించినంతమాత్రమున నాదేవదంపతులు [illegible] వచ్చి కరుణించిరి. తరువాత వారు [illegible] కుమారునిఁ జూచి— "దేవా! మాకాజ్ఞ యేమో యొసంగు" మని యడిగిరి. సనత్కు

మారుఁ డనంతరము సుఖాసీనులై యున్న మాతాపితలను జూచి—నేను యోగివిషయమున నుపదేశ మొసంగుమని భగవానుఁడైన బ్రహ్మను బ్రార్థించియుంటిని. కాని యాయన నన్నుఁ దనపుత్రుని గమ్మని యాజ్ఞచేసెను. అందుచే మీరు నన్నుఁ దదీయహస్తములకుఁ బుత్రునిఁగా నర్పణసేయుఁడు." అని ప్రార్థించెను.

పుత్రుని యీమాటలను విని యోగగురుఁడైన బ్రహ్మను జూచి యామాతాపితలు—"భగవంతుఁడా! సనత్కుమారుఁ డింతవఱకు మాపుత్రుఁడుగా నుండెను. కాని యీదినమునుండియు నీతఁడు నీపుత్రుఁడే యయ్యెను." అని చెప్పి బ్రహ్మకాతని నర్పించి వారు వచ్చినదారినే స్వర్గమున కేఁగిరి. అప్పుడు పితామహుఁడు వినితపుత్రుఁడైన యా సనత్కుమారునకు ద్వాదశపత్రక యోగము నుపదేశించి యిట్లు చెప్పెను—ఓంకారము దీనికి శిఖ, మేషము శిరోదేశమున విరాజిత మగుచుండును. దీనికి వైశాఖమాసము ప్రథమపత్రము. నకారము ముఖమునందుండును, వృష మచ్చట విరాజమాన మగుచుండును. జ్యేష్ఠమాసము దానిద్వితీయపత్రము. మోకారము దానిభుజయుగళము, మిథునము దానియందు విరాజమాన మగుచుండును. విఖ్యాతమైన యాషాఢమాసము దానితృతీయపత్రమని కీర్తింపఁబడినది. భకారము దానినేత్రయుగళము, కర్కటము దానియందుండును, శ్రావణమాసము దానిచతుర్థపత్రమని చెప్పఁబడుచున్నది. గకారము హృదయ మని చెప్పఁబడినది. సింహము దానియందుండును, మఱియు భాద్రపదమాసము దానిపంచమపత్రమని వర్ణితమైనది. వకారము కవచమని నిర్దిష్టమైనది. కృత్య దానియం దధిష్ఠితమైనది. ఆశ్వయుజమాసము దానిషష్ఠపత్రి మని చెప్పఁబడినది. తేకారము మనస్సని చెప్పఁబడుచున్నది. తుల దానియందు విరాజిత మగు

చున్నది, కార్తికమాసము దానిసప్తమపత్ర మని చెప్పఁబడినది. వాకారము నాభిదేశము, వృశ్చికము దానియం దధిష్ఠితమైనది. మార్గశిరమాసము దానియష్టమపత్రముగా నిర్ణీతమైనది. సుకారము జఘనస్థలము, ధనుర్ధరము దానియందు విరాజమానము, పౌషమాసము దానియం దుండును, విఖ్యాత మాఘమాసము దాని దశమపత్రముగాఁ బరిగణింపఁబడినది. దేకారము జానుయుగ్మము, కుంభము దానియం దధిష్ఠితము, ఫాల్గుణమాసము దాని యేకాదశపత్రము. ఓమునీ! వకారము పాదద్వయము, మీనము దానియం దధిష్ఠితమైనది. చైత్రమాసము దాని ద్వాదశపత్రము. కేశవునిచక్రము ద్వాదశ నాభియుక్తము. పరమేశ్వరుఁడు స్వయముగాఁ ద్రివ్యూహుఁడును, నేకమూర్తియునై యున్నాఁడు. ఈద్వాదశపత్రము భగవానునిరూపము. ఓమునివరా! ఈరూపముఁ దెలిసికొనినవారి కెన్నఁడు మరల మృత్యువు నొందవలసినది లేదు. భగవంతుని రెండవరూపము సత్త్వాదిమూర్తి. అది చతుర్వర్ణ, చతుర్ముఖ, చతుర్బాహు యుక్తమైనదియు, శ్రీవత్సాంకిత మైనదియును, దాని యంగసమూహ మునదారమైనది. ఏనరుఁడు మున నమును దానికి వినాశము లేదు. దానిత్రుతీయ శేషమూర్తి తామసవపు; ఈమూర్తి సహస్రవిధములుగా విరాజిత మగుచుండెను. సహస్రవదనములచే శోభిత మగుచుండెను. దానికాంతిసంపద యపూర్వమైనది. అది ప్రజావర్గమునకుఁ బ్రళయంకరము. చతుర్థమూర్తి రజోగుణమయము, అది రక్తవర్ణమును, జతుర్ముఖమును, ద్విభుజశాలియు, వనమాలావిరాజితమును, ఈమూర్తియే సృష్టికర్తయు నాదిపురుషుఁడును, ఈమూర్తిత్రయ మవ్యక్తమునుండి యావిర్భూతమయ్యెను. దానినుండియే మరీచి మొదలగు ఋషులును, దక్షునవేశమేలు పురుషులును ప్రాదుర్భూతులైరి. ఓమునిశ్రేష్ఠుఁడా! విష్ణునివిశ్వవ్యాపకమైన

యీ ప్రాచీనచతుర్భుజరూపమును నీకడఁ గీర్తించి యుంటిని. దుర్వృత్తుఁడైన మురాసురుఁ డప్పుడు యమరాజు చెప్పినట్లుగా మరల నాతని సమీపమునకు వచ్చె. మధుసూదనుఁ డాతనిఁ జూచి—ఓహో! మురా! ఏమి నీ . . . . . వలయును!" అని యడిగెను. మురాసురుఁడు—"నేను నీతో నిప్పుడు యుద్ధ మొనరించుటకుఁ గోరి వచ్చితిని" అనియెను. అప్పు డాదనుజాంతకుఁడైన హరి యిట్లనియెను—"నీవు నాతో యుద్ధము చేయుటకు వచ్చితివో నీహృదయము కంపించుచున్న దేమి? జ్వరాతురుఁడైన వాఁడు మాటిమాటికిఁ గంపితకాయుఁ డగునట్లు, నీశరీరముగూడఁ గంపించుచున్న దేమి? నిజముగా నీయట్టి కాతరునితో నేను యుద్ధ మొనరింపను." అని మధుసూదనుఁడు పలుకఁగానే మురాసురుఁడు తక్షణమే తనహస్తమును తనవక్షస్థలముతో నదిమిపట్టుకొనియెను. తరువాత నాతఁడు—ఏదీ, యెక్కడ, ఏమి కంపించుచున్నది? యనుచు హతబుద్ధియై పడిపోయెను. హరి యప్పుడు మృదులఘువిక్రమముతో నాతనిహృత్పద్మమునఁ దనచక్రప . . . . . గా చే నాతనిదేహము భిన్నమైపోయెను. దేవతలందఱు నప్పుడు విగతవ్యథులై భగవంతుఁడైన పద్మనాభుని ధన్యవాదము లొనరింపఁజొచ్చిరి. తీక్ష్ణచక్రమును ధరించి భగవంతుఁడైన హరి యేవిధముగా మురదైత్యుని వినాశనము గావించెనో యది నీకు వివరించి చెప్పితిని. మురవినాశనమైన నప్పటినుండియు విభుఁ డనతసింహాముకారి యనుపేరఁ బ్రఖ్యాతుఁ డయ్యెను.

## —♦ దేవతలకు విష్ణుహృదయమునందు శివదర్శనము కలుగుట ♦—

పులస్త్యుఁడు మరలఁ జెప్పఁదొడంగెను—అటుపిమ్మట దేవతలందరును మురారిసదనమున కేగి యాతనికి నమస్కరించి—జగమం

తయు నిట్లు సంక్షోభము నొందుటకుఁ గారణమే మని యడిగెను. భగవంతుఁడైన మురారి యామాట లాలకించి దేవతలను జూచి—"సురలారా! రెండు మనమందఱమును హరుని మందిరమున కేగుదము. ఆతఁడు మహాజ్ఞానశాలి, నిజముగా నీజగత్ క్షోభ మెందులకుఁ గలిగినదో యాతఁ డెఱుంగును." అని పలికెను. వాసుదేవుని యీపలుకులు విని శక్రాదిదేవతలు జనార్దనుని ముందిడికొని మందరభూధరమునకు వచ్చిరి. కాని వారజ్ఞానతిమిరముచే నంధులై హరునిగాని, హరవృషభమునుగాని, గిరినందినినిగాని, నందీశ్వరునిగాని, యెవ్వరినిగాని కాంచఁజాలకుండిరి. అప్పు డాశూన్యపర్వతమును మాత్రమే వారు చూచిరి. దేవత లట్లు మూఢదృష్టులై యుండుటఁజూచి మహాప్రభుఁడైన విష్ణుఁడు—"ఓ దేవతలారా! ఎదుటనున్న మహేశ్వరుని మీరేల దర్శింపఁజాలకున్నారు?" అనియెను. దేవత లప్పుడు—"స్వామీ! మేము గిరిజాపతియైన మహాదేవుని నిజముగానే చూడఁజాలకున్నాము. మఱియును తెలియఁ జాలకున్నాము." అని పలికిరి. జగన్మూర్తియైన జనార్దనుఁ డప్పుడు వారికిట్లనియెను—దేవతలారా! మీరు స్వార్థమును సాధించుకొనుటకు మృడానిగర్భమును నష్టముఁ గావించి మహాపాపులై, మహాదేవుని సన్నిధిని మహాపరాధులైరి. అందుచే మీకు భగవానుఁడైన శూలపాణి జ్ఞానవివేకమును లోపముచేసెను. మఱియు నా కారణమునచే మీరు సమ్ముఖస్థుఁడై యున్న మహాదేవునిజూచియుఁ జూడఁజాలకున్నారు. అందుచే మీరందఱుఁ గలిసి కాయశుద్ధికొఱకును, దేవదర్శనముకొఱకును దప్తకృచ్ఛ్రవ్రతము గావించి, సవిశేషమైన పరిశుద్ధతనొంది మహాదేవుని దెలిసికొనవలయును. ముందుగా సాగ్రములగు నూఱుకుంభములతో క్షీరస్నానమును గావించి తరువాత నలువదినాలుగుదధిస్నానములును, ముప్పదిరెండుహవిస్నానములును,

బదునాఱుకుంభముల పంచగవ్యస్నానములును జేయవలయును. అనం
తరము మధుపూర్ణము లగునెనిమిదికలశములతోను, బదునాఱుజల
కలశములతోను స్నానముచేయవలయును. ఆతరువాత నూటయెని
మిదికలశముల గోరోజనము, కుంకుమ, చందనము మొదలగువానితో
భక్తియుక్తులై దేవదేవు ననులిప్తుని జేసి, తరువాత బిల్వములు, కమ
లములు, జందనము, అగురు, కర్పూరము, మందారముం, బారిజాతము,
గురివింద మొదలగువానిచే నర్చించి, అగురుకాలేయచందనధూపము
నొసంగి, పదక్రిమముతో ఋగ్వేదీయశతరుద్రీయజపమును గావింపవ
లయును. ఇట్లాచరించిన వో, దేవదేవుని దర్శింపఁగలరు. లేకున్న
మీకు దేవదేవునిదర్శనము లభించుట యసంభవము." అని వాసుదే
వుఁడు చెప్పఁగా దేవతలు కేశవునిఁ జూచి—"ఓమధుసూదనా! సా
ర్వకాలికకాయశుద్ధిని గలిగించెడి యాతప్తకృచ్ఛ్రివ్రితమునకు విధాన
మెట్టిదో వివరింపు మని యడిగిరి. వాసుదేవుఁ డప్పుడు వారి కిట్లు
చెప్పఁదొడంగెను—మూఁడుదినము లుష్ణజలములును, మూఁడుదినము
లుష్ణదుగ్ధములును, మఱియు మూఁడుదినము లుష్ణఘృతమును మాత్రి
ము పానముచేసి యనంతరము మూఁడుదినములు వాయువునుమా
త్రిమే భుజింపవలయును. ఓసురలారా! ఇదిగాక ప్రితిదివసమును
బదునొకండు పలములజలమును, ఎనిమిదిపలముల దుగ్ధమును, ఆఱుప
లములఘృతమును బానముచేయుట కర్తవ్యము." అని విష్ణువు చెప్పె
ను. తరువాతఁ బులస్త్యుఁడు మరలఁ జెప్పఁదొడఁగెను—వాసుదేవుని
యిట్టివిధివాక్యములను విని శక్రాదిదేవతలు కాయశోధనముకొఱకు
తప్తకృచ్ఛ్రివ్రితానుష్ఠానము చేయఁగడంగిరి. వ్రతసమాప్తి కాఁగానే
వారు పాపనిర్ముక్తులైరి. దేవతలు నిష్పాపులై యప్పుడు వాసుదేవు
నితో నిట్లనిరి.

“ఓ కేశవా! మహాదేవుఁ డెక్కడ విరాజిల్లుచున్నాఁడు? మేము క్షీరాదిస్నానోపకరణములచే నాతని కభిషేకము చేయవలయును.” అని యడుగఁగా విష్ణుదేవుఁడు—“దేవతలారా! మహాదేవుఁడు నా దేహమునందే విరాజిల్లుచున్నాఁడు; ఆతఁడు యోగబలముచే నా దేహమునందే ప్రతిష్ఠితుఁడై యుండెను. మీ రాతనిని జూడఁజాలకున్నారేమి?” అనియెను. దేవత లప్పుడు—దేవా! మేము త్రిపురహంతను జూడలేకున్నారము. “ఓ సురేశా! సత్యము వచింపుము. మహేశ్వరుఁ డెక్కడ నున్నాఁడు?” అని ప్రార్థనాపూర్వకముగా వాసుదేవు నడిగిరి. అవ్యక్తపురుషుఁడైన హరి యప్పుడు తన హృదయ పంకజములో శయనించియున్న యీశానలింగమును వారికి దర్శింపఁజేసెను. అమరు లప్పుడు యథాక్రమముగా నుత్తమక్షీరాదులచే శాశ్వతమును, ధ్రువము, క్షయోదయరహితము నగు నా యీశ్వర లింగమును స్నానము చేయింపఁదొడఁగిరి. వారాతనికి మొదట గోరోచనమును, సురభిచందనమును నలందిరి, తరువాత బిల్వపత్రములచేతను, పద్మములచేతను, భగవంతుఁడును లింగాకారధరుఁడు నగు హరుని బూజింపఁదొడఁగిరి. తరువాత భక్తితో ధూపమొసఁగి దివ్యములగు నోషధు లన్నియు నివేదనము గావించి, నూటయెనిమిది నామముల జపించి, ప్రణిపాతము లొనరించిరి.

ఇట్లు చెప్పఁగా నారదుఁడు మరల “దేవత లెండ్లు విధముగా ధ్యానముసేయఁగా, నా సత్వతమోగుణ సంపన్నులగు హరిహరులు పరస్పరము నేక దేహము నెట్లు ధరించియుండిరి?” అని ప్రశ్నించెను. అప్పుడు పులస్త్యుఁడు మరలఁ నిట్లు చెప్పఁదొడఁగెను—భగవంతుఁడప్పుడు సురలు చింతించుచున్న విషయము నెఱింగి విశ్వరూపమును ధరించెను. ఆతనియందు సహస్ర హస్తాలు నేత్రములును, సర్వాయుధ

సంయుతమును, అవ్యయము నై యుండెను. ఆతని దేహము త్రినయన
స్వర్ణాహికుండల, జటా గుడాకేశ, గరుడ వృషభ, హార భుజంగభూ
షితమును, కటిదేశము పీతవసన, అజినసమాచ్ఛన్నము నై యుండెను.
ఆతనిహస్తమునందుఁ జక్రి, అసి, హల, శార్ఙ్గ, పినాక, శూల, అజ
గవధనుః, కపర్ద, ఖట్వాంగ, కపాల, ఘంటా, శంఖవిరాజమానమగు
చుండెను. ఓ మహర్షీ! దేవత లీహరిహరమూర్తిం జూచి — ఓయవ్య
యపురుషా! నీకు మేము నమస్కరించుచున్నాము. అని కమలాస
నునితోడ నందఱు దేవతలుఁ బ్రణమిల్లిరి. వారిచిత్తము లప్పుడు వా
రిహరునియందే యేకనిష్ఠను గలిగియుండెను. దేవేశుఁడైన హరి వారి
చిత్తైకాగ్రత నెఱింగినవాఁడై వారందఱను వెంటఁబెట్టుకొని వెంటనే,
తనయాశ్రమమైన కురుక్షేత్రమున కేఁగెను. అప్పుడు వారందఱును
నక్కడ జలములలో నున్న మహేశ్వరస్థాణుమూర్తిని దర్శించి " స్థాణు
నకు మేము నమస్కరించుచున్నా" మని చెప్పుచు నక్కడ నిలిచిరి.

తరువాత సురపతి " ఓజగన్నాథా! నీవు ప్రసన్నుఁడవు గమ్ము.
మాకు వరము లొసంగుము. ఇప్పుడు సమస్తజగములును సంక్షోభ
ము నొందుచున్నవి. నిజముగా నోప్రియాతిథీ! నీ వుద్ధితుఁడవు గావ
లయును." అని పలికెను. అనంతరము సర్వాంతర్యామి వృషధ్వ
జుఁడు, దేవతలశాశ్వతమగు వాక్యములను విని వెంటనే జలముల
నుండి పైకి లేచెను. అట్లు లేచి మందహాసముఖుఁడై — " దేవదేవ
తలకు నమస్కరించుచున్నా" నని పలికెను. అతఁ డట్లు సమీపింపఁ
గానే యింద్రాదిదేవబృంద మాతనికి సవినయ నమస్కారములు గా
వించి "శంకరా! నీవవలంబించిన యీవ్రతమును శీఘ్రముగాఁ బరి
త్యజింపుము. వలన, త్రిభువనములు సమగ్రములుగా నీ తేజముచే
వ్యాప్తములును, క్షుబ్ధములు నగుచున్నవి." అని వేఁడుకొనిరి. మ

హాదేవుఁ డప్పుడు—“ అట్లే యగుఁగాక, నేను దక్షిణమే నా మహావ్రతముఁ బరిత్యజించుచున్నాను ” అని చెప్పెను. ఇంద్రాదిదేవతలు మహాదేవుని యీ పలుకుచే సంతుష్టులై సంయతచిత్తములతో స్వర్గధామమున కేఁగిరి.

ఓ మహాముని ! అప్పుడు ద్వీప, సాగర, శైలసమన్వితముగాఁ బృథివి కంపింపఁజొచ్చెను. అది చూచి రుద్రుఁడు—పృథివి యిట్లు కంపించుటకుఁ గారణ మేమి ? యని యించుకసేపు చింతించి తరువాతఁ గురుక్షేత్రము నాల్గుదిక్కులుఁ దిరుగఁజొచ్చెను. ఓఘవతీనదీతీరమునఁ దపోధనుఁడైన యుశనుఁడు వసించుచుండుట యాతఁ డప్పుడు చూచెను. అతనిఁ జూచి దేవదేవుఁడు—నీ వెందులకుఁ దపము చేయుచున్నావు ? శీఘ్రముగాఁ జెప్పుము. ఏమన ? ఓ విప్రా ! నీ తపస్సుచే జగములు సంక్షోభించుచున్నవి. అని యడిగెను. ఉశనుఁ డప్పుడు—“ ఓ త్రిలోచనా ! నేను నీ ప్రసన్నతకొఱకే యిట్లు కఠోరతపము సేయుచున్నాను. ఈ తపఃప్రభావముచే సంజీవనీవిద్యను దెలిసికొనవలయునని నాకుఁ గోరిక గలదు. ” అని చెప్పెను. మహాదేవుఁడు—“ ఓ తపోధనా ! సుతప్తమైన యీ నీ తపముచే నేను దుష్టినొందితిని. నిజముగా నీవు సంజీవనీవిద్యాప్రాప్తి నొందఁగలవు. ” అని యప్పుడు వరమొసంగెను. ఉశనుఁ డీవిధముగా వరమొంది తపస్సునుండి నివృత్తుఁడయ్యెను. కాని ధరాధర, సాగర, పాదపములతో ధరాదేవి విచలితయగుచుండుట మాన దయ్యెను. మహాదేవుఁ డది చూచి సప్తసారస్వతవిత్రతీర్థమున కేఁగెను. అక్కడి కేఁగఁగా మంకణకుఁ డను మహర్షి యచ్చట నృత్యము సేయుచుండుట యాతని కగపడియెను. మంకణకుఁడు బాలకునివలె భావభరముచే బాహువులను జాచి వేగముగా నిట్లు నృత్యము సేయుచుండెను. అతని తాండవవేగముచే భూమి యూ

హితమై పర్వతాదులతోఁగూడఁ గంపింపఁజొచ్చెను. అది చూచి మహాదేవుఁ డాతనిసమీపించి యాతనిచేయి పట్టుకొని మందహాసముఖుఁడై «ఓమహర్షీ! దేనిని భావించి దేనినిగూర్చి యిట్లు నృత్యముసేయుచున్నావు? ఎందువలన నీ కిట్టిహర్ష మునయించినది. అది నాకుఁ దెలియఁజెప్పుము?" అనియెను. మంకణకుఁ డప్పుడు—ఓద్విజవరా! ఎందుచే నా కిట్టి సంతోష మదయించినదో వినుము. నేను గాయశుద్ధికొఱకు బహువర్షములు తపస్సు చేసితిని. తరువాత నిప్పుడు నా హస్తము క్షతమై దానినుండి శాకరసము స్రవితముగాఁ బడెను. «ఓద్విజవరా! అందుచే నేనతిమాత్రసంతుష్టుఁడనై యిట్లు నృత్యము సేయుచున్నాను." అని చెప్పెను. శంకరుఁ డప్పు డాద్విజవరునిఁ జూచి—ఇదిగో! చూడుము. తాడనసేయఁగా నాకరమునుండియు నతిశుక్లమైన భస్మము స్రవితమగుచున్నది, కాని యందువలన నాకు నించుకైనను హర్షము గలుగలేదు. నీవు నిజముగాఁ బ్రమత్తుఁడవైతివి." అని పలికెను. మహర్షీ! మంకణకముని యది విని వృషధ్వజునకుఁ బ్రణామము గావించి నృత్యమును బరిత్యజించెను, మఱియు విస్మయవిస్ఫారితుఁడై విస్మితభావముతో నాతనికిఁ బాదవందన మాచరించెను. మహాదేవుఁ డప్పు డాతనిని జూచి—ఓవిప్రా! నీవు బ్రహ్మతో సమ్యక్సంపూజితుఁడవై బ్రహ్మలోకమున కేఁగుదువుగాక. ఈపృథూదకతీర్థము పృథివియందు ప్రసిద్ధమును, మహాఫలప్రదమును నగుఁగాక. ఇచ్చోట సుర, అసుర, గంధర్వ, విద్యాధర, పన్నగగణములు సాన్నిధ్యము వహింతురుగాక. ఈసారస్వతజలము సతతము బొందువారి పాపహరణము గావించి ధర్మమునకుఁ బ్రభావాధారముగాఁ బరిణమించుఁగాక. సుప్రభ, కాంచనాక్షి, సువేణువు, విమలోదక, మహోదర, ఓఘవతి, విశాఖ, సరస్వతి, యనుసప్తసరస్వతు లిచ్చట నిత్యసన్నిహి

త్తమై యుండును. ఈతీర్థ మాదంబకును సోమపానఫలమును, బరమపుణ్యము నొసంగును. మఱి నీవును గురుక్షేత్రమునందు గరీయమైన మూర్తిని స్థాపించి పరమపవిత్రము, నన్యదుర్లభము నైన బ్రహ్మలోకమున కేఁగఁగలవు. ఓతపోనిధీ! దేవదేవుఁడైన మహేశ్వరుఁ డిట్లు చెప్పఁగా జితచిత్తుఁడైన మంకణకుఁడు కురుక్షేత్రమునందు లింగమూర్తిని స్థాపించి బ్రహ్మలోకమున కేఁగెను. మంకణుఁ డేఁగఁగానే భూమి నిశ్చలయయ్యెను. తరువాత శంభుఁడు అతిపవిత్ర వాసభూమియైన మందరాచలమునకు వచ్చి నివసించెను. ఓద్విజా! అప్పుడు మహాదేవుఁడు తానెందుకు మందరమునకు కేఁగెనో దేవిని జూచుట కంధకాసురుఁ డేకారణమున పాతాళలోకము ప్రవేశించెనో అది యంతయు నీకు వివరించెదను.

## —♦ ౭౦ వ యుపాఖ్యానము. ♦—

అనంతరము నారదుఁడు పులస్త్యునిం గాంచి “ఓ పరమమునీంద్రా! అంధకాసురుఁడు పాతాళముఁ బ్రవేశించి యేమి చేసెను? శంకరుఁడు మందరమున కేఁగి యేమిచేసెను? అది యంతయుఁ జెప్పుము” అని యడిగెను. అప్పుడు పులస్త్యుఁ డిట్లు చెప్పఁదొడంగెను— “ఓబ్రహ్మజ్ఞా! అంధకాసురుఁడు పాతాళమున కేఁగెను. కాని యచ్చటి కేఁగియు మదనానలముచే దగ్ధుఁడు గాఁ జొచ్చెను. ఆతనిసర్వాంగములును సంతప్తములై పోవుచుండెను. అతఁ డప్పుడు దానవులందఱను జూచి యెవరా గిరిబాలను దెచ్చి సత్వరముగా నాకిచ్చెదరో, అతఁడే నాస్నేహితుఁడు, అతఁడే నాబంధువు, అతఁడే నాతల్లి, అతఁడే నాతండ్రి” అని పలికెను. మదనాతురుఁడైన యాదైత్యుఁ డిట్లు పలుకఁగానే [illegible] మహాగంధర్వసముత్థో

నిట్లు పలికెను. ‘‘ ఓవీరా ! నీ వే గిరిబాలనుగూర్చి యిప్పుడు మాటా డుచున్నావో, ఆగిరిబాల నీకు న్యాయముచేఁ తల్లియు, నాతిప్రియు నుఁడైన దేవదేవుఁడు నీకుఁ దండ్రియు నగుదురు. ఇందులకుఁ గారణము వినుము.

ఓదానవా ! పూర్వకాలమునందు ధర్మనిష్ఠుఁడైన నీతండ్రి యపుత్రకుఁడై యుండి పుత్రలాభార్థము మహాదేవు నారాధించెను. తరువాత మహాదేవుఁ డాతనికిఁ బుత్రుఁడు గలుగునట్లు వర మొసంగెను. వర మిచ్చునప్పు డాతఁడు—ఓహిరణ్యాక్షా ! నేను యోగమగ్నుఁడనై యున్నకాలమున నాపుత్రి కౌతుకవశమున నానేత్రములు మూసెను; అందుచే నొకయంధకార మావిర్భవించెను. ఆతమమునుండియే, యీ నీలనీరదగంభీరనినాదము గల భూత మావిర్భవించెను. ఓదైత్యా ! ఈతఁడు నీకే నిజముగా యోగ్యుఁడైన పుత్రుఁడు. అందుచే నీవీని నిని గైకొనుము. నీయీపుత్రుఁడు లోకవిశిష్టము లగుకార్యములు చేయుచు, త్రిలోకజననియెడల నెప్పు డభిలాషియగునో, బ్రాహ్మణుల నెప్పు డవమానించునో, బ్రాహ్మణహత్యకొఱ కెప్పుడు ప్రయత్నించు నో, అప్పుడు నేను స్వయముగా నీతనివధావిధానమును గావించెదను’’ అని చెప్పెను. అట్లు చెప్పి యాతఁడు వెంటనే తపవానభవనమైనమం దరభూధరమున కేఁగెను. అప్పుడు నీతండ్రియు నిన్నుఁ గైకొని రసా తలమున కరుదెంచెను. ఓదానవా ! అందుచేతనే శైలసుత నీకు మా తృస్థానమునం దున్న దని చెప్పియుంటిని. వాస్తవముగా శంభుఁడే జగత్తులకు గురుఁడును, దండ్రియును. తరువాత నీవును శాస్త్రజ్ఞుఁడ వు. అపూర్వగుణగ్రామసంపన్నుఁడవు. సర్వవిధయుక్తిజ్ఞానమున కా ధారుఁడవు. నిజముగా నీయట్టిపురుషుఁ డెంతమాత్రము నెప్పుడును మనోమధ్యమమునం దిట్టిపాపసంకల్పమును బోషింపఁగూడదు. నా యీ

దవ్యక్తమూర్తియైన మహాదేవుఁడు సర్వలోకములకుఁ బ్రభుఁడు. సర్వ జీవసమస్కృతుఁడు, సర్వత్రి యజయ్యుఁడు. ఈశైలనందిని యాతనికి సహధర్మిణి. నిజముగా నో సురశత్రూ! ఎవ్వఁడును నీ వామెను గామింపఁగూడదు. అట్లు మోహింతువేని నీశిరము వేయివ్రక్కలగును. ఆమె సకలజగన్మాత. సమస్తజీవకోటులును ఆజననికి సంతానము. అట్టియామెను సదా భక్తితోఁ బూజించుటకు బదులుగా నామెను నీవు గోరుదువా? ఓరిపాపీ! భృగునందన యైన యరజను మోహించి నీయట్టిరాక్షసుఁడే వినాశమును గాంచిన సంగతి నీవు వినియుండ లేదా?

పూర్వము దండుఁడనుపేరు గలయొకరాజుండెను. ఆతనిబలవాహనములు ప్రసిద్ధములైనవి. ఆమహాతేజుఁడు భార్గవునిఁ బురోహితునిఁ గాఁగోరెను. భార్గవునిరక్షణముచే నాతఁడు వివిధయజ్ఞము లనుష్ఠించుటకు సమర్థుఁ డయ్యెను. భార్గవునిపుత్త్రుఁడైన శుక్రునికి, అరజ యను పేరు గల యొకకూఁతు రుండెను. శుక్రుఁ డొకప్పు డసురరాజైన వృషపర్వునిభవనమున కేఁగెను. అచ్చట నాతఁడు వృషపర్వునిచే సత్కృతుఁడై బహుదినములు వాసముచేయుచుండెను. ఇఁక నిక్కడ సర్వాంగసుందరియైన యాతనికూఁతు రరజ స్వగృహమునం దుండి యగ్నిపరిచర్య చేయుచుఁ గాలము గడపుచుండెను. ఒకసమయమునందు దండ నరపతి భార్గవాశ్రమమున కేఁగి, « శుక్రాచార్యుఁ డెక్కడ నున్నాఁడు » అని యడిగెను. పరిచారిక లప్పుడు—« భగవానుఁడైన భార్గవుఁడు యాజనకార్యముకొఱకు వృషపర్వునిగృహమున కేఁగెను.” అని చెప్పిరి. నృపతి యప్పుడు—« భార్గవాశ్రమమునందున్న రమణీమణి యెవ్వరు?” అని యడిగెను. పరిచారిక లప్పుడు—« రాజా! భార్గవనందిని యైన యరజ యిచ్చట నున్నది. ” అని చెప్పిరి. మహాబాహుఁడైన యిక్ష్వాకునందనుఁ డాశుక్రసుతను జూచుటకు నాశ్రమమునఁ బ్రవే

శించెను. అరజ యప్పు డాతని కగపడియెను. అతఁ డామెను జూడఁ
గానే కామబాణములచే జర్జరితుఁ డయ్యెను. ఓయంధకా! మహీపతి
యైన దండుఁ డప్పుడు కృతాంతబల ప్రేరణమునకు వశుఁడై తనతో
నున్న భృత్యులను, స్నేహితులను, మఱియు శుక్రశిష్యులను బంపివేసి
తానొక్కఁడుమాత్రమే లోనికరిగెను. అతనిరాకచే సంతుష్టురాలై, గురు
నందినియుఁ గీర్తిమతియు నైన యరజ యాతని కెదురేఁగి భ్రాతృభా
వముతో నాతనిని సత్కరించెను. ఓదానవా! ఆనరపతి యట్టిసమయ
మునం దామెను జూచి—“ఓబాలామణీ! నేను గామానలముచేఁ
దప్తుఁడ నగుచున్నాను. నీవు తక్షణమే యాలింగనరూపమైన సలిల
కముచే నన్నాహ్లాదపఱుపవలయును.” అని పలికెను. అప్పు డాయరజ
వినీతభావముతో నిట్లుత్తర మిచ్చెను—నృపవరా! నాతండ్రి యత్యం
తకోపనప్రకృతి గలవాఁడు. అతఁడు దేవతలనైనను దగ్ధముచేయ
సమర్థుఁడు. ఓమూఢబుద్ధీ! విశేషించి నీవు నాకు న్యాయముచే భ్రా
తవు, నేను నీభగినిని, ఎట్లన? నీవు నాతండ్రిశిష్యుఁడవు.” అని యా
మె పలుకఁగా రాజామెను జూచి—“ఓభీరురాలా! నీతండ్రి కోపా
గ్నిచే నేను ముందటికి దగ్ధుడ నగుదునో యేమో, కాని కామాగ్ని
యిప్పుడే నన్ను దగ్ధముచేసి వేయుచున్నది.” అనియెను. అరజ య
ప్పు డాతనికి—“రాజా! ముహూర్తమాత్రము నిలువుము. నాతండ్రిని
బిలిచి యాతనివద్ద నీవిషయమున మాటలాడి నన్నిమ్మని కోరుము.
ఆతఁడు నిశ్చయముగా నన్ను నీకొసంగును.” అని చెప్పెను. నరపతి
యైన దండుఁ డప్పుడు—ఓహో సుందరీ! కాలక్షేపము గావించుటకు
నా కించుకయు శక్తిలేదు. విశేషించి ముందు కాలయాపనమున
విఘ్నము సంభవించును—అనియెను. అరజ యప్పుడు—ఓరాజ
నవా! మోహగ్రస్తుని మొప్పమును సహింపదగినది గాదు. నిజముగా

నైతివి. మదనుఁడు నీదృష్టిశరములచే నన్నేకాంతముగా నాహతునిఁ జేయుచున్నాఁడు. అందుచే నీవు నీపక్షస్తల్పమున నన్ను శయనింప నిమ్ము. లేనిచోఁ గాముఁడు పునఃపునర్దర్శనములచే నన్ను భస్మీభూతుని గావించివేయును." రాజకుమారుఁ డిట్లు పలుకఁగా సర్వాంగసుందరియైన చిత్రాంగద సఖులయాతంకము గలిగియు రాజనందనునకుఁ దన్నుఁ దా నర్పించుకొనకుండ లేకపోయెను. ఈవిధముగాఁ బూర్వకాలమునం దాతన్వి రాజకుమారుని రక్షించెను. అందుచేత "నోసుశ్రోణీ! నీవును నన్నిట్లు రక్షింపుము." అని చెప్పెను. అప్పుడు శుక్రసుతయైన యరజ—రాజా! పరిణామమునందుఁ జిత్రాంగద కెట్టి గతి ఘటిల్లెనో, యది నీ వెఱుంగవా! నేను జెప్పెదను వినుము—అప్పుడు చిత్రాంగద స్వతంత్రురాలై సురథరాజునకుఁ దన్నుఁ దా నర్పించుకొనఁగా నామెతండ్రి యీయనుచితస్వాతంత్ర్యమున కామె నిట్లు శపించెను—"ఓమందమతీ! నీవు స్త్రీస్వభావముచే ధర్మమును బరిత్యజించి యాత్మదానము గావించితివి. ఈయపరాధముచే నీ కిఁక వివాహము గాదు. నీవు భర్తృసుఖమునుండి వంచితురాలవు గాఁగలవు. నీకుఁ బుత్రలాభము కలుగఁబోదు. నీ కన్నివిధములఁ బతితో నెడఁబాటు సంభవించును."

అని యిట్లు శాపవాక్యములను పలుకఁగానే యారాజనందనుని సరస్వతీనది తత్క్షణమే యచ్చటనుండి ముప్పదియోజనములదూరము, నకుఁ గొట్టికొనిపోయెను. రాజకుమారుఁ డిట్లు దూరీభూతుఁడు కాఁగానే చిత్రాంగదమోహమునకు వశీభూతురాలై పడిపోయెను. అప్పుడు సఖులామెను లేవనెత్తి సరస్వతీజలములలో స్నానముచేయించిరి. ఆశీతిరవారిస్నానముచేఁ జిత్రాంగద మఱియు మృతకల్పురాలై పోయెను. తరువాత నామెసఖు లందఱును విశ్వకర్మందిరి మృతురాలైన దని

ధావించుకొని సత్వరముగా ముందుపనులకై తొందరపడఁజొచ్చిరి—కొందఱు కాష్ఠములను సంగ్రహించుటకొఱకు నాత్రపడుచుండిరి. మఱికొంద ఱగ్నిని దెచ్చుటకై వేగిరపడుచుండిరి. ఈవిధముగా వారందఱు నరణ్యములోఁబడి చిక్కులు పడుచుండఁగా శోభనాంగియైన చిత్రాంగద స్పృహ కల్గినదై నలుదెసల నీక్షించి చూడఁగా రాజకుమారుఁడుగాని పరమప్రియాస్పదలైన సఖులుగాని యెవ్వరును గాన్పింపరైరి. అప్పు డామె యత్యంతవేగముగా నాసరస్వతీజలములలోఁ బడిపోయెను. ఓనరపతీ! అప్పు డామెను గాంచనాక్షియైన సరస్వతీనది వేగముగా మహానదియైన గోమతియొక్క తరంగకుటిలసలిలములలోనికిఁ ద్రోసివేసెను. ఓద్విజనాథా! తరువాత గోమతీనది యామెయదృష్టమును గుర్తెఱింగి యామెను సింహవ్యాఘ్రసమాకులమైన మహారణ్యములోనికిఁ ద్రోసివేసెను. ఈవిధముగాఁ జిత్రాంగద కెట్టియవస్థ ఘటిల్లినదో, యది నే నెఱుఁగుదును. కావున నే నాత్మదానమును జేయఁజాలను. నీ సచ్చరిత్రముచేతనే నన్ను సర్వవిధముల రక్షింపుము." అని పలికెను. మహేంద్రతుల్యతేజుఁడైన దండరాజు శుక్రనందిని పలుకులు విని మందహాసముచేయుచు నిట్లనియెను—ఓతనుమధ్యా! ఆతరువాత చిత్రాంగదకును, ఆమెతండ్రికిని, ఆసురథరాజునకు నెట్టిస్థితి ఘటిల్లినదో చెప్పెదను, మనసుంచి వినుము. రాజైన సురథుఁ డట్లు సరస్వతీసలిలములలోఁ గొట్టుకొనిపోఁగానే చిత్రాంగద మహారణ్యమునకుఁ జేరియు నామె యొకగగనచారియగు గుహ్యకునిదృష్టిపథమునం బడియెను. గుహ్యకుఁ డామెను జూచి యామెదగ్గఱ కేతెంచి యిట్లు పలికెను.

"ఓసుభగా! రమ్ము, నిన్ను సురథరాజునొద్దకుఁ గొంపోయెదను. ఓసుకేశినీ! నీవు నిశ్చయముగా నాతనిఁ జేరఁగలవు. కనుకఁ దుః

ణామే నీవు శ్రీకంఠభగవానునిసన్నిధి కేఁగుము." అని గుహ్యకుఁడు పలుకఁగా సునయునైన యాచిత్రాంగద వేగముగాఁ గాళిందీనదికి దక్షిణోత్తరదిశయందున్న భగవంతుఁడైన శ్రీకృష్ణునిమందిరప్రాంతమునకు వచ్చిచేరెను. తరువాత నాదేవదేవుఁడైన శ్రీకంఠుని దర్శించి కాళిందీజలములలో స్నానముచేసి నతిముక్తయై మధ్యాహ్నకాలమువఱకు శ్రీకంఠుని కెదురుగా నిలిచియుండెను. ఆసమయమున సులక్షణాన్వితుఁడును పాశుపతగురుఁడును సామవేదియు తపోధనుఁడునైన ఋతధ్వజుఁడు శ్రీకంఠుని స్నానముచేయించుటకొఱకు నచ్చటి కరుదెంచెను. చిత్రాంగద యసంగహీనయై కన్నీరుని విడుచుచుండెను. అట్లున్న చిత్రాంగద నాఋతధ్వజుఁ డీక్షించి—"యీవనమున నెవ్వరు చెప్పుమా' యని భాషింపఁ జొచ్చెను. అప్పుడు చిత్రాంగద చేతులు జోడించుకొని యాయనసమీపమున కేఁగుదెంచి తదీయపాదయుగళమునకు వందనము లొనరించెను.

ఋతధ్వజుఁ డప్పుడామెను జూచి—"వత్సా! నీవు దేవకన్యవలె తోఁచుచున్నది. నీ వెవ్వరికన్యవు? ఎందుల కీమానవహీనమై యరణ్యములోని కేతెంచితివి?" అని ప్రశ్నించెను. చిత్రాంగద యప్పుడు ఋషిసన్నిధియందు జరిగినదంతయు నెఱింగించెను. ఋషి యది యంతయు విని శిల్పిశ్రేష్ఠుఁడైన విశ్వకర్మ యెడలఁ గుపితుఁడై యాతని నిట్లు శపించెను—"పాపాత్ముఁడైన విశ్వకర్మ పగప్రతీకారమునై యాతనయను బలిమిఁ గూడియుండు నెందులకు శపించెనో, అందులకే యాతఁడు వానరయోనిం బుట్టుఁగాక" ఇట్లు శపించి యామహాత్ముఁడు తదనంతరము యథావిధిగా మరల స్నానమును సాయంసంధ్యయుఁ గావించుకొని మహాదేవు నర్చించెను. ఆతఁడు విధిప్రకారము దేవదేవుఁడైన శంకరు నభ్యర్చించి తరువాతఁ బలిలాలనయు సం

దరియు నైన యాచిత్రాంగద కిట్లు చెప్పెను — ఓసుభగురాలా! నీవు సప్తగోదావరి కేఁగుము. అక్కడి కేఁగి హాటకేశ్వరమహాదేవు నుపాసించుచు నుండుము. ఓరంభోరూ! దైత్యుండైన కందమాలి కొకకన్య కలదు. ఆకన్యపేరు దేవవతి. ఆకళ్యాణవతియైన దేవవతి యచ్చోటికి వచ్చును. ఇదిగాక యంజనుఁడను నొకగుహ్యకునకు దమయంతి యను నొకవిఖ్యాతకన్య గలదు. ఆతపశ్చారిణియు నచ్చటి కరుదెంచుట సంఘటిల్లును. పర్జన్యునికూఁతురు సుప్రసిద్ధ వేదవతి యనునామము గల యింకొకకన్య గలదు. ఆతపశ్చారిణియు నచ్చటికి వచ్చును. ఇట్లే మువ్వురు నచ్చటికి రాఁగలరు. వారు మువ్వురును సప్తసాగరజలములలోనికి రాఁగానే నీవప్పుడు హాటకేశ్వర మహాదేవునితో సమ్మిళిత మొందఁగలవు." అని మునివరుఁడు చెప్పఁగానే చిత్రాంగద సప్తగోదావరీతీర్థమున కేఁగెను. అచ్చటి కేఁగి యామె పవిత్రభావముతో దేవదేవుని పూజావ్యాపారమున నిమగ్నురాలై కందమూలఫలాహార భుజించుచుఁ గాలముఁ బుచ్చుచుండెను. అట్లుండఁగా గాననిపుణుఁ డైన నారదుఁ డామెను గాంచి యామె చారిత్రయోగ్యతను విలోకించి మహోత్సాహమున శ్లోకం బొకటి సన్నిధికిఁ బంపెను. అందలి భావ మిది- దేవ, అసుర, యక్ష, మనుష్య, నాగస్థానములలో, స్వయశరాకృతి ముచే నీవ్యాగాదృశ్యమైన చిత్రాంగద గుణమును దూరముచేయువా రెవ్వరును లేరా?" ఇట్టియర్థము గల శ్లోకమును రచించి పంపి తిరువాత నాతఁడు సర్వప్రాణిప్రియుఁడును సర్వవ్యాపియునగు పుష్కరనాభుని దర్శనముగోరి పరమపదమున కేఁగెను. వెడలునప్పు డాతఁడు తన మనసులోఁ జిత్రాంగదనుగూర్చి చింతించుచుండెను.

—♦ శాపమోచనము ♦—

దండుఁడు మరలఁ జెప్పఁదొడంగెను — ఓయుత్తమా! చిత్రాంగద పతియైన సురథుని చింతించుచు నచ్చట సుఖముగా నుండె. బహుకాలము గడచెను. ఆసమయంబున త్వష్ట విశ్వకర్మ మునిశాపముచే వానరము

నకుఁ బుట్టి విధాతప్రేరణచే మేరుశిఖరమునుండి భూతలమునఁ బడి యెను. ఓశుభాంగీ! తరువాత నాతఁడు శైలూకినీనదీతీరమునందున్న నిబిడవనభూయిష్ఠమైన పర్వతశ్రేష్ఠముపై వాసము చేయఁజొచ్చెను. ఓవరారోహా! ఆతఁ డక్కడనుండి ఫలమూల భక్షణముచేయుచు బహువర్షములు గడపెను. ఇట్లుండఁగా నొకనాఁడు దైత్యవరుఁడైన కందరుఁడు తనప్రియకుమారిని వెంటఁబెట్టుకొని యచ్చోటి కరుదెంచెను. అతని యాకుమార్తియే స్వర్గమున వేదవతి యను విఖ్యాతి గలది. వానరవరుఁడైన విశ్వకర్మ యావరవర్ణినితండ్రితో నరణ్యమున కరుదెంచుటఁ జూచి బలవంతముగా నామెను లాగికొనియెను. ఓసుందరీ! కందరదైత్యుఁడు తనకూఁతును గ్రోఁతి యెత్తుకొనిపోవుట చూచి యత్యధికక్రోధాన్వితుఁడై ఖడ్గమును ద్రిప్పుచుఁ గ్రోఁతివంకకుఁ బరుగెత్తెను. మహాబలుఁడైన వానరుఁ డప్పుడు దైత్యుఁడు వచ్చుచుండుటఁ జూచి యాశోభనాంగి యైన దేవవతినెత్తికొని హిమాలయమునకుఁ బాఱిపోయెను. అక్కడి కేఁగి యాయమునాతటమునందున్న శ్రీకంఠుని దర్శించి తత్సమీపమందు నిర్జనమైయున్న ఋష్యాశ్రమమును జూచెను.

వానరుఁ డాపుణ్యాశ్రమమునందు వేదవతి నుంచి కందరుని దగ్గఱఁ గాళిందీజలములలో మునిఁగెను. అది చూచి కందరుఁ డప్పుడు శాఖామృగముతోఁగూడ జలములలోఁ బడి తనతనయ దేవవతి మృతినొందె నని యనుకొనఁజొచ్చెను. అప్పు డాతఁడు నిజనికేతనమైన పాతాళమునకుఁ దిరిగివచ్చెను. ఇఁక నిక్కడ కాళిందిదేవి యాశాఖామృగమును దనప్రవాహవేగముచే శివనామక మగు నొకానొక ప్రసిద్ధ జనపదమునకుఁ దీసికొనిపోయెను. ఆజనపద మధికజనపరికీర్ణమై యుండెను. అప్పు డాతేజస్వియైన వానరుఁ డక్కడనుండి వేగముగాఁ దీరముఁ

జేరి గట్టునకు వచ్చి పూర్వము తా నాసుందరాక్షి యైన వేదవతి నెచ్చోట దాఁచివచ్చెనో, యచ్చోటికి కేఁగుటకుఁ బ్రయాణమయ్యెను. అతఁ డట్లు కపిలారణ్యమునకుఁ బోవసమకట్టుచుండఁగా, అంజనుఁ డనుగుహ్యకశ్రేష్ఠుఁ డచ్చోటునకుఁ దనకూఁతురైన దమయంతిని వెంటఁబెట్టుకొని వచ్చెను. వానరుఁ డప్పు డామెను జూచి—యీకన్య నిశ్చయముగాఁ గందునికూఁతురైన వేదవతియే యని యనుకొనియెను. అప్పు డాతఁడు తాను జలములలో మునింగి కష్టపడినదంతయు వృథ యయ్యె నని విచారించెను. ఓసుందరీ! వానరవరుఁ డిట్లు చింతించి వేగముగా వారి కభిముఖుఁడై పరుగెత్తఁజొచ్చెను. కాని యప్పు డాయబల వానికి భయపడి హిరణ్వతీనదిలోఁ బడిపోయెను. గుహ్యకవరుఁ డగు నంజనుఁడు తనతనయ నదీనీరములం బడిపోవుటఁ జూచి దుఃఖశోకసమాకులుఁడై యంజనపర్వతమున కేఁగి పవిత్రమగు మౌనవ్రతము నవలంబించి తపస్సుచేయుచు బహువత్సరములు గడపెను. ఇఁక నిక్కడ దమయంతి నదీవేగమునఁ గొట్టుకొనిపోయి సాధుజనభూయిష్ఠమైన పవిత్రకోసలదేశమును జేరెను. అచ్చోట నుండి యామె కన్నీరుఁ గార్చుచుఁ బోవుచుండఁగా నొకవటవృక్ష మామె దృష్టిపథమునం బడియెను. ఆవృక్ష మంతయు నూడలతో నిండియుండెను. దానిని నిజముగాఁ జూచినంతమాత్రముననే జటాధరుఁడగు మహేశ్వరుఁడు సాక్షాత్కరించె నని తోఁచును. వరాననయైన దమయంతి యీప్రగాఢచ్ఛాయాసంపన్నమగు వటవృక్షమును జూచి యచ్చట నున్నశిలాపట్టముపైఁ గూరుచుండి విశ్రమింపఁజొచ్చెను. అట్లు విశ్రమించుచున్నసమయమునం దామెకన్నులకు—ఏమిది, ఇచ్చట నెవ్వరును లేరే, తపోధనుఁడైన ఋతధ్వజునివద్ద కేఁగి—"నీపుత్రుఁడు వటవృక్షమున బంధితుఁడై యున్నాఁ డని యెవ్వరు చెప్పెదరు ?

-1

అని వినఁబడియెను. విశిష్టాక్షరములతోడి వాక్యములను విని దమయంతి యప్పుడు పైకిఁ గ్రిందికిఁ జూడఁజొచ్చెను. వృక్షాగ్రమునం దైదేఁడులయీడు గలబాలకుఁ డొకఁడుండెను. ఎవ్వరో యెందులకో ప్రయత్నపూర్వకముగ వాని నచ్చట స్త్రీజటలతో బంధించి వెడలి పోయిరి. దమయంతి యిది చూచి విస్మితురాలై దుఃఖింపఁజొచ్చెను. ఆమె యప్పు డాబాలకునిఁ జూచి—"బాలకా! చెప్పుము. ఏపాపాత్ముఁడు నిన్నిట్లు బంధించియుండెను?" అని యడిగెను. బాలకుఁ డిట్లనెను—ఓమహాభాగా! అతిదుష్టస్వభావుఁ డగు వానరుఁ డొకఁడు జటలతో నన్నీవటవృక్షమునకు బంధించిపోయెను. ఇప్పుడు నేను తపోబలముచేతనే జీవించుచున్నాను. దేవదేవుఁడైన మహేశ్వరుఁడు పూర్వకాలమునందు మనుపురమునఁ బ్రతిష్ఠింపఁబడియెను. తపోరాశియైన నాతండ్రి ఋతధ్వజుఁ డచ్చటఁ వాసముసేయుచున్నాఁడు. ఆమహాత్ముఁడు తపస్సుచేసికొనుచుండు సమయమునందు నే నాయన యోగబలముచే సకలశాస్త్రజ్ఞుఁడనై యలిబృందములతోఁగూడ జన్మించితిని. శుభాననా! అప్పుడు నాతండ్రి నన్నుజాబాలి యని భావించి నమస్కరించి యిట్లనియెను.

వినుము. నీవు పంచసహస్రవర్షములు బాలకుఁడవై యుండఁగలవు. తరువాత దశసహస్రవర్షముల పర్యంతము నీవు కౌమారదశ ననుభవింపఁగలవు. తరువాత వింశతి సహస్రవర్షముల కాలము నీవు వార్ధక్యమునఁ గడపఁగలవు. వీనిలో బాల్యదశయందుఁ బంచసహస్రవర్షములు నీవు దృఢబంధనమునం దుందువు. ఆతరువాతఁ గౌమారదశలో దశశతవర్షములు కాయపీడ ననుభవించి, ఆతరువాత యౌవనకాలములో ద్విసహస్రవర్షముల పూర్తిగా మహాభోగములు సకలము ననుభవింతువు. పిమ్మట వృద్ధకాలమునందు నలువదివందలసంవత్సర

నందు దుందుభిధ్వనులు చెలరేఁగెను. అప్పుడు మంగళధ్వనులు గూడఁ గలిగెను. అప్పుడు ఋషి మరల నిట్లు పలికెను- "ఈబాల మహారాజ్ఞి యగుటకు సందేహములేదు గాని, బాల్యావస్థ యందు మహాసంకటములలోఁ బడఁగలదు." అని పల్కి ముద్గల ఋషి నిమిషకాలములో నచ్చటనుండి వెడలిపోయెను. అప్పుడు నా తండ్రి నన్ను హిరణ్వతీతీర్థమునకుఁ గొంపోవుట కుద్యుతుఁ డయ్యెను. మే మక్కడకు వచ్చినంతలోనే యాకపియు నచ్చటికి వచ్చియుండెను. ఆకపికి భయపడి నేను నదీజలములలోఁ బడితిని. ఆనదీవేగమునఁబడి నేనీజనమానవశూన్యమైన ప్రదేశమునకుఁ దేఁబడితిని." అని చెప్పెను.

అప్పుడు జాబాలి—ఓసుందరీ! నీవు యమునాతీరమునందున్న శ్రీకంఠశివసమీపమున కేగుము. నాతండ్రి మధ్యాహ్నకాలమునం ద చ్చటికి శివార్చనకై వచ్చుచుండును. నీ వాయనసన్నిధి నీవృత్తాంత మంతయు నివేదింపుము. సత్వరముగా నీకు శుభము లభించును." అని చెప్పెను. దమయంతి యాపలుకు లాలకించి యాశ్మరక్షణము నపేక్షించి హిమాలయమునం దున్న యమునాతీరమునందలి ఋతధ్వ జునిసన్నిధానమునకై బయలుదేఱెను. అట్లేఁగి యామెకందమూల ఫలాగ్నిభోజనముచేఁ గాలముఁ గడపుచు, నల్పకాలములోనే తపస్వి యైనఋతధ్వజునకు గమ్యస్థానమైన శంకరనికేతనమును జేరెను. అనం తరమాసకలలోకవాంఛితుఁడైన శ్రీకంఠునకు దేవదేవునకు వందనమా చరించి దమయంతి యచ్చట నున్న లిఖితాక్షరములను జూచెను. తరు వాత నాచారుహాసిని యాలిఖితాక్షరము లన్నిటియర్థమును గ్రహించి తాను స్వయముగా నిల్లొకశ్లోకమును లిఖించెను. ఆశ్లోకార్థ మిది, ముద్గలఋషి, నేను రాజమహిషిని గాఁగల నని చెప్పియుండెను. కాని నా కిప్పుడు తటస్థించి యున్నయీదురవస్థ నెవ్వరు తప్పింపఁగలరు?" అని

దమయంతి యొకశిలాఫలకముపై లిఖించి తాను స్నానము చేయుటకు యమునాజలములలోనికరిగెను. అప్పుడామె మార్గమధ్యమమున మత్త కోకిలకు నిలయమైన యొకరమ్యాశ్రమమును గాంచెను. దానిని గాంచఁగానే యామె మనస్సులో నిట్లనుకొనెను—నిశ్చయముగా నిదియే ఋషివరుఁడైన ఋతధ్వజుఁడు వసించెడి యాశ్రమము'' అని స్థిరపఱచుకొని దమయంతి యామహాశ్రమములోఁ బ్రవేశించెను. అట్లు ప్రవేశించి దమయంతి యచ్చటఁ గల్యాణియైన దేవవతి నివసించియుండుటఁ గాంచెను. వాడినమోముతోను, చంచలనయనములతోను నొప్పుచున్న యాదేవవతిని గాంచి—మాలిన్యదశయందలి కమలినివలెను న్నయీయామె యెవ్వరు చెపుమా యని దమయంతి యనుకొనఁజొచ్చెను. తరువాత దేవవతియు వైత్యనందిని యట్లు వచ్చుచుండుటఁ జూచి, యీయామె యెవ్వరు చెపుమా యని యోచించెను. అట్లు యోచించుచు దమయంతి నామె ప్రత్యుత్థాన మొనరించెను. తరువాత వారిరువురు నొకరియెడల నొకరు స్నేహభావములను జూపుచు నొకరి నొకరాలింగనములు గావించుకొని, తమతమ వృత్తాంతముల నొకరి కొకరు చెప్పికొనఁజొచ్చిరి. అవరాంగన లిరువురు నట్లు పరస్పరముఁ దమవృత్తాంతములను గూర్చిన వివిధకథలను బ్రసంగించుకొనుచుండిరి. ఈసమయమునందు మునిశ్రేష్ఠుఁడైన ఋతధ్వజుఁడు భగవంతుఁడైన శ్రీకంఠు నర్చించుకొనుట కచ్చటి కరుదెంచి యచ్చట శిలాఫలకపై లిఖింపఁబడియున్న యాశ్లోకాక్షరములను జూచెను. చూచి వానియర్థమును గ్రహించుచు ముహూర్తకాలము ధ్యానించి సకలవృత్తాంతమును దెలిసికొనియెను. తరువాత నాతఁడు దేవదేవునిపూజ సాంతము గావించుకొని యత్యంతవేగముతో నిక్ష్వాకుపతిని దర్శించుటకై యయోధ్య కరిగెను. అట్లేఁగి ఋతధ్వజుఁడు రాజును జూచి—రాజా!

నే నిప్పుడు నిన్నొకవిషయమునుగూర్చి ప్రశ్నించుచున్నాను. శ్రద్ధతో నాకర్ణింపుము. నీరాజ్యపుసరిహద్దులలోని యొకప్రదేశమునందు నొకపెద్దవానరము గుణగణమండితుఁడును సకలశాస్త్రజ్ఞుఁడునైన నా పుత్రుని బంధించి యుంచెను. ఆతని నాబంధనములనుండి విముక్తి నొందించుటకు నీపుత్రున కొక్కనికిఁ దక్క యితరు లెవ్వరికిని సమర్థత లేదు. ఈవిషయములో నేమిచేయఁదగునో తెలిసికొనుట నీకుమారునికే బాగుగాఁ దెలియును. అని ఋతధ్వజుఁడు చెప్పఁగా, నోకృశోదరీ, యరజా! నాతండ్రియైన యిక్ష్వాకుఁ డప్పుడు ఋషివాక్యములను విని ప్రియపుత్రుఁడైన శకునికి ఋషిపుత్రుని బంధవిమోచనముఁ జేయుమని యాజ్ఞాపించెను. పితాజ్ఞయైన తత్క్షణమే, మహాభుజుఁడైన నా సహోదరుఁడు సంతోషవదనుఁడై ఋషీశ్వరుఁ డగు ఋతధ్వజునితోఁ దద్వనమున కేఁగెను. అట్లేఁగి యాతఁ డాయత్యున్నతమైన వటవృక్షమును జూచెను. నిబిడములును దీర్ఘములు నగు నూడలచే దిక్ప్రాంతమును దెల్లఁబఱచుచున్న యామహావటమున కగ్రభాగమున ఋషిపుత్రుడు నిజజటాకలాపముచే నాబద్ధుఁడై యుండుట యాతనికగపడియెను. నాలుగుదిక్కుల నాతనిఁజుట్టుకొనియున్న లతాపాశములను నాతఁడు చూచెను. ఆతఁ డప్పుడు ధనుర్బాణములను నారిసంధించి క్షిప్రహస్తుఁడై బాణప్రయోగము చేసెను. పంచశతవర్షముల క్రిందటఁ గపివరునిచేఁ గల్పితములైన లతాపాశము లన్నియు నిక్ష్వాకుకుమారుని ధనుర్బాణాఘాతముచే నిప్పుడు విచ్ఛిన్నములై పోయెను. మహర్షియైన ఋతధ్వజుఁ డప్పుడు ద్రుతపదక్షేపమున నావటవృక్షము నధిరోహించెను. జాబాలి తనతండ్రి యట్లువచ్చుచుండుటఁ దాను బంధనములయం దుండియు నాదరముతోఁ దలవంచి తండ్రికి యథాయోగ్యముగా వందనము లొనరించెను. ఋతధ్వజుఁడును దనతనయుని

గాఢాలింగనము గావించుకొని, మస్తకమాఘ్రాణించి లతాబంధనము లను దొలఁగించుటకై ప్రయత్నించెను; కాని బంధనము లత్యంతదృఢము లగుటచే నవి యంతసులభముగా నున్మోచనము నొందినవిగావు. తరువాత బలవంతుఁడైన శకుని వేగముగా ధనువును వంచి బాణమును సంధించి జాబాలిజటాబంధనమును గత్తిరించుటకై వటవృక్షము నారోహించెను. కాని కపివరునిచేఁ గల్పితములైన యాదృఢబంధనము వెడలించుట కందువలనఁగూడ సాధ్యము గాకపోయెను. ఇక్ష్వాకుకుమారుఁడైన శకుని తన కది సాధ్యము గాకుండుటచే వెంటనే ఋషియైన ఋతధ్వజునితోఁగూడ వృక్షమునుండి క్రిందికి దిగిపోయెను. తరువాత నాతఁడు మరల ధనుర్బాణమును గైకొని యొకశరపంజరమును నిర్మించి రెండర్ధచంద్రబాణములచే వటవృక్షశాఖను సులభముగా మూఁడుముక్కలక్రింద ఖండించెను. ఆకొమ్మ యట్లు ఛేదింపఁబడఁగానే తపోధనుఁడైన జాబాలి శాఖాభారము తలపైఁ దాల్చి శరసోపానమార్గమున వృక్షమునుండి దిగియెను. ఇట్లు తనతనయుఁడు బంధవిముక్తుఁడు కాఁగానే ఋషియైన ఋతధ్వజుఁడును, ధనుర్ధరుఁడైన యిక్ష్వాకుఁడును, భారవహుఁడైన జాబాలిని వెంటఁ బెట్టుకొని, సూర్యనందినియైన యమునానది కభిముఖముగా బయలుదేఱి వెడలిరి.

## —♦ చిత్రాంగదావివాహము ♦—

దండకుఁడు చెప్పఁదొడంగెను—ఓబాలా! అప్పుడు యక్షసుతయు, నసురదుహితయుఁ గూడి మహాదేవుని, యోగిగణాగ్రగణ్యుఁడైన ఋతధ్వజుని దర్శించుకొనుటకు బయలుదేఱివచ్చిరి. వారట్లు వచ్చి, ఋతధ్వజుఁడు వెడలిపోవుటచే మహాదేవునిమోము వాడిపోయి యుండుటయు నాతనిపై నున్నపుష్పము లన్నియు విశుష్కములై

యుండుటయు, నాల్గుదిక్కులనుండియు నిర్మాల్యము క్రిందఁ బడిపోవు చుండుటయుఁ జూచిరి. తరువాత నావరవర్ణినీమణు లిరువురును, అది చూచి రాత్రింబవళ్లు యథావిధిగా మహాదేవునకు స్నానముఁజేయించుచు నర్చనఁగావించుచు నుండిరి. ఈవిధముగా వారచ్చట నున్న సమయమందు విఖ్యాతుఁడైన గాలవఋషీశ్వరుఁడు, అవ్యక్తుఁడైన శ్రీకంఠుని దర్శించుకొనుట కాయరణ్యమున కేతెంచెను. ఆతఁడప్పు డచ్చట నున్నకన్యల నిర్వుర వీక్షించి, వీ రెవ్వరికన్యలో యని యించుక భావించి తరువాత నాతఁడు నిర్మలయమునాజలములందు స్నానమొనరించి యచ్చటి కేతెంచి భగవానుఁడైన శ్రీకంఠు నర్చించెను. ఆసమయమునం దాకన్య లిరువురును మధురకంఠములతో గానముసేయఁ జొచ్చిరి. మహార్షియైన గాలవుఁ డాగానమాలించి, వీరు నిస్సందేహముగా గంధర్వకన్య లని స్థిరపఱచుకొనియెను. ఆతరువాత నాతఁడు దేవదేవుఁడైన యీశ్వరుని యథావిధిగాఁ బూజించి జపించుకొనియెను. అప్పు డాకన్య లిరువురు నాఋషి కభివందనము లొనరింపఁ నాతఁ డచ్చట సమాసీనుఁడై వారి నిట్లు ప్రశ్నించెను—మీ రిరువురును భగవానుఁడైన భవునియందు భక్తిగల్గియున్నారు. మఱియు మీరు కులాలంకారస్వరూపులు. అబలలారా! మీతల్లిదండ్రు లెవ్వరు"? అని యాతఁ డడుగఁగా నాప్రసన్నముఖులైన కన్యలిద్దఱును దమవృత్తాంతము నామునివరునికడ నివేదించిరి. తపస్వివరుఁడైన గాలవుఁడు వారివృత్తాంతమును విని వారిచేఁ బూజితుఁడై యారాత్రి యచ్చటఁ గడపి ప్రభాతమున లేచి గౌరీపతి నర్చించి మరల నాకన్యాద్వయముదగ్గఱ కేఁగి,—నేను సుప్రసిద్ధమైన పుష్కరారణ్యమున కేఁగుటకై ప్రయత్నించుచున్నాను. కావున మీరు నా కనుజ్ఞయొసంగుఁడు" అనియెను. అప్పు డాకన్య లాతనిఁ జూచి—"ఓ బ్రహ్మర్షి!

మీదర్శనము దుర్లభమైనది; అందఱును దానిని సులభముగాఁబొందఁ జాలరు. ఋషీశ్వరా! తా మిప్పు డింతప్రియత్నపూర్వకముగా నెందులకుఁ బుష్కరారణ్యమున కేఁగుచున్నారు?" అని యడిగిరి. గాలవుఁ డప్పుడు గంభీరభావముతో—"కార్తికమాసపూర్ణిమాతిథి పుష్కరారణ్యమునందుఁ బుణ్యప్రదమైనది." అని చెప్పెను. కన్యాద్వయ మాతనిఁ జూచి—"ఋషివర్యా! మీ రెచ్చటి కేఁగుచున్నారో, అచ్చటి కేమును రాఁగలము. మిమ్ముల విడివియుఁక మా కిక్కడ నుండుట కిచ్చలేదు" అని విన్నవించిరి. గాలవుఁడాకన్యలప్రార్థన కంగీకరించెను. వా రప్పుడు మహేశ్వరునకు వందనము లొనరించి గాలవ ఋషితోఁ బుష్కరారణ్యమున కేఁగిరి. అనంతర మచ్చటికి మఱియు ననేకసహస్రములుగా ఋషులును, జానపదులును, రాజఋషులు మొదలగువారందఱు నరుదెంచిరి. కాని ఋతధ్వజుఁ డొక్కఁడును వా ... మప్పుడు పుష్కరారణ్యమునకు రాలేదు. తరువాతఁ గా ... సమీపించెను. ఋషులును, నాభాగుఁడు నిక్ష్వాక ... హోభాగులైన రాజులును బుష ... గమునలో ... దిగుచుండిరి. అప్పుడు గాలవఋషియు ... బుష్కరజలముల లో స్నానార్థమై దిగియెను. ... డాజలములలో మునుఁగఁగానే జలమధ్యమునం దొ ... శయనించియుండుట యాతని కగపడియెను. అనేకమ ... మత్స్యమునకు సంప్రీతికరములగు నుపచారము లొనరిం ... అమత్స్య మప్పు డాకన్యలను జూచి యిట్లనియెను—మీ ... స్వేచ్ఛాచారిణు లై పోవుచున్నారు; ధర్మ మెట్టిదో మీ ... న్నారు. కాని నేనుమాత్రము దుస్సహమైన లోకాపవా ... నకయు సహింపఁజాలను."

ఇట్లు ప ... గా ... త్స్యకన్య లామత్స్యమును జూచి "నీ విట్లు

చూచుము. ఈతాపసుఁ డైనగాలవుఁడు కన్యకామణుల నిర్వురను వెంటఁబెట్టుకొని యథేచ్ఛముగాఁ జరించుచున్నాఁడు. ఈతఁడు ధర్మాత్ముఁడును, దపస్వియును. ఈతనికి లోకాపవాదభయము లేకున్నప్పుడు జలచారివైన నీ కెందులకు లోకాపవాదభీతి కలుగవలయును?" అని పలికిరి. మత్స్యము మత్స్యకన్యలను జూచి "ఈతపస్వి రాగాంధుఁడై యుండెను. అందులకే మోహము వచ్చి యీతని నాచ్ఛాదించెను. నిజముగా నీతనికి ధర్మము లోపించుటచే లోకాపవాదభీతియు లేకుండెను." అని పలికెను. గాలవుఁ డామత్స్యవాక్యములు విని ల[illegible]పోయెను. ఆతఁడు జలములలో నుండి మరలఁ బైకి రాఁజాలకపోయెను. ఆజలములయందు మగ్నుఁడైయే యుండెను. అప్పు[illegible] న్నలైన కన్య లిరువురును స్నానముల్లైనతరువాత నొడ్డునకు [illegible] గాల[illegible] దర్శనమునకై యెదురు చూచుచుండిరి. అనంతర[illegible] బుష్కరయాత్ర గావించుకొని తమతమ నెలవులకు [illegible] మును, ఋషిగణమును, దక్షిణజానపదగణమును, దా[illegible]చ్చటప[illegible]చ్చిరో, యచ్చటచ్చటికి వెడలిపోయిరి. విశ్వకర్మనందిని[illegible] నైన చిత్రాంగదమాత్రమేకాకినియై యచ్చట నాల్గు[illegible] కించుచు నిలిచియుండెను. అప్పు డాతీర్థక్షేత్ర మంతయు నొం[illegible] జనశూన్యమై యుండెను. కాని యాకన్యామణు లిరు[illegible] నైన గాలవునికొఱకుఁ బ్రతీక్షించుచుండిరి. గాలవుఁ [illegible]ను నుండి యావలికి రానేలేదు. ఆతఁ డాజలములలో [illegible] యుండెను.

అట్లుండఁగా గంధర్వనందినియైన [illegible] నొకకన్య యచ్చటి కరుదెంచెను. వేదవతి తండ్రిపేరు : [illegible] మె తల్లిపేరు ఘృతాచి. వేదవతి యప్పుడు పుష్కరస్నా[illegible] గాఁ జేసికొని యొడ్డు

నకు వచ్చి, యాకన్యక లిరువురను జూచి చిత్రాంగదను సమీపించి, మృదుమధురవాక్యములతో "మీరెవ్వరు? ఈవిజనస్థలములో నెందులకు వాసముచేయుచున్నారు?" అని యడిగెను. చిత్రాంగద యప్పు డామెమాటలు విని "ఓశుభాంగీ! నేను విశ్వకర్మపుత్రికను. నన్నుఁ జిత్రాంగద యందురు ఓశుభవతీ! నైమిశారణ్యవాసినియు, ధర్మజననియు, కాంచనాక్షి యను నామము గలదియుఁ, బుణ్యతోయము నైన సరస్వతీనదియందు స్నానముచేయుటకై వచ్చియుంటిని. అచ్చటకు వచ్చినప్పుడు విదర్భరాజైన సురథుఁడు నన్నుఁ జూచి మోహితుఁడై నాకడ కరుదెంచెను. అప్పుడు నాసఖులు నన్ను నిషేధించియును నే నాతని కాత్మసమర్పణము గావించితిని. అందుచే నాతండ్రి నన్ను శపించెను. ఆశాపముచేత సురథరాజుతో నాకుఁ జిరవిచ్ఛేదము సంభవించినది. ఓభద్రా! అందులకు నేను ప్రాణత్యాగము గావించుకొనబోఁగా గుహ్యకుఁ డొకఁ డరుదెంచి నన్నాకార్యమునుండి నివారించెను. అప్పుడు నేను భగవంతుఁడైన శ్రీకంఠుని దర్శించుకొఱకు గోదావరీతీరమున కేఁగితిని. తరువాత నచ్చటనుండి యీయుత్తరతీర్థమునకు వచ్చితిని. కాని యింతపర్యంతము, అనాప్రాణపతి యైన సురథుఁడు నాకన్నులకుఁ గాన్పింపలేదు. బాలా! నీ వెవరవు? ఏకారణముచే నిచ్చటి కిప్పు డరుదెంచితివి? పుష్కరయును మతిత మన్యోనుగదా! మఱి నీ విచటి కిప్పు డెందు ఓభామినీ! నాకు నీవృత్తాంత మంతయు నిజముగా అని పలికెను. అప్పుడు వేదవతి యిట్లనియెను.

ఓకృశోదరీ! నేను మందభాగ్యురాలను. [illegible] ఫల [illegible] మతీనమైపోయినను ఇచ్చటి కెందులకు వచ్చితినో [illegible] నీకడ వివరించెద వినుము. [illegible]

ములు నేను జనించితిని. నాపేరు వేదవతి. ఓసఖీ! ఒకనాఁడు నేను వన విహారముచేయుచుండఁగా నొకక్రోఁతి నన్నుఁ జూచెను. చూచి యది నావద్దకు వచ్చి నాతో నిట్లనియెను. ఓబాలా! ఓ దేవవతీ! నీ వెచ్చటికిఁ బోయి యుంటివి? నిన్ను భూతలములోని యాశ్రమమునందుండి యెవ్వ రీమేరుపర్వతమునకుఁ దీసికొనివచ్చిరి? అని యడిగెను. నేనప్పు డాకపిని జూచి "ఓకపీ! నేను దేవవతిని గాను. దేవవతీకన్య మేరుపర్వతమునందే యున్నది." అని చెప్పితిని. కాని యావానర మప్పుడు నాకెదురుగాఁ బరుగెత్తుకొని రాఁజొచ్చెను. నే నప్పు డాకస్మికముగా నొకబంధుజీవవృక్షము నాశ్రయించితిని. కాని వానర మావృక్షము నాక్రమించి పదాఘాతములచే దానిని విఱుగఁదన్నెను. నే నప్పు డావృక్షమునందలి పెద్దకొమ్మను బట్టుకొనియుంటిని. కాని తత్క్షణమే యాకపి యావృక్షమును సమగ్రముగా సాగరములోఁ బడవేసెను. అప్పు డావృక్షముతోఁగూడ నేనును వ్యాకులచిత్తనై సాగరములోఁ బడిపోయితిని. అప్పుడు చరాచరములైన సమస్తప్రాణులును వ్యోమమంధమున నుండి యావృక్షపతనవ్యాపార మంతయుఁ జూచి ఆవృక్షముతో నేనును సాగరమునఁ బడుచుండుట చూచి యత్యంతము హాహాకారములు చేయఁదొడంగెను. సిద్ధగంధర్వగణము లప్పుడు "అయ్యో! ఎంతకష్ట" మని విలపించిరి. బ్రహ్మ యప్పుడు స్వయముగా "వేదవతి మహాత్ముఁడైన యింద్రద్యుమ్నునకుఁ బట్టమహిషి కాఁగలదు. వీర్యశాలియైన యింద్రద్యుమ్నుఁడు మనుపుత్త్రుఁడై జన్మించి వేనవేలు యజ్ఞములు లోనరింపఁగలఁడు" అనిపలికెను. సిద్ధగంధర్వగణములతో నట్లు బ్రహ్మచెప్పినయామధురవాక్యములనువిని నేనప్పుడుమూర్ఛితురాలనైతిని. అప్పు డావృక్షము నెవ్వరు సహస్రఖండములు గావించిరో, నే నది యేమియు నెఱుంగను. తరువాతఁ బ్రబలమైన వాయువేగముచే నీ నీప్రదేశమునకుఁ దేఁబడితిని.

ఓశుభవతీ ! నన్నిప్పుడు మొట్టమొదట నీవే చూచితివి. అయి నదేమో కానిమ్ము, లెమ్ము. ఇప్పుడు మన మాపుష్కరమున నుత్తర తటమునందున్న యాకన్యాద్వయమునొద్ద కేఁగి చూతము." అని సుందరాంగియైన గంధర్వనందిని చెప్పఁగా, వరాంగియైన చిత్రాంగద యాయిరువురుకన్యలవృత్తాంతమును వినుటకుఁ గుతూహలము గలదియై యామెతోఁగూడ బయలుదేఱి వెడలెను. వారట్లేఁగి యాకన్యల నడుగఁగా నాకన్యలు తమవృత్తాంతము నాద్యంతముగా వారి కెఱింగించిరి. అనంతర మానలువ్వురుకన్యలును గూడి సప్తగోదావరీతీర్థమున కేఁగి హాటకేశ్వరు నర్చించి తత్తీరమునందు వసించుచుండిరి. ఇఁక నిక్కడ శకుని, జాబాలి, ఋతధ్వజుఁడును గూడి, వారిని వెదకుచు బహుసంవత్సరములు గడపిరి. కాలక్రమమున జాబాలి యవస్థాంతరమును బొందినవాఁడై నిర్విణ్ణచిత్తమునఁ దండ్రితోఁగూడ శాకలరాజ్యమున కేఁగెను. మనుపుత్రుఁడును శ్రీమంతుఁడు నగు నింద్రద్యుమ్నుఁ డచ్చట వాసముసేయుచుండెను. అతఁడు వారిరాకను దెలియఁగలిగినవాఁడై యర్ఘ్యపాద్యాదులుగైకొనివచ్చిజాబాలిని,ఋతధ్వజుని, భ్రాతృపుత్రుఁడును ధీమంతుఁడు నగు శకునిని యథావిధిగాఁ బూజించెను. తరువాత ఋతధ్వజుఁ డింద్రద్యుమ్నునిఁ జూచి—"రాజా! నాబిడ్డయగు దమయంతి యనుకన్య నెచ్చటనో గోల్పోయియుంటిని. ఆమెను వెదకుటకొఱకు మే మందఱమును పృథివీపర్యటనము సేయుచున్నాము. అందుచే తెమ్మ నీవును మాకీకార్యమునందు సాహాయ్యమొనరింపవలయును." అని పలికెను. ఇంద్రద్యుమ్నుఁ డప్పు డాతనిఁ జూచి—"బ్రాహ్మణోత్తమా! నేనుగూడ నొకస్త్రీరత్నముకొఱకు వెదకుచున్నాను. నా కామెవృత్తాంత మెవ్వ రెఱింగింతురో! నే నామెను వెదకుచు బహుధా శ్రమపడుచున్నాను. ఆకాశమునందుఁ

డి శైలసన్నిభమగు నొకమహావృక్షము పడుచున్నసమయమున నేను సిద్ధులపలుకులు విని శరసమూహముచే నామహావృక్షమును సహస్రఖండములు గావించితిని. మఱియునాహస్తలాఘవమును జూపి యావరవర్ణిని నావృక్షశాఖనుండి సంపూర్ణముగా విడఁదీసితిని. కాని యావరాంగన యెక్కడ నున్నదో, నేనిప్పుడు తెలిసికొనఁజాలకున్నాను. అందుచే నేనింకొకమాఱామెను వెదకుటకై బయలుదేఱవలయును.” అని పలికెను.

రాజైనయింద్రద్యుమ్నుఁ డిట్లు చెప్పి శీఘ్రముగ లేచి యాబ్రాహ్మణు లిరువురకును, దంభాత్మపుత్రునకును వేఱువేఱుగా రథముల నొసంగెను. తరువాత వారందఱును రథముల నధిరోహించి భూతలమం దంతటను వెదకఁజొచ్చిరి. వారట్లు తిరుగుచు మార్గమధ్యమున బదరికాశ్రమమునకు వచ్చి యచ్చట నొకతపోనిధిని దర్శించిరి. ఆతాపసుఁడు తపస్సుచేఁ గృశించిన శరీరముగలవాఁడును, దైన్యగ్రస్తుఁడునై యుండెను. అతనిమస్తకమునందలి జటాజాలము మలపంకిలమై యుండెను. అతఁడు యౌవనోచితమగు శరీరము గలిగియుండెను; అతఁడు మాటిమాటికిని దీర్ఘనిశ్వాసములు విడుచుచుండెను. మహాభుజుఁడైన యింద్రద్యుమ్నుఁ డప్పు డాతని సమీపించి “ఓతపస్వివరా! నీవు యౌవనకాలములో నిట్లు కఠోరతప మాచరించుచుంటి వెందులకు? నీయభిప్రాయ మేమి? మా కెఱింగింపు” మనియెను. తాపసుఁడప్పుడు—“నేను శోకార్తుఁడనై యత్యంతదుఃఖావస్థ నొంది తపము చేయుచున్నాను. సుహృద్భావముతో నాపరిచయమును గోరుచున్న మీ రెవ్వరు?” అని యడిగెను. రాజైన యింద్రద్యుమ్నుఁ డంతట—“ఓతపస్వీ! నేను శాకలపురరాజును, బలశాలిని; మనువు నాజనకుఁడు, ఇక్ష్వాకుఁడు నాభ్రాత.” అని చెప్పఁగాఁ దాపసుఁ డు

ప్పుడు తనపూర్వవృత్తాంతమును జెప్పెను. రాజ్ఞియైన యింద్రద్యుమ్నుఁ డది యంతయు విని యాతపసి కిట్లనియెను— "దుఃఖభారముచే దేహత్యాగము గావింపవలదు. నీవు నాభ్రాతృపుత్రుఁడవు. రమ్ము. మన మందఱమును గూడి యాతనవ్వెంగిని వెదకుదము" అని చెప్పుచు నాతాపసవేషియైన రాజునాలింగనము గావించుకొని యింద్రద్యుమ్నుఁ డాతని నాప్యాయితునిఁ జేసి రథము నెక్కించుకొని వెంటనే జాబాలి ఋతధ్వజులకు సర్వవృత్తాంతము నివేదించెను.

అప్పుడు ఋతధ్వజుఁడును జాబాలియుఁ దాపసరాజును జూచిరి. ఋతధ్వజుఁడు తాపసరాజున కిట్లనియెను. రాజా! రమ్ము, రమ్ము, నేను నీకుఁ బ్రియకార్యము నెఱింగించెదను. నైమిశక్షేత్రమునందు నీవు చూచియున్న యాచిత్రాంగదను నేను సప్తగోదావరీతీరమునందుండి వచ్చితిని. అందుచే మన మచ్చటికిఁ బోవుదము రమ్ము. అచ్చటికి మఱియు మువ్వురు కన్యలు రాఁగలరు. అని ఋతధ్వజుఁడు రాజు నూఱడించి శకునీంద్రద్యుమ్న, జాబాలులతో రథారోహణము గావించి యాకన్యాచతుష్టయమున్న సప్తగోదావరీతీరమునకుఁ బయనమయ్యెను. ఈసమయమున ఘృతాచి శోకగ్రస్తయై తనపుత్రికను వెదకికొనుచు నుదయాచలమునఁ దిరుగుచుండెను. అప్పు డామె కాకపి కనఁబడియెను. ఘృతాచి యాకపిని జూచి "ఓకపీ! నీవు నిజము చెప్పుము చూతము! నీవు నాబిడ్డ నెచ్చటను జూడలేదా?" అని యడిగెను. కపియు ఘృతాచిని జూచి యిట్లనియెను. "నేను నీబిడ్డను జూచి మృగపక్షిసమాకులమైన కాళిందీరమ్యతీరమునందలి శ్రీకంఠాశ్రమసమీప భాగమున నామె నుంచివచ్చితిని. నిజమైన యీవృత్తాంతము నిప్పుడు నీకుఁ జెప్పితిని." అని పలుకఁగా, ఘృతాచి వానరునిఁ జూచి "నాబిడ్డ పేరు వేదవతి; ఆమె పేరు దేవవతి గాదు. అది యటుండనిమ్ము,

రమ్ము, మన మచ్చటి కేఁగుదము.” అని పలికెను. వానరుఁ డప్పుడు ఘృతాచిమాటకు సమ్మతించి యామెవెనుకనే సత్వరముగా నడవఁజొచ్చెను. వారిద్దఱు నట్లు కౌశికీనదివంకకు బయలుదేఱిరి. తరువాత నా మువ్వురురాజర్షులును, సపుత్రికుఁడగు ఋతధ్వజుఁడును రథపంచకము నధిరోహించి కౌశికీతీరమున కేతెంచిరి. అప్పుడు వారు రథములు డిగి స్నానార్థము నదీజలములలోఁ బ్రవేశించిరి. తరువాత ఘృతాచియు నాపవిత్రస్రోతస్వతీసలిలములందు స్నానముచేయఁగోరి యచ్చటి కేతెంచెను. కపియు ఘృతాచిననుసరించియే యుండెను. అప్పుడు జాబాలి వారిని జూచుట తటస్థించెను. జాబాలి కపినిజూడఁగానే తండ్రిని దక్కినరాజర్షులను బిలిచి వారితో నిట్లనియెను. “ఇదిగో, ఇదియే యాతేజశ్శాలియైనవానరము, ఇది మరల నిచ్చటకు వచ్చెను! ఈవానరమే పూర్వము నన్ను వటవృక్షమునకు జటాపాశములతో బంధించెను” అని చెప్పెను. జాబాలిమాటలువిని శకునిసశరశరాసనమును వంచుచు “ఓబ్రాహ్మణోత్తమా! నా కనుజ్ఞనొసంగుము. ఇప్పుడే యీ వానరమును శరప్రహారముచే నిహతమొనరించెదను.” అనియెను. శకుని యిట్లనఁగానే సర్వభూతహితైషియు, మహర్షియు నగు ఋతధ్వజుఁ డప్పుడు శకునిని జూచి యుదారవాక్యములతో నిట్లనియెను. “ఓ తాతా, నృపనందనా! ప్రాణికోటికిఁ బూర్వాతికర్మవశముననే వధబంధనాదులు సంఘటిల్లుచుండును; కనుక నెవ్వరిని వధించుట గాని, బంధించుట గాని యెవ్వరికిని గర్తవ్యము గాదు.” అని మహర్షి పలుకఁగా శకుని యాతనిఁ జూచి “ఓబ్రహ్మజ్ఞా! అయినచో నే నేమి చేయవలెనో యనుజ్ఞ నొసంగుఁడు.” అని యడిగెను. శకునిపలుకులు విని ఋతధ్వజుఁ డప్పుడు వానరపతితో నిట్లనియెను. “నీవు నాపుత్రునిజటలతో వటవృక్షమునకు బంధించితివి. ఎంతప్రయత్నించియు నెవ్వరు నా

బంధనముల నెడలింపఁజాలరైరి. తరువాత నీనరేంద్రుని శరప్రహారముచే నీవృక్షశాఖ మూఁడుముక్కలుగా ఖండితమైనది. ఇదిగో, ఈ నాపుత్రుఁడు నేఁటివఱకు నీవృక్షశాఖ నిట్లు తలపై మోయుచున్నాఁడు. ఇప్పుడు నీవే యీబంధనము నెడలింపవలయును. అందులకు మఱియెవ్వరును సమర్థులుగారు; దీని నిట్లు మోయుచు నీతఁడు పదివేలవర్షములు గడపెను." అని ఋషిపలుకఁగాఁ గపీంద్రుఁడు విని మెల్లమెల్లఁగా జాబాలికడ కేఁగి యాతనిజటాభారము నొక్కక్షణకాలములో నెడలించెను. అది చూచి మునివరుఁడైన ఋతధ్వజుఁడు సంప్రీతచిత్తుఁడై కపివరునకు వర మొసఁగఁదలఁచి "ఓకపీంద్రా! నీ కభీష్టమైన వరము నడుగు" మని పలికెను. కపిజన్మ మెత్తినమహాతేజుఁడైన విశ్వకర్మ ఋతధ్వజుని యీప్రసాదపూర్ణము లగువాక్యములు విని యిట్లు వర మడిగెను. "ఓబ్రాహ్మణోత్తమా! నీవు నాకు వరదాన మొసంగ నిచ్చగించితివో నాపైఁ బడియున్న భీషణశాపమును బ్రత్యాహృతముఁ గావింపుము. చిత్రాంగద నాకన్య యనియు, నేను దపోధనుఁడనగు విశ్వకర్మ ననియు నీశాపముచేతనే నాకీవానరజన్మము ప్రాప్తించిన దనియు నే నీవివిధపాపాచరణములను గపిచాపల్యదోషముచేతనే చేయుచున్నా ననియు, నా కిప్పుడు సకలదోషక్షయకాలము ప్రాప్తించిన దనియు నీవు తప్పక యెఱుంగుదువు." అని కపి పలుకఁగా ఋతధ్వజుఁడు "ఓకపీ! నీవు ఘృతాచిగర్భమునందు మహాబలుఁడైన పుత్రుని నెప్పుడు గాంచెదవో, అప్పుడు నీకు శాపావసాన మగును." అని చెప్పెను. ఋషి యిట్లు పలుకఁగానే కపి సంతుష్టుఁడై సత్వరముగా మహానదిలో స్నానముచేయుట కేఁగెను. యాత్రికు లందఱును గ్రమముగా స్నానము లొనరించుకొని తమతమతావులకు వెడలిరి. ఘృతాచియు స్నానము చేసికొని స్వర్గమునకు వెడలిపోయెను.

ఆకపివరుఁడును ఘృతాచివెనువెంటఁ బోవుచు నామెరూపసంపద నరయుచు సమ్మోదచిత్తుఁ డగుచుండెను. ఘృతాచియు నాబలశాలియైన కపికుంజరుఁడు విశ్వకర్మ యని తెలిసికొని యాతని వరించెను. తరువాతఁ గపీంద్రుఁడు తన్వంగియైన యాఘృతాచితోఁగూడ ప్రసిద్ధమగు కోలాహలపర్వతముపై వాసముచేసెను. అక్కడనుండి వారు కొంతకాలమునకు వింధ్యాద్రి కరుదెంచి యచ్చట వసింపఁజొచ్చిరి. ఇఁక నిచ్చట నానరవరులు కౌశికీజలములలో స్నానము లాచరించుకొని యలసటయుఁ బిపాసయుఁ దీర్చుకొనుటకు మధ్యాహ్నకాలమున విశ్రాంతిమార్గము మరల రథముల నధిరోహించి సప్తగోదావరీతీరమున కరుదెంచిరి. పిమ్మట వారు రథములనుండి దిగి జలములలోఁ జొచ్చిరి. వారిసారథులును స్నానములుచేసి జలములం గ్రోలి యశ్వములకును స్నానములు గావించిరి. తరువాత వా రొకముహూర్తకాలము రమణీయమగు పచ్చికబయలునం దశ్వములను విహారార్థము విడిచిపెట్టిరి. తరువాత వాహనములతో నారోహకు లందఱుఁ సంతృప్తులై ప్రసిద్ధదేవాలయమున కభిముఖులై బయలుదేఱిరి. ఆదేవాలయమునం దున్న వరాంగన లప్పుడు దూరమునందుండి గుఱ్ఱపుడెక్కలచప్పుడులు విని « ఇది యేమి చెప్పుమా" యనుకొనుచు హాటకేశ్వరునిసన్నిధికి వెడలిపోయిరి. తరువాత వా రచ్చటిచంద్రశాల నెక్కి చకితనేత్రములతో నలుదెసల నవలోకింపఁజొచ్చిరి. కొందఱు నరోత్తములు తీర్థసలిలములలో స్నానములుచేసి వచ్చుచున్న ట్లప్పుడు వారు చూచిరి. ఆవచ్చుచున్నవారిలో జటాపటలధారియైయున్న సుశిఖునిఁ జూచి చిత్రాంగద మందహాసవదనయుఁ బులకాంకురితశరీరయు నై తనతోడిచెలులతో నిట్లు పలికెను.

« చెలులారా ! మనవంకకు వచ్చుచున్న యానీలనీరదగాత్రుఁ

డు, నాజానుబాహుండు, ప్రియదర్శనుండు నగు యువపురుషునిఁ జూడుఁడు. ఆస్వప్నమందునే నేను మొట్టమొదటఁ బతిగా వరించితిని. మరియుఁ జూడుఁడు. ఆసువర్ణవర్ణుఁడును జటాపటలమండితుండును నైన ప్రవీణపురుషుఁడు నిశ్చయముగాఁ దపస్వివరుఁడగు ఋతధ్వజుఁడే. అందుల కించుకయు సందేహములేదు." అని చిత్రాంగద పలుకఁగాఁ దరువాత దమయంతి హర్షముతోఁ దనసఖులను జూచి "సఖులారా! చూడుఁడు. ఆవచ్చువారిలో నాపురుషశ్రేష్ఠుఁడు ఋతధ్వజనందనుఁడు. అది నిశ్చయము." అనియెను. ఇక్ష్వాకకన్య లొకరితో నొకరు ముచ్చటించుకొనుచు నప్పుడందఱును జంద్రశాలను డిగి శంభుసన్నిధి కరుదెంచి సుమధురకంఠస్వరములతో సంగీతములు పాడఁ దొడంగిరి. శంభో, శర్వా, త్రినేత్రా మొదలగు నామములతో వారు సుగానముచేయ ముగింపనంతలో ఋషిగణమును, రాజగణమును, త్రిలోకవిధాతయుఁ ద్ర్యంబకుఁడు నైన హాటకేశ్వరుని దర్శించుకొంట కచ్చటి కరుదెంచిరి. తాము రథములనుండి దిగుటకుఁ బూర్వమే సుస్నాతలైన యీవరాంగనలు శంభుసన్నిధానమున నుండి సుమధురసంగీతములు పాడుచుండుట వారు చూచిరి. తరువాత సురథుఁ డావిశ్వకర్మనందినియుఁ, దనప్రణయినియు నైన చిత్రాంగద నీక్షించి సంప్రీతచిత్తుఁడును, బ్రహృష్టపులకితగాత్రుఁడు నయ్యెను. ఋషివరుఁడైన ఋతధ్వజుఁడును, దన్వంగియైన యాచిత్రాంగదను జూచుచు యోగసామర్థ్యముచే సర్వవృత్తాంతమును దెలిసికొని లోలోన నానందింపఁ జొచ్చెను. ఆతరువాత నందఱును గూడి స్తవపారపురస్సరముగా హాటకేశ్వరునికిఁ గ్రమపూజ లొనరింపఁజొచ్చిరి. ఇక్కడ జిత్రాంగద ఋతధ్వజుఁడు మొదలగువారిని జూచి సహృదయులగు తననెచ్చెలులతో వారి కెదురేగి వారి కభివాదము గావించెను. అప్పు డాతా

పనుఁ డగుఋతధ్వజపుత్రుఁడును రాజగణముతో వారి నభినందించి హృష్టచిత్తుఁడై యచ్చటఁ బ్రవేశించెను. ఓసుందరీ! ఆసమయమందు ఘృతాచితోఁగూడ నాకపివరుఁడు గోదావరీతీర్థములో స్నానముచేసి కొని హాటకేశ్వరుని దర్శించుకోరికతో నచ్చటి కరుదెంచెను. వరవర్ణినియైన చిత్రాంగద, తనతల్లియుఁ బ్రియదర్శనియు నైన ఘృతాచిని జూచి యాహ్లాదితురాలయ్యెను. అప్పుడు ఘృతాచిస్నేహస్వరముతోఁ దనతనయను గౌఁగిలించుకొని కన్ని రొలికించుచు మరల మరల నామె మస్తకము నాఘ్రాణింపఁజొచ్చెను. అనంతరము శ్రీమంతుఁడైన ఋతధ్వజుఁ డాకపిని జూచి ‹‹ నీవు మహాత్ముఁడైన గుహ్యకునిఁ దోడ్కొనివచ్చుటకు వేగముగా నంజనాచలమున కేఁగవలయును. పాతాళము నుండి కంబరమాలిని, స్వర్గమునుండి గంధర్వరాజైన పర్జన్యుని వేగముగా నిచ్చటికి వెంటఁబెట్టుకొని రావలయును.'' అని పలికెను. ముని యిట్లు చెప్పినతరువాత దేవవతి కపిని జూచి ‹‹ కపివరా! గాలవముని నిగూడ నీ విచ్చటికిఁ దోడ్కొనిరావలయును.'' అని పలికెను. అమితపరాక్రముఁడైన కపివరుఁ డాదేవవతిపలుకులు ముగియగానే వెంటనే వారందఱిని దోడితెచ్చుటకై బయలుదేఱెను. అతఁ డప్పు డంజనుని బిలిచి తరువాత నమరపర్వతమున కేఁగి యచ్చటఁ బర్జన్యుని నామంత్రణము గావించి, జవాతిశయముతో సప్తగోదావరీతీర్థమునకును పాతాళమునకు నేఁగి యచ్చటఁ గంబరమాలి నాహ్వానముచేసి పాతాళమునుండి యీవలకు వచ్చి భూమియందలి నానాస్థానములఁ బర్యటన మొనరింపఁజొచ్చెను. తరువాత మాహిష్మతీనగరమున కేఁగి తపోనిధియైన గాలవుని దర్శించి కపివరుఁ డాతనిసన్నిధి కేఁగి యాతని వెంటఁబెట్టుకొని సప్తగోదావరితీర్థమున కరుదెంచి యథావిధిగా స్నాన మొనరించుకొని హాటకేశ్వరమునకు వచ్చెను. ఇచ్చటికి వచ్చి దమయంతియు దేవవతిని

జూచి ప్రత్యుత్థానపూర్వకముగా గాలవున కభివాదనము లొనరించె ను. అచ్చటి సరవుతులుగూడ నాతపోధను నర్చించి యతులానందము తో యథాసుఖులై కూరుచుండిరి. వా రందఱు నట్లు గూరుచుండి యుండఁగా, గపివరునిచేఁ బిలువఁబడిన మహానుభావులగు, యక్ష, గంధర్వ, దానవు లచ్చటి కరుదెంచిరి. వా రట్లరుదెంచుట చూచి యా విశాలనయనలైన వారితనయలు స్నేహాసిక్తనయనలై తమతమతండ్రుల నాలింగనములు గావించికొనిరి. దమయంతి మొదలగు వరవర్ణినులు తమతమతండ్రులను గౌఁగిలించికొని యానందిత లగుచుండుటఁ గాంచి విశ్వకర్మనందినియైన చిత్రాంగద నయనద్వయము బాష్పజల పరిపూరిత మయ్యెను. సత్యవదియైన ఋతధ్వజుఁ డప్పు డామెను జూచి “వత్సా! నీవు దుఃఖము నొందవలదు. ఈ వానరశ్రేష్ఠుఁడే నీతండ్రి.” అని పలికెను. ఋతధ్వజునిపలుకు లాలకింపఁగానే లజ్జచేఁ జిత్రాంగదకుఁ జైతన్యము లోపించిపోయెను. ఆమె యప్పుడు తనలో “అహో! విశ్వకర్మ వానర మెట్లయ్యెను? నిజముగా నే నాతనికిఁ బుత్రినై జన్మించితిని. కాకున్న నిట్టిసంఘటన మెట్లగును? ఏమైన నగుఁగాక. ఇప్పుడే నేను దేహత్యాగము గావించుకొనుట కర్తవ్యము” అని భావించుకొని, తరువాత ఋతధ్వజునిఁ జూచి “బ్రాహ్మణోత్తమా! పాపవశముచే నాకుఁ జైతన్యము శూన్యమైపోయెను. నీవు నన్ను రక్షింపుము. నేను పితృఘాతిని నై యుంటిని. నిశ్చయముగా నాకు దేహపరిత్యాగమున కనుమతి యొసంగుము.” అని ప్రార్థించెను. అనంతరము మునివరుఁ డామె నూఱడించి “వత్సా! ఇప్పుడు నీవు విషాదము నొందవలదు. కాఁదలఁచిన కార్యములు కాకమానవు, నీవు దేహత్యాగ మొనరింప నెంతమాత్రమును దలంపకుము. నీతండ్రి మరల సురశిల్పియై విరాజిల్లగలఁడు. ఘృతాచి గర్భమునందు సంతా

సము గలుగఁగానే నీతండ్రికి నిజరూపము ప్రాప్తించును, సందేహము లేదు." అని భావితాత్ముఁడైన ఋషివరుఁడు పలుకఁగానే ఘృతాచి చిత్రాంగదను సమీపించి యిట్లు పలికెను.

"పుత్రీ! నీవు శోకింపకుము. పదిమాసములలోనే నాగర్భమందుఁ బితృతుల్యుఁడైన యొకపుత్రుఁ డుత్పన్నము గాఁగలఁడు, సందేహ మెంతమాత్రమును లేదు." అని ఘృతాచి పలుకఁగా చిత్రాంగద యత్యంతసంతోషభరితాంతరంగయై యప్పుడు తనవివాహమునుగూర్చియుఁ, దండ్రిశరీరమునుగూర్చియుఁ, బ్రతీక్షించుచుండెను. చిత్రాంగదనెచ్చెలులైన యాకన్యలును నామెకోరిక ననుసరించి యామెవివాహకాలము నిరీక్షించుచు నచ్చటనే యుండిరి. తరువాత దశమాసములు గడచుటయు నాసన్నప్రసవయైన ఘృతాచి గోదావరీతీరమునందొకపుత్రునిఁ గాంచెను. ఆతనిపేరు నలుఁడు. సంజాతమగుట వెంటనే విశ్వకర్మకుఁ గపిశరీర మంతర్హితమయ్యెను. అప్పుడాతఁడు తనదుహితయైన చిత్రాంగద నాదరముతో నాలింగన మొనరించుకొని, సురకిన్నరులను సురపతియైన యింద్రుని స్మరించుకొనియెను. వెంటనే సురకిన్నరపరివృతుఁడై యింద్రుఁడు హాటకతీర్థమున కేతెంచెను. దేవతలును, గంధర్వులు, నప్సరసలును రాఁగానే రాజైన యింద్రద్యుమ్నుఁడు ఋతధ్వజునిఁ జూచి "బ్రహ్మర్షిమూర్తీ! కందరమాలి నందినిని జాబాలిని పాణిగ్రహణము గావింపవలయును. ఆదైత్యనందిని నీసముఖమునందే యాతనిని పాణిగ్రహణము చేయుఁగాక దమయంతిని రూపవంతుఁ డగు శకుని పరిణయమగుఁగాక. యథావిధిగా నగ్నియందాహుతిప్రదానములు గావించి యీవేదవతికి నేను పతి నయ్యెదను." అని పలికెను. ఋషియైన ఋతధ్వజుఁడు మనుపుత్రుఁడైన యింద్రద్యుమ్నుని పలుకులను సమ్మతించెను. అప్పుడు గాలవాదిఋషిపుంగవులు సంతుష్ట

చేస్తుతై హోమోపకరణములు మున్నగునవి సంగ్రహించుకొని యథా
శాస్త్రముగా నగ్నియం దాహుతులు గావించి యుక్తవివాహవిధు
లు పూర్తిగావించిరి. గంధర్వబృందము అప్పుడు గానమొనరింపఁజొ
చ్చిరి. అప్సరోగణములు నృత్యములు చేయుచుండిరి. మొట్టమొదట
చైత్యనందినిని జాబాలి పరిణయమయ్యెను. తరువాత నింద్రద్యుమ్న
నికి వేదవతితో విధివిహితముగా వివాహము జరిగెను. అనంతరము
శకుని యక్షకన్యను పాణిగ్రహణ మొనరించెను. ఓకల్యాణీ! చిట్టచి
వర సురథునితోఁ జిత్రాంగదయుద్వాహము జరిగెను.

ఓకృశోదరీ! ఈవిధముగా నక్కడ వారందరకును పెండ్లిండ్లా
యెను. వివాహములు సాంగములుగాఁగానే ఋతధ్వజుఁ డింద్రాదిదే
వతలను, దానవులను జూచి "మీరెల్లరు నీసప్తగోదావరతీర్థమునందు
సదా నివాస మొనరింపుచుండవలయును. విశేషించి యీ పవిత్రమైన
వైశాఖమాసమునందుఁ దప్పక నివసింపవలయును." అని పలికెను.
దేవతలందఱును "తథాస్తు" అని పలికి సంతుష్టులై స్వర్గధామమున
కేఁగిరి. అప్పుడు మును లానందముతో సపుత్రుఁడైన ఋతధ్వజుని వెం
టఁబెట్టుకొని తమతమ నెలవులకు వెడలిరి. నరపతులును దమతమపత్రి
ణయనులతోఁగూడి నిజనగరముల కేఁగి హృష్టచిత్తులై వివిధసుఖభోగ
ములతో నిరామయులై వాసముచేయుచుండిరి. "ఓకల్యాణీ! ఇదియే
చిత్రాంగదపూర్వవృత్తాంతము. కావున నోపద్మపలాశలోచనా! లల
నారత్నమా! నీవు నన్ను మన్నింపుము." అని పలికినందునఁ దగు
దండనము, భూదేవనందినియుఁ గురంగాక్షియు నగు నరజను విశేష
ముగా లాలింపఁజొచ్చెను. అప్పుడు పడియు నాతనికి మృదువాక్యము
లతోఁ బ్రత్యుత్తర మీయఁజొచ్చెను.

## —♦ దండభస్మీకరణము. ♦—

అరజ యిట్లు చెప్పఁ దొడఁగెను. "రాజా! నీకు నేనింక విస్తారముగాఁ జెప్పఁజాలను. నేనాత్మదానము గావించుకొనుట కించుకయు సమర్థురాలను గాను; నే నాత్మదానము నొపంగకున్నచో నాతండ్రి శాపమునుండి నీవును నేనును గూడ రక్షింపఁబడఁగలము." అని యామె చెప్పెనుగాని, దండకరాజునకు దుర్బుద్ధివశమున నంతఃకరణము కామమోహితమైపోయెను; భార్గవనందిని యిట్లు తర్కవితర్కములు నేయుట ప్రారంభింపఁగానే, యాతఁ డిఁకనిలువఁజాలక యామెను బలాత్కారముగాఁ బట్టుకొనియెను. మదాంధుఁడైన రాజప్పు డరజచరిత్రమును గళంకితమును గావించి భయముచే నాశ్రమమునుండి బయలుదేఱి తననగరమునకు వెడలిపోయెను. ఆతనవ్వంగిన్నమైన యరజ యప్పుడు చిన్నమై యాశ్రమబహిర్భాగమునం దధోముఖియై పడియుండి తండ్రి దలంచుకొనుచు మహాగ్రహగ్రస్తమైన శశిప్రియయిని రోహిణివలె మాటిమాటికి రోదనముచేయుచుండెను. అనంతరము చాలకాలమునకు యజ్ఞక్రియలు సాంగములైనతరువాత, శుక్రుఁడు తనయాశ్రమమున కరుదెంచెను. అతఁ డట్లు రాఁగానే తనకూతురైన యరజ రజస్వలావస్థయందు సంధ్యారాగరంజితమై యాకాశగతమైన మేఘరేఖవలె నాశ్రమప్రాంతమునం దుండుట కనఁబడియెను. అట్లామెను జూచి శుక్రుఁడు "బిడ్డా! ని న్నిట్లు ధర్షితను జేసినవాఁ డెవ్వఁడు? ఎవ్వఁ డిప్పుడు రోషసంయుతమైన యాశీవిషముతో నాటలాడుట కభిలషించెను? ఆదుర్మతియైన పాపాత్ముఁ డేదిక్కున కేఁగెను? నేనును వానిని వెదకుట కిప్పు డెటుపోవలయును? ఏపాపాత్ముఁడు నీయట్టిశుద్ధచారిణిని నేఁడు ధర్షితను గావించెను?" అని యడిగెను. అరజ తండ్రిని జూచి యత్యంతకంపితురాలు గాఁవొచ్చెను. మెల్లమెల్లఁగా

నామె లజ్జాభావముతోఁ దండ్రి కిట్లు చెప్పెను. నే నెంతగా నివారించుచున్నను మీశిష్యుఁడైన దండుఁడు, అనాథను రోదన పరాయణురాలను నగు నన్ను గళంకితను గావించెను." అని తనకన్య చెప్పఁగా శుక్రాచార్యుని నయనద్వయము రోషకషాయిత మైపోయెను. అతఁ డప్పుడు పవిత్రుఁడై యాచమించి యిట్లు పలికెను. "దండరాజు మదాంధుఁడై నాయాజ్ఞను, భయమును, గౌరవమును సూర్చి లక్ష్యము సేయక యరజను ధర్మచ్యుతను గావించెను. ఈయపరాధముచే సప్తరాత్రములలో నాతఁడు రాజ్య, భృత్య, సైన్య, వాహనసమేతముగా భస్మీభూతము కాఁగలఁడు." అని మునివరుఁడైన శుక్రుఁ డిట్లు దండు నభిశప్తుని గావించి, యరజను జూచి "బిడ్డా! నీవు పాపప్రక్షాళనముకొఱకుఁ దపమాచరించుచు నిచ్చటనే యుండుము." అని చెప్పెను. ఇట్లు చెప్పి భగవానుఁడైన శుక్రుఁడు దండునకు శాపమిచ్చి తాను దానవులముఖ్యపట్టణమైన పాతాళమున కేఁగెను.

తరువాత దండరాజు విశేషమైన తన బలగర్వమునకు ఫలముగా సప్తరాత్రములలోనే రాజ్య బల వాహనములతోఁగూడ భస్మీపటలమైపోయెను. ఈకారణముచేతనే దేవతలు దండకారణ్యమును బరిత్యజించిరి. ఇందువలననే శంభుఁడా యరణ్యమును రాక్షసుల కావాసముగాఁ జేసివేసెను. ప్రకృతులైన మనుష్యుల నిట్లే పరాంగనలు సుకృతహీనులను, బరాభూతులను, భస్మీభూతులను గావింతురు. కనుక నోయంధకా! నీ వింక దుర్బుద్ధిని మరలించుకొనుము. సాధారణనారి యే యిట్లు దురాత్ములను భస్మముచేయఁజాలియుండఁగా నిఁక గిరినందిని సంగతి యేమి చెప్పనలయును? ఓదైత్యరాజా! మహాదేవుని జయించుటయు సురాసురులకు సాధ్యమైనపనిగాదు. విశేషించి యెవ్వనిని దర్శించుటకైనను సుకృతము చాలదో, అట్టివానిని రణక్షే

త్రినూన జయించుట మున్మాటికి నసంభవము. అని ప్రహ్లాదుఁడు చెప్పఁగా నంధకుఁడు క్రోధకషాయితనేత్రుఁడై పెద్దనిట్టూర్పును విడిచి తేజుఁడను నసురునితో నిట్లు పలుకఁజొచ్చెను. "ఓయసురా! మహాదేవున కొకధర్మ మనునది లేదు. ఆతనికిఁ గల విశేషము శరీరమంతయు భస్మముపూసికొనుటయే. ఆయే కాకి నాతో యుద్ధమొనరింపఁ గలఁడా? అంధకుఁడు స్వయముగా నిందుఁడైనను భయపడువాఁడు గాఁడు, ఇఁక నాతనికి మనుష్యులవలన నంతకన్నను పే భయములేదు ఇప్పు డీవృషభము నెక్కి తిరిగెడి మహాదేవుఁ డనువాని కాతఁడేల భయపడును?" అని యంధకాసురుఁడు పలుకఁగాఁ బ్రహ్లాదుఁ డాతని ధిక్కారవాక్యములను విని యాతని కిట్లనియెను. "నీవిప్పుడు పలికినపలుకు లొకపక్షములో ధర్మవిరుద్ధములు, నింకొకపక్షములో నర్థవిరహితములు నై యున్నవి. నిజముగా నీమాట లత్యంతనిందనీయము లగుటచే నెన్నఁడును శుభమార్గములు గావు. ఓయంధకా! వహ్నికిని బతంగమునకును, సింహమునకును సృగాలమునకును, గజేంద్రమునకును మశకమునకును, స్వర్గమునకును బాతాళమునకును బరస్పరభేద మెంతగాఁ జెప్పఁబడియున్నదో, మహాదేవునకును నీకును నంతకంటెను ప్రభేద మగపడుచున్నది. కనుక నోవీరా! నిన్ను నేను మరలమరల నివారించుచున్నాను. మఱియు నివారింపఁగలను; నీ వాతనికిఁ బ్రతిద్వంద్విగాఁ బోవలవదు. మహామతియు మహర్షియునైన యసితుఁ డీవిషయమున నేమిచెప్పెనో వినుము.

ప్రజనుఁడు ధర్మశీలుఁడై యభిమానియు రోషవిజయుఁడును, విద్వాంసుఁడు వినయుఁడును నగుచున్నాఁడో యాజనున కెప్పుడును నెందువలనను సంతాపముగాని, క్లేశముగాని కలుగదు, స్వదారయందుఁ బరితుష్టుఁడును, బరదారయందుఁ బరాఙ్ముఖుఁడును నగువానికిఁ

బ్రపంచములో నేమియు భయకారణ ముండదు. ధర్మహీనుఁడు, కల
హప్రియుఁడు, సదా పరోపతాపి, శ్రుతిశాస్త్రవర్జితుఁడు, పరధనపర
దారాసక్తుఁడు, అవర్ణసంగమకారియు నైనవాఁ డిహమునందును బర
మునందును నెందును సుఖమొందఁజాలఁడు. ఇందుకొఱకే భగవానుఁ
డైన ప్రభాకరుఁడు ధర్మమర్యాదల నుల్లంఘింపకుండెను. భగవానుఁ
డైన వారుణిముని రోమహరాయణుఁడు కాకుండెను. సూర్యసుతుఁడైన
మనువు విద్యాన్వితుఁ డయ్యెను. మఱియు నగస్త్యముని నిరంతరము
ను స్వదారయందు సంతుష్టచిత్తుఁ డయ్యెను. ఈమహాపురుషు లంద
ఱును కులక్రమాగతవిధివాక్యములకు వశులై యెప్పుడును తాపసులు
గారు, సర్వదా వీరు పుణ్యమునే యనుష్ఠింతురు; అందుచే వీరందఱు
ను తేజస్వులే, యందఱును శాపవరదానసమర్థులే, అందఱును సురపితృ
నిత్యపూజితులే.

పూర్వమునం దుర్గముఁడను నాతఁ డధర్మసేవాలిప్తుఁడై యుం
డెడివాఁడు. వీఁ డనువాఁడు నిత్యము కలహప్రియుఁడుగా నుండెడి
వాఁడు, దురాత్ముఁడైన నముచి నిరంతరముఁ బరపీడనము గావించుచుం
డువాఁడు, సంకరజాత్యధికగర్వితుఁడై యుండువాఁడు, హిరణ్యకశిపుఁ
డెప్పుడును బరధనాసక్తుఁడుగా నుండువాఁడు, వానియనుజుఁడు మూర్ఖుఁ
డును దుర్బుద్ధియు నై యుండువాఁడు, మఱియు నుత్తమోజుఁ డనుయ
దువు సువర్ణస్తేయ మొనరించుచుండువాఁడు, అన్యాయాచరణఫలము
చే వీరందఱును మృత్యుముఖము బడిపోయిరి. అందుచే ధర్మ మె
ప్పుడును బరిత్యజింపవలదు. అదియే పరమగతి, మనుష్యులు ధర్మహీ
నులైనచో మహారౌరవమునందును వారికిఁ జోటుండదు. స్వర్గమునం
దును, మర్త్యమునందును, సర్వత్ర ధర్మ మొక్కటిమాత్రమే మను
ష్యుల నుద్ధరింపఁగలది. అధర్మఫలముచేతనే మనుష్యు లిహపరకాల

ములయందుఁ బతితులగుచున్నారు. ధర్మిష్ఠులైనవారు సర్వదా పరదారవిముఖులు గావలయును. ఏమన? పరదార యొక్కటియే యిరువదియొక్క నరకములయందుఁ బడుటకు నిదాన మగుచున్నది. పరదార పరిహార మన్నివర్ణములకును బవిత్రముఖ్యధర్మ మని చెప్పఁబడినది. ఏజనుఁడు పరధనపరదారాసక్తుఁ డగుచున్నాఁడో వాఁడు బహువర్షములు రౌరవనరక మనుభవింపవలయును. దేవర్షియైన యసితుఁడు పూర్వమందు గిరుడాదులదగ్గఱ నిట్లు ధర్మనిర్ణయము గావించెను. విజ్ఞులైనవా రెప్పుడును దూరమునుండియే పరదారను బరిహరింపఁగలరు. అజ్ఞజనులుమాత్రము పరదారసేవయందే పరాభూతులై పోవుచున్నారు." అని ప్రహ్లాదుఁడు చెప్పఁగా విని యంధకుఁ డిట్లనియెను—"నీవు ధర్మనిష్ఠుఁడవై ధర్మానుష్ఠానమును జేయుచుందువుగాక. నేను ధర్మము నాచరింపఁజాలను." అని చెప్పి యంధకుఁడు శంబరుని బిలిచి యాతని కిట్లాదేశించెను—"శంబరా! నీవు సత్వరముగా శైలేంద్రమైన మందరమున కేఁగి శంకరుని జూచి—'భిక్షుకుఁడా! నీ వీసుందరకందరమైన మందరము నెందులకు రక్షించుచున్నావు? నీయుద్దేశమేమో తెలియఁజేయుము. శక్రాదిదేవత లెవ్వరును నాశాసనము నుల్లంఘింపఁజాలరు. ఇఁక నీవు నన్నతిక్రమించి యీమందరాచలమునం దెట్లువాసముచేయఁగలవు? మందరము నీ కేకాంతప్రియనికేతనమే యైనచో నాయాజ్ఞను నెఱవేర్పుము. నీపత్నిని నాకు సమర్పింపుము.' అని నే ననుజ్ఞ యిచ్చుచున్నానని తెలియఁజేయుము." అంధకుఁ డిట్లాదేశింపఁగా నాతనియాజ్ఞను శంబరుఁడు శిరసావహించి భవానితో శంకరుఁ డధిష్ఠించియున్న మందరాచలమునకు సత్వరముగాఁ బ్రయాణము చేసెను.

అనంతర మాతఁ డచ్చటి కేఁగి శంబరునియాదేశవాక్యములు

తూచా తప్పకుండ శంబరునిసన్నిధిని విన్నవించెను. మహాదేవుఁ డప్పు డు భవానీసన్నిధానమునందే వాని కిట్లు ప్రత్యుత్తర మొసఁగెను. ధీమంతుఁడైన యింద్రుఁడు నా కీమందరపర్వతమును దానముచేసెను. అతనియనుమతి లేకుండ నేను దీని నిప్పుడు పరిత్యజింపఁజాలను. ఇఁక రెండవది, యంధకుఁ డేగిరిబాలను వాంఛించి నన్నుఁ బుత్తెంచెనో, ఆవిషయములో నాయుత్తర మేమనఁగా, నీమెకు సమ్మతమైనచో నట్లే వెడలవచ్చును. నే నీమెను నిర్బంధించి యుంచుకొనలేదు." అని శివుఁ డు పలుకఁగాఁ దరువాత గిరిసుతయు శంబరు నుద్దేశించి "ఓవీరా! నీవేఁగి నేను జెప్పినట్లుగా నభిజ్ఞుఁడైన యంధకున కీమాటలను జెప్పుము. "నేను బదాతిగా నుండెదను. నీవును హరుఁడును బ్రాణరూప మైన ద్యూతక్రియలోఁ బ్రవేశించి యెవ్వరు నన్ను జయించుటకు సమ ర్థు లగుదురో వారే నన్నుఁ గైకొనవలయును."— ఇట్లు పార్వతి చె ప్పఁగా బుద్ధిమంతుఁడైన శంబరుఁడు సంగతిని గ్రహించి శంబరుని వద్ద కేఁగి హరపార్వతులచే వంచింపఁబడిన సకలవాక్యములు యథా యథగా విన్నవముచేసెను. అది విని యంధకుఁడు క్రోధమూర్ఛితనయ నుఁగై నిట్టూర్పునిగుడ్చి దుర్యోధనుని బిలిచి యిట్లుచెప్పెను. "మహా భుజా! నీ వేఁగి యిప్పుడే దుశ్శీలయైనరమణియుంబోలె నతురాలంకా రమున నుపయోగినియై యున్న దృఢదుందుభిని నిస్సంకోచభావము తోఁ దాడన మొనరింపుము." ఇట్లంధకుని యాదేశమును బొందిన వెంటనే దుర్యోధనుఁడు తనబలవీర్యవేగముల కనురూపమైన దృఢభా వముతో దుందుభిని మ్రోయింపఁజొచ్చెను. బలవంతుఁడైన దుర్యో ధనుని దృఢతాడనముచే నాభేరి యప్పుడు రాసభివలె భైరవరవముతో మరలమరల నినాద మొనరింపఁజొచ్చెను. ఆదుందుభిధ్వని విని మహా సురు లందఱును 'భేరి మ్రోగుచున్న దెందులకో' యని యొండొ

రులు ముచ్చటించుకొనుచు నత్వరము పభాస్థలమున కేతెంచిరి. సేనాపతియగు బలవంతుఁడైన దుర్యోధనుఁడు వారందఱకు సకలవృత్తాంతము జరిగినదిజరిగినట్లుగా నెఱింగించెను. అప్పుడాప్రబలమహాసురసైన్యము యుద్ధాభిలాషతో బద్ధసన్నాహమై యంధకునివెంట గజములను, అశ్వములను, ఉష్ట్రములను, రథములను నధిరోహించి బయలు దేఱెను. అంధకాసురుఁ డప్పుడు పంచనల్వప్రమాణము గల తనరథము నధిరోహించి మహాదేవుని జయించునభిప్రాయముతో బయలుదేఱెను. అప్పుడు జంభుఁడు, కుజంభుఁడు, హుండుఁడు, తుహుండుఁడు, శంబరుఁడు, బలి, బాణుఁడు, కార్తస్వరుఁడు, హస్తి, సూర్యశత్రుఁడు, మహోదరుఁడు, అయఃశంకుఁడు, శిబి, శాల్వుఁడు, వృషపర్వుఁడు, విరోచనుఁడు, హయగ్రీవుఁడు, కాలనేమి, సంహ్రాదుఁడు, కాలనాశనుఁడు, సరభుఁడు, శలభుఁడు, వీర్యశాలి, వృత్రుఁడు, దుర్యోధనుఁడు, పాకుఁడు, విపాకుఁడు, కాలుఁడు, శంబరుఁడు మొదలగువారును, మఱియుఁ దక్కిన మహాబలశాలులు, మహావీర్యులు నగు బలవంతులును వివిధాయుధధారులై యుద్ధార్థము బయలుదేఱిరి. దురాత్ముఁడును, దైత్యపతియు నగు నంధకుఁడు, గుహ్యకేశుఁడై కాలనేమిచే యంత్రితుఁడై యుండెను. కావున నే మహాదేవునితో యుద్ధము సేయుటకై మహాచలమైన మందరపర్వతమున కరుదెంచెను.



# స్త్రీల వ్రతకథలు.

(బాలాంత్రపు వేంకటరావుచే రచింపఁబడినవి.)

ఇవి బాలికలకును స్త్రీలకందఱకును అత్యంతోపయుక్తములుగ నుండునట్లు రచింపఁబడినవి. ఆంధ్రులలో నోములు పట్టని స్త్రీలుండరు. పూర్వమునవి కథలు వచ్చిన పెద్దముత్తైదువలు లేని యీయిరువదియవశతాబ్దిని, స్త్రీలలో విద్య వ్యాపించుచున్న యిప్పుడు, స్త్రీలందఱును సులభముగఁ జదువుకొని యీనోములు పట్టుటకై సులభశైలిని రచింపఁబడినవి. ఎంతకాలముక్రిందటనో 1, 2 భాగముల 1–2 కూర్పులు చెల్లిపోయినవి. మరల మూఁడవకూర్పును, 3 వ భాగము మొదటి కూర్పును ముద్రించినాము

ఇవి మూఁడుభాగములుగ, భాగమునకు 32 నోములు(ఉద్యాపనములసహా)చొప్పున మూఁడుభాగములలోను 97 నోములు కలవు. వెల భాగము 1 కి 0—6—0. పోస్టేజి కొనువారే భరింపవలెను. 1, 2, 3 భాగములు వెలకు సిద్ధముగ నున్నవి.

ప్రథమభాగము —1 పెండ్లిచేటిపద్మము (మూఁగనోము) 2 పదారుకుడుముల తద్దెకథ, 3 ఉండ్రాళ్ళతద్దెకథ, 4 అట్లతద్దెకథ, 5 శ్రావణమంగళవారముకథ, 6 వరలక్ష్మీవ్రతకథ, 7 చిట్టిబొట్టుకథ, 8 పసుపుగౌరికథ, 9 మొగదోసిళ్ళకథ, 10 చిత్రగుప్తునినోముకథ, 11 విష్ణుకాంతకథ, 12 కందగౌరికథ, 13 ఉప్పుగౌరికథ, 14 గణేశునినోముకథ, 15 గోడిసెనోముకథ, 16 వావిల లక్ష్మీవారముకథ, 17 మారేడుదళముకథ, 18 సంపద శుక్రవారము నోముకథ 19 మార్గశిరలక్ష్మీవారముకథ, 20 శోకములేని సోమవారముకథ, 21 పూర్ణాదివారముకథ, 22 గౌరీకుంకుమనోముకథ, 23 వెలగలగౌరికథ, 24 ఆపదలేని ఆదివారముకథ, 25 ముప్పదిమూఁడుపున్నములనోముకథ, 26 కుందేటి అమావాస్యనోముకథ, 27 దంపత్తాంబూలమునోముకథ, 28 పదహారుఫలములనోముకథ, 29 సౌభాగ్యతదియలుకథ, 30 మాఘపాదివారముకథ, 31 సూర్యపద్మముకథ, నందికేశ్వరవ్రతకథ

ద్వితీయభాగము—1 గాజులగౌరీదేవికథ, 2 గ్రహణగౌరికథ, 3 పోలిస్వర్గమునవెళ్ళుకథ, 4 పోలాలమావాస్యకథ, 5 కుళ్ళుగౌరీదేవికథ, 6 నిత్యశృంగారముకథ, 7 ఉదయకుంకుమనోముకథ, 8 కుంకుమగౌరినోముకథ, 9 చిక్కుళ్లగౌరికథ, 10 తవుడుగౌరికథ, 11 శాకదానముకథ, 12 చద్దికూటిమంగళవారములకథ, 13 రేగులగౌరికథ, 14 పండుతాంబూలములనోముకథ, 15 మునికార్తికవ్రతము, 16 కన్నెతులసెమ్మకథ, 17 కాటుకగౌరికథ, 18 అట్లమీఁదఅవపువ్వులకథ, 19 పసుపుపువ్వుల నోముకథ, 2 కార్తిక పదిమిన్నినోముకథ, 21 తెరగిసాదివారములకథ, 22 గుమ్మడిగౌరికథ, 23 పువ్వులతాంబూలములనోముకథ, 24 గంధంతాంబూలాలనోముకథ, 26 పసుపుతాంబూలములకథ, 27 మాఘగౌరికథ, 28 బాలాదివారముకథ, 29 బచ్చలిగౌరికథ, 30 భాగ్యలక్ష్మికథ, 31 చిలుకముగ్గులనోముకథ, 32 బొమ్మలనోముకథ

తృతీయభాగము—1 అన్నము పెట్టని ఆదివారాలనోము, 2 ములగగౌరినో

ము, 3 అంగరాగాలనోము, 4 అమావాస్యసోమవారాలనోము, 5 నిత్యశుభతి నోము, 6 కడుపుచెదరని గౌరీదేవినోము (దీనిని పొట్టకదలని గౌరీదేవి అందురు) 7 నిత్యస్నానమునోము, 8 నిత్యధాన్యమునోము, 9 భాగ్యగౌరినోము, 10 దీపదానము నోము, 11 నవగ్రహదీపాలనోము, 12 పెద్దసంక్రమణదీపాలనోము, 13 విష్ణువిదియల నోము, 14 కాలసంక్రమణదీపాలనోము, 15 కైలాసగౌరినోము, 16 చల్లచిత్తినోము, 17 సిరుగుమీద పేరిన నెయ్యినోము, 18 పిష్టకవాలాలనోము, 19 సూర్యచంద్రుల నోము, 20 బారవత్తులు మూరవత్తులనోము, 21 అక్షయబొండాలనోము, 22 లింగ దానమునోము, 23 గూనదీపాలు గూనసోలలనోము, 24 సహస్రసహస్రఫలాలనో ము, 25 పెండ్లిగుమ్మడినోము, 26 మూగినాయనాలనోము, 27 భాగ్యదివారాల నోము, 28 మూలగౌరినోము, 29 కృత్తికదీపాలనోము, 30 గతాలగౌరినోము, 31 లక్షపసుపునోము, 32 గడపగౌరినోము, 33 కల్యాణగౌరినోము

మూఁడుభాగములును ముద్రణమై సిద్ధముగానున్నవి. విరివిగాకొను వర్తకులకు మంచి కమీషను ఇయ్యఁబడును

శాలాంత్రపు వేంకటరావు

ప్రతులు వలయువారు —

నడకుదుటి వీరరాజు పంతులుగారు,

సంపాదకుడు,

పురాణగ్రంథమాలిక,

పిఠాపురము.

అని వ్రాయవలెను.